మన

# రైతువాణి

మాసపత్రిక

జూలై 2005, వెల: రు. 6/-



నష్టాల ఊబిలో ఉప్పు రైతులు



శ్రీవరి సాగు







# నమ్మకం, విశ్వాసం ...




పంటల నుండి అధిక లాభాలను పొందాలనుకునే రైతులందరికీ మంచి విత్తనాలను ఎన్నుకోవడం క్లిష్టతరమవుతున్న ప్రస్తుత తరుణంలో **"నూజివీడు విత్తనాలు"** రైతులకు కొండంత అండగా నిలుస్తున్నాయి. 30 సం॥లు పైబడి రైతులకు నాణ్యమైన అధిక దిగుబడులనిచ్చే హైబ్రిడ్ విత్తనాలను అందించే సేవలో నిరంతరం కృషి చేస్తోన్న నూజివీడు విత్తన సంస్థ అందించే ప్రతీ విత్తనం అత్యుత్తమ నాణ్యతకు ప్రతీక. రైతుల అవసరాలకనుగుణంగా విస్తృతమైన మౌళిక సదుపాయాలను ఏర్పాటుచేసుకొని, ఆధునిక, సాంకేతిక పరిజ్ఞానంగల పరిశోధనా క్షేత్రాలలో మేలైన విత్తనాలను రూపొందిస్తూ, పంట యాజమాన్యంపై మెళకువలు తెలియజేస్తూ , దేశ నలుమూలలా వాటిని పరీక్ష చేసిన తర్వాత రైతులకు అందజేయబడుతున్నాయి. తత్ఫలితమే ఆశించిన రీతిలో దిగుబడులు, అత్యుత్తమ నాణ్యతకల్గిన ఉత్పత్తులు, మార్కెట్లో మంచి ధరలు. రైతుకు ఇంతకుమించి కావల్సిందేమిటి ? నమ్మకం, విశ్వాసం గల నూజివీడు విత్తన సంస్థ తోడుంటే రైతింట సిరులే !

ఇప్పుడు **బన్ని బి.టి.,** మరియు **మల్లిక బి.టి.** పత్తి విత్తనాలు మీ డీలర్ ద్వారా అందజేస్తున్నాము.

---

**కార్పొరేట్ ఆఫీస్ :**

**7C, సూర్యటవర్స్, ఎస్.పి. రోడ్, సికింద్రాబాద్ - 500 003**




**నూజివీడు సీడ్స్ లిమిటెడ్**

# యాత్రలు - సదస్సులు సరే! మరి పరిష్కారం?.....

సంపాదకీయం

రాష్ట్ర రైతాంగాన్ని చైతన్యపరచటానికి గత సంవత్సరం అధికారం చేపట్టిన ప్రభుత్వం రైతుయాత్రలు, సదస్సులు అట్టహాసంగా నిర్వహించింది. ఇవి జయప్రదంగా జరిగాయని, రైతుల సమస్యల పరిష్కారానికి బాగా ఉపయోగపడ్డాయని ప్రభుత్వం ప్రకటించింది. ఏప్రిల్‌లో చైతన్య యాత్రలు, మే-జూన్ నెలలో చైతన్య సదస్సులు, పల్లెబాట జరిగాయి. శాసన సభ్యులు మొదలు ముఖ్యమంత్రి వరకు ఈ పేరుతో ప్రజల వద్దకు వెళ్ళారు. రైతు చైతన్య సదస్సులకు ముఖ్యమంత్రి రాజశేఖరరెడ్డిగారు ఆకర్షణగా నిలిచారు. పాలకుల పర్యటనలు, ఉపన్యాసాల ఘట్టాలు ముగిసాయి. రైతుల సమస్యల పరిష్కారాలు మాత్రం " ఎక్కడ వేసిన గొంగళి అక్కడే" ఉన్నట్లున్నాయి. 20 రోజులు ఆలస్యంగా వచ్చిన వర్షాలకు విత్తనాలు చల్లే కార్యక్రమం మొదలు పెట్టాలంటే విత్తనాల కొరత, నాణ్యతలేని విత్తనాల బెడద, కల్తీల జోరుకొనసాగుతూనే ఉంది. అవకతవకలకు పాల్పడిన విత్తన వ్యాపారులను బజారులలో తిప్పండని వ్యవసాయ శాఖామాత్యులు రైతులకు పిలుపిచ్చారంటే కల్తీ వ్యాపార సామ్రాజ్యం ఎంత విస్తరించిందో గమనించవచ్చు.

వరి, వేరుశనగ, పొగాకు, పత్తి, మిరప పంటలు వేయరాదని ప్రభుత్వం రైతులకు సలహాలివ్వడమేకాక ఈ పంటలు వేసిన వారికి రుణాలు తగ్గించి, వారి నిరుత్సాహపగచాలని పాలకులు బ్యాంకర్లకు సూచనలు చేస్తున్నారు. ఈ పంటలకు బదులుగా పప్పుధాన్యాలు, ముతక ధాన్యాలు (రాగులు, సజ్జలు, కొర్రలు) తోటలు, కూరగాయలు పండించాలని ప్రోత్సహిస్తున్నారు. గత టిడిపి ప్రభుత్వం వాణిజ్య పంటలు పండించి ఎగుమతులు చేయాలన్నారు. ఈ ప్రభుత్వం అందుకు విరుద్ధంగా ముతక ధాన్యాలు పండించమంటున్నది. గతంలో చేసిన రుణాలు ముతక ధాన్యాల పంటల ఆదాయంతో తీరతాయా? పాలకులే చెప్పాలి.

రుణాల పంపిణీని పరిశీలిస్తే యాత్రలలో, సదస్సులలో మంత్రులు చెప్పిన దానికి పూర్తి భిన్నంగా ఉంది. 2005-06 లో పంట రుణాలు రాష్ట్రంలో రు. 13300 కోట్లు, దీర్ఘకాలిక రుణాలు రు. 3450 కోట్లు పంపిణీ చేస్తామని నిర్దేశించారు. కానీ జరుగుతున్నదేమిటి? ప్రభుత్వం సకాలంలో రుణాలు చెల్లించిన వారికిచ్చే 6 శాతం వడ్డీ రాయితీని ఆశజూపి, మిగిలిన 5 శాతం వడ్డీని రైతు నుండి వసూలు చేసి రుణాలను " బుక్ అడ్జస్టుమెంట్" చేస్తున్నారు. రైతుకు రుణం అందకున్నా రుణం పొందినట్లు నివేదికలలో చూపిస్తున్నారు. పంట రుణాలు ఆయా జిల్లా టెక్నికల్ కమిటీలు నిర్ణయించినట్లు స్కేలు ఆఫ్ ఫైనాన్స్ ప్రకారం రుణాలిస్తే రైతుల అవసరాలు తీరతాయి. అలాకాక ఎంత భూమి తాకట్టుపెట్టినా హక్కుగా రావాల్సిన పంట రుణాలలో బ్యాంకులు నాల్గవ వంతు మాత్రమే ఇస్తున్నాయి. మిగిలిన పెట్టుబడికి ప్రైవేటు వడ్డీ వ్యాపారులపై ఆధారపడాల్సి వస్తున్నది. దీనికి తోడు గత సంవత్సరం 911 మండలాలు కరువు మండలాలుగా ప్రభుత్వం ప్రకటించింది. పంటలేని ఆ మండలాలలో రుణాలు ఎలా వసూలవుతాయి? రుణాలలో కోత పెట్టడమేకాక సహకార వ్యవస్థకే కోత పెట్టి 2000 సొసైటీలను ఎత్తి వేస్తున్నారు. ఇవన్నీ వెనుకబడిన ప్రాంతాలలోనే ఉన్నాయి. ఇక రుణాలెక్కడ?

వ్యవసాయ సంక్షోభ నివారణకు ప్రొ॥ జయతీఘోష్ కమిషన్ ప్రతిపాదనలను అమలు చేయాలని రాష్ట్ర వ్యాపితంగా రైతులు ఆందోళనలు చేస్తున్నారు. ప్రభుత్వం అంగీకరించిన సూచనలనే అమలు చేయాలని రైతులు కోరుతున్నారు. అన్ని జిల్లాలలో సదస్సులు జరిపారు. సమస్యను ప్రభుత్వం దృష్టికి తెచ్చారు. అయినా ఆ నివేదికలో ఏ ఒక్క సూచనను ప్రభుత్వం అమలు జరిపే వైపు దృష్టి సారించలేదు. ఫలితంగా రైతులలో అసహనం, అసంతృప్తి పెరుగుతున్నాయి. ఉప్పు, కొబ్బరి రైతులకు ధరలు తగ్గాయి. తగ్గడమంటే గత సంవత్సరం ధరలో 60 శాతం ధరలు తగ్గాయి. ఖరీఫ్‌లో పండిన మిర్చి, పత్తి, పసుపు, పంటల పరిస్థితి కూడా అంతే. నేడు ఏ పంట వేయాలన్న సందిగ్ధంలో రైతులున్నారు. ప్రభుత్వ ప్రోత్సాహం ఒక తీరుగా ఉంటే వాస్తవాలు మరొక తీరుగా ఉన్నాయి. వ్యవసాయ శాఖ రైతులకు ఏ పంటలు వేయాలో చెప్పగల్గిన స్థితిలోలేదు. యాత్రల ద్వారా, సదస్సుల ద్వారా చైతన్యం పొందిన రైతులకు ప్రభుత్వం ఏం చేస్తున్నట్లు? గత ప్రభుత్వం ఇంతకు మించి వివిధ పేర్లతో రైతులవద్దకు వెళ్ళింది. కాని ఏ ఒక్క హామీని అమలు జరుపక రైతుల ఆగ్రహానికి గురై పాలక పక్షం నుండి ప్రతిపక్షానికి మారింది. గత చరిత్రను నేటి పాలక వర్గం విస్మరిస్తున్నట్లున్నది.

ప్రభుత్వం ఒకవైపు సదస్సులు, యాత్రలు జరుపుతుండగా మరోవైపు రైతులు ఆత్మహత్యలు కొనసాగుతూనే ఉన్నాయి. తమ, తమ సమస్యలపై పెద్ద ఎత్తున ఆందోళన సాగిస్తున్నారు. అధికారులను, పాలకులను నిలదీస్తున్నారు. ఇలాగే కొనసాగితే పరిస్థితి మరింత దిగజారిపోతుంది. ప్రభుత్వం ఇచ్చిన హామీలు, ప్రకటించిన విధానాలు అమలు జరపాలని రైతులు కోరుతున్నారు. వారి కోర్కెలు మన్నించడం ద్వారానే ప్రభుత్వం, పాలకులు సాగించిన యాత్రలు, సదస్సులు వాస్తవంగా జయప్రదమవుతాయితప్ప, ఆచరణలేని ప్రచారాల ద్వారా పాలకులు జయప్రదంకాలేరు. ఇప్పటికైనా ప్రభుత్వం ప్రకటనలకే పరిమితం కాకుండా అమలువైపు దృష్టిసారిస్తుందని ఆశిద్దాం! ☆

# రైతువాణి

జూలై - 05

సంపుటి : 16 సంచిక : 6

వెల : 6 రూపాయలు

పేజీలు : 52

సంవత్సర చందా : రు. 60





## చిరునామా

ఎడిటర్, మన రైతువాణి

1-1-9/10/1, జవహర్‌నగర్

ఆర్.టి.సి. క్రాస్ రోడ్స్, హైదరాబాద్-20

ఫోన్ : 27646580, 27605413

ఇ-మెయిల్ :

hyd2_rytuvani@sancharnet.in


గమనిక : చెక్కులు, డి.డి.లు **మన రైతువాణి** పేరుతో మాత్రమే పంపాలి

## ఈ మాసం కార్టూన్




## విషయ సూచిక

# శ్రీ వరి సాగు పద్ధతులు



సిస్టం ఆఫ్ రైస్ ఇంటెన్సిఫికేషన్ అన్న పదాల ఆంగ్ల పొడి అక్షరాలు- శ్రీ. అదే పేరుతో దీనిని తెలుగులో 'శ్రీ' పద్ధతి అంటున్నాం. దీనిని 1983లో మడగాస్కర్‌లో అభివృద్ధి పర్చారు. ఇప్పుడు ప్రపంచ వ్యాప్తంగా అన్ని దేశాలలో, అన్ని ప్రాంతాలలో శ్రీ (SRI) పద్ధతిలో వరి సాగు చేస్తున్నారు.

మామూలుగా అధిక దిగుబడి కావాలంటే ఎక్కువ పెట్టుబడులు, ఎక్కువ విత్తనం, ఎక్కువ నీరు కావాలని అనుకుంటాం. ఇందుకు విరుద్ధంగా శ్రీ పద్ధతిలో తక్కువ విత్తనం, తక్కువ నీరుతో ఎక్కువ దిగుబడి పొందవచ్చు. రసాయనిక ఎరువులు మాని వేసి సేంద్రియ ఎరువులు వాడాలన్నది 'శ్రీ' పద్ధతిలో చాలా కీలకమైనది. అప్పుడే దీని ఫలితాలు ఆశించినంతగా ఉంటాయి.

'శ్రీ' అనేది వరిలో ఒక రకం విత్తనం కానీ, వంగడం కానీ కాదు. ఇదొక సాగు పద్ధతి మాత్రమే. ఈ పద్ధతిలో ఏ వరి రకాన్నైనా సాగు చేయవచ్చు.

సాంప్రదాయ సేద్యానికి ఓ ప్రత్యామ్నాయం చూపుతున్న 'శ్రీ' పద్ధతిలో వరి సాగుకు సంబంధించిన పాటించాల్సిన కొన్ని ముఖ్యమైన అంశాలను ఇక్కడ తెలుసుకుందాం.

**అనువైన భూముల ఎంపిక :**

శ్రీ పద్ధతిలో వరిసాగు చేయటానికి చౌడు భూములు పనికి రావు. చౌడు భూములలో నీరు నిల్వ గట్టి వరిసాగు చేసినపుడు మంచి దిగుబడులు వస్తాయి. కానీ శ్రీ పద్ధతిలో నేలను మధ్య మధ్యలో ఆరగడుతూ ఉండాలి. ఇలా ఆరగట్టినప్పుడు చౌడు భూములలోని ఉప్పు లవణాలు పైకి వస్తాయి. దీంతో వరి మొక్కలు చనిపోతాయి.

కాబట్టి శ్రీ పద్ధతిని పాటించదలుచుకున్న వాళ్ళు ముందుగా పరీక్ష చేయించి అన్ని వివరాలు తెలుసుకోవాలి.

శ్రీ పద్ధతిలో వరిసాగు చేయడానికి ఎంచుకునే భూమి చదునుగా ఉండాలి. నీళ్ళు పెట్టినప్పుడు అవి మడి అంతా సమంగా పారాలి. అదే విధంగా చేలో ఎక్కువ నీళ్ళు ఉన్నప్పుడు వాటిని తీసేసే మార్గం – అంటే మురుగు నీరు పోయే సౌకర్యం ఉండాలి. కాబట్టి శ్రీ పద్ధతిలో వరిసాగు చెయ్యదలుచుకున్నవారు మడులను బాగా చదును చేసుకోవాలి. మురుగు నీరు ఎక్కువగా ఉన్న నీరు పోయే కాల్వలు అవసరమైతే కల్పించుకోవాలి. పొలానికి బాగా ఎండ తగిలేటట్లు ఉండాలి.

**భూసారం పెంచుకోవటం :**

శ్రీ పద్ధతిలో రసాయనిక ఎరువుల కంటే సేంద్రియ ఎరువులు వాడటం వల్ల మంచి ఫలితాలు ఉంటాయి. కాబట్టి సేంద్రియ ఎరువుల ద్వారా భూసారాన్ని పెంచే పద్ధతులను ముందు నుంచే చేపట్టాలి. కింద పేర్కొన్న కనీసం ఏ రెండు పద్ధతులనైనా తప్పకుండా పాటించాలి.

1. చెరువు మట్టి వేయడం : ప్రతి మూడు సంవత్సరాలకు ఒకసారి ఎకరానికి 15-20 బండ్లు చెరువు మట్టి తోలాలి. దీనివల్ల పంట దిగుబడులు పెరుగుతాయి. నేలకు నీటిని పట్టి ఉంచే శక్తి పెరుగుతుంది.

2. పెంటపోగు ఎరువు : శ్రీ పద్ధతిలో సాగు చేసే వరికి బాగా కుళ్ళిన పెంట పోగు ఎరువు / పశువుల పెంట తప్పని సరిగా వెయ్యాలి. ఎకరానికి కనీసం పదిహేను బండ్లు, లేదా

మూడు ట్రాక్టర్ల (6 టన్నులు) పశువు ఎరువు సరిపోతుంది. ఎరువు బాగా నాణ్యమైనదిగా ఉండాలి. ఈ క్రమంలో ఇటీవల వానపాముల (జెర్రలు) ఎరువు తయారీ, వినియోగం కూడా ఎక్కువవుతోంది.


మార్కరు ఆధారంగా నాటుపెట్టడం

3. పచ్చిరొట్టపైరు : పచ్చిరొట్ట పైరు భూమి సారాన్ని పెంచటానికి ఎంతగానో సహాయ పడుతుంది. పచ్చిరొట్ట పైరు సగం పూత దశలో ఉండగా దున్ని, నేలలో కలిపి మురగపెడతారు. సాధారణంగా జీలుగ, జనుము వంటి పంటలను పచ్చిరొట్ట పైరుగా సాగు చేస్తారు. పచ్చిరొట్ట పైరు పెరగటానికి 45 రోజులు, అది మురగటానికి పది రోజులు పడుతుంది. పచ్చిరొట్ట పైరును దున్ని, నేలలో కలిపిన రోజు నారు మడి పోసుకుంటే పచ్చిరొట్ట పైరు కుళ్ళిపోయే సమయానికి నారు మడి తయారవుతుంది.

4. పశు జీవాలు మంద కట్టడం : ఇది సాంప్రదాయంగా పాటిస్తున్న పద్ధతే. పశువులు, గొర్రెలు, మేకలను మందలు, మందలుగా పొలాల్లో రాత్రిపూట విడిచి పెడతారు. వాటి మూత్రం, పేడ వల్ల నేల సారవంతమవుతుంది.

**నారు పెంపకం :**

శ్రీ పద్ధతిలో 8-12 రోజుల నారును నాటుతారు. కాబట్టి నారుమడి తయారీలో, నారు పెంపకంలో తగు జాగ్రత్తలు తీసుకోవాలి.

ఎకరం పొలంలో నాటడానికి రెండు కిలోల విత్తనం సరిపోతుంది. దానికి 44 చదరపు గజాల నారుమడి కావాలి. అంటే రెండు కిలోల నారు విత్తడానికి 44 చదరపు గజాలు లేదా ఒక కిలో విత్తనానికి 22 చదరపు గజాల నారుమడి ఉండాలి. శ్రీ పద్ధతిలో ఒక్కొక్క మొక్క నాటాలి. కాబట్టి గింజ మీద గింజ పడకుండా ఉండటానికి నారుమడి విస్తీర్ణం కనీసం ఈ స్థాయిలో ఉండాలి.

1. మడి తయారీ : నారు మడి వెడల్పు ఒక గజం ఉండాలి. అవసరాన్ని బట్టి, సౌకర్యాన్ని బట్టి పొడవును నిర్ణయించుకోవాలి. వీలును బట్టి ఒకే పెద్దమడి కాని, లేదా చిన్న మడులను గాని చేసుకోవచ్చు. కూరగాయలు, పొగాకు నారుమడి మాదిరి ఎత్తైన మడులు తయారు చేయాలి. 8-12 రోజులలో వరి వేళ్ళు, 3 అంగుళాలు పెరుగుతాయి. కాబట్టి నారుమడి 5-6 అంగుళాల ఎత్తు ఉండాలి.

నారుమడిని ఈ కింది విధంగా తయారు చేయాలి.

ఒకటవ పొర : ఒక అంగుళం బాగా చివికిన పశువుల ఎరువు

రెండవ పొర : ఒకటిన్నర అంగుళాల మట్టి

మూడవ పొర : ఒక అంగుళం బాగా చివికిన పశువుల ఎరువు

నాల్గవ పొర : రెండున్నర అంగుళాల మట్టి.

ఈ పొరలన్నింటిని బాగా కలపాలి. మొక్క వేరు నేలలోకి తేలికగా చొచ్చుకొని పోవటానికి పశువుల ఎరువు ఉపయోగ పడుతుంది. నారుమడి చుట్టూ కాల్వ తీయాలి. తడిమట్టి జారిపోకుండా అవసరమైతే నారు మడి చుట్టూతా చెక్కలుగానీ, వానం బద్దలుకానీ, వరి ఎంట్లు కానీ ఉంచాలి.

2. విత్తనం మండె కట్టడం, చల్లటం : వడ్లను నీళ్ళలో నానబెట్టి, మొలకెత్తిన తరువాత చల్లటాన్ని మండె కట్టి చల్లడం అంటారు.

వరి విత్తనాన్ని 12 గంటలపాటు నానబెట్టాలి. ఆ తరువాత గోనెసంచిలో పోసి గానీ లేదా గోనె సంచి కప్పిగానీ 24 గంటల పాటు ఉంచాలి. అప్పుడు విత్తనం మొలకెత్తుతుంది. దీనినే తెల్ల పూత రావటం, లేదా ముక్కు పగలటం అంటారు. ఇటువంటి విత్తనాన్ని నారుమడిలో చల్లాలి.

మడిపై చల్లవలసిన విత్తనాన్ని నాలుగు భాగాలుగా చేసుకుని ఒక భాగం తరువాత ఒకటి మొత్తం మడిపై నాలుగు సార్లు చల్లాలి. ఇలా చేయడంవల్ల నారు మడిపై విత్తనం సమంగా పడుతుంది. సూర్యాస్తమయ సమయంలో ఇలా విత్తనం చల్లటం మంచిది.

విత్తనం పైన బాగా మాగిన పొడి పెంట ఎరువు గింజ కనిపించకుండా చల్లాలి. వరిగడ్డి వంటివి కూడా పలచగా పరచవచ్చు. దీని వల్ల విత్తనం ఎండకు, వానకు, నేరుగా గురికాకుండా ఉంటుంది. పక్షులు, చీమలు తినకుండా ఉంటాయి. నారు మొలకెత్తిన తరువాత గడ్డి పరిచి ఉంటే తీసివేయాలి.

నారుమడిపై నీళ్ళు అవసరాన్ని బట్టి రోజూ ఉదయం, సాయంత్రం చిలకరిస్తూ ఉండాలి. ఇందుకు నర్సరీల పెంపకంలో వాడే 'రోజ్‌కాన్' ఉపయోగించవచ్చు. కడవలు వంటివి ఉపయోగించినట్లయితే చేయి అడ్డం పెట్టి నీళ్ళు మెల్లగా చల్లాలి. నారుమడి చుట్టూ ఉన్న కాలువల్లో నీరు పారించి కూడా నారుకి నీళ్ళు అందేలా చేయవచ్చు.

నారుమడి నాటు వేసే ప్రధాన పొలంలో ఒక మూల / మధ్య ఉండాలి లేదా ప్రధాన పొలానికి సాధ్యమయినంత దగ్గరగా ఉండాలి.నారు పీకిన తరువాత సాధ్యమైనంత తొందరగా నాటువేయడానికి ఇది దోహదపడుతుంది.

**ప్రధాన పొలం తయారీ :**

పొలం దున్నడం, దమ్ము చేయడం వంటి పనులకు సంబంధించి మామూలు పద్ధతికి, శ్రీ పద్ధతికి తేడా ఏమీలేదు. ఇంతకు ముందు చెప్పినట్లుగా పొలం చదునుగ ఉండాలి. నాటు వేసేటప్పుడు నీళ్ళు అస్సలు ఉండకూడదు.


మార్కింగు చేయడం

శ్రీ పద్ధతిలో దూరం దూరంగా నాటడం ముఖ్యం. వరుసకీ వరుసకీ మధ్య, వరుసలో మొక్కకీ మొక్కకీ మధ్య 10 అంగుళాల ఎడం ఉండాలి (25×25 సెం.మీ.) ఈ విధంగా శ్రీ పద్ధతిలో చదరపు మీటరుకి 16 మొక్కలు పడతాయి. అదే సాంప్రదాయ పద్ధతిలో 33-40 కుదుళ్ళు వరకు పెడతారు. ఒక్కొక్క కుదురుకి 2-3 మొక్కలు పెడతారు.

ఇలా 10×10 అంగుళాల దూరంలో నాటు వేయడానికి అనేక విధానాలు ఉన్నాయి. ఒక తాడుకి 10 అంగుళాల దూరంలో పుల్లలు కట్టి ఒక వరుస తరువాత ఒక వరుస వేయవచ్చు.

ఇలా కాకుండా 10×10 అంగుళాల నాట్లు వేయడానికి 'మార్కర్లు' దొరుకుతున్నాయి. ఈ మార్కరును దమ్ము చేసిన పొలంలో లాగినప్పుడు అడ్డం, నిలువు గీతలను గీస్తుంది. ఇలా అడ్డం, నిలువు గీతలు కలిసిన చోట వరి మొక్కనాటు వెయ్యాలి. ఒక మార్కరు ఒకసారికి 8 నిలువు వరుసలను గుర్తిస్తుంది. వరుసలు తిన్నగా ఉండటానికి పొలం పొడవునా కొబ్బరితాడు/ప్లాస్టిక్‌తాడు కట్టి దాని వెంట మార్కర్‌ని లాగాలి. ఒక వరస అయిన తరువాత 12-13 అంగుళాల దారి వదిలి, తాడుకట్టి దాని వెంట మార్కర్‌ని లాగాలి. మార్కర్‌ని త్వరగా లాగాలి. మెల్లగా లాగితే చక్రం తిరగకుండా పైపైన ఈడ్చుకుంటూ వస్తుంది.

వరిలో ప్రతి రెండు మీటర్లకు దారులు (దోవలు) వదలమని చెబుతున్నారు. రైతులు కూడా ఈ పద్ధతిని ఆమోదించారు. అయితే ముందు పొలమంతా నాటు వేసి తరువాత రెండు మీటర్లకు ఒక తాడు పెట్టి దానికి రెండు పక్కలా మొక్కలను తీసి మధ్యలో నాటతారు. శ్రీ పద్ధతిలో మార్కరుతో గుర్తులు పెడుతున్నప్పుడు ప్రతి 8 వరసలకి, అంటే మార్కర్ ఒకసారి పొడవుగా లాగిన తరువాత 12-13 అంగుళాల దారి వదిలి పెట్టి మళ్ళీ మార్కరు లాగాలి. ఈ దారుల మధ్య నడుస్తూ నాటు వెయ్యడానికి వీలుగా ఉంటుంది.

వరిచేలో గాలి బాగా పోను కోవటానికి, పురుగులు, తెగుళ్ళ ఉధృతి తగ్గడానికి ఈ దారులు ఉపయోగపడతాయి. గట్ల వెంట, దారుల వెంట మొక్కలు ఆరోగ్యంగా పెరగటం చూస్తూ ఉంటాం. అలాగే ఈ దారుల వెంట మొక్కలు కూడా ఆరోగ్యంగా పెరుగుతాయి. ఇతర అంతర కృషి పనులు, పరిశీలనకు కూడా ఈ దారులు ఉపయోగపడతాయి.

పొలానికి గట్లు చెక్కడం, చదును చేయడం, మార్కరుతో నాటుకి గుర్తులు పెట్టడం వంటివి నాటు వేయటానికి ముందురోజే పూర్తి చేసి ఉండాలి.


నారుమడి నుంచి తీసిన అచ్చు

**నాట్లు వేయడం :**

లేత నారు (8-12 రోజులు), ఒక్కొక్క మొక్క మొక్క నాటడం శ్రీ పద్ధతి ప్రత్యేకత. నారుమడిని జాగ్రత్తగా పెంచటమే కాకుండా నాటు వేయడంలో కూడా ఎంతో జాగ్రత్తను పాటించాలి. మొక్కకి ఎటువంటి అదురు 'షాక్' తగల కూడదు. నారు మడిలోంచి తీసేటప్పుడు, నాటేటప్పుడు మొక్కకి ఎటువంటి హాని జరగకూడదు. ఈ పని చేసే కుటుంబ సభ్యులు, కూలీలకు ఈ విషయంలో అవగాహన కలిగించాలి.

మామూలు పద్ధతిలో వరి మొక్కను పట్టుకుని నారు పీకుతారు. దీనిని నారు లాగటం అంటారు. శ్రీ పద్ధతిలో నారు మొక్క చాలా చిన్నగా ఉంటుంది. కాబట్టి మంద పాటి ఇనుపరేకుని మడిలో అడుగు భాగానికి (3-4 అంగుళాల కింద నుంచి) చొప్పించి నారుని మట్టితో పాటు పైకి లేపాలి. అంటే ఇనుప రేకు మీదకి నారు, మట్టి వస్తాయి. దీనిని బొచ్చె/తట్ట వంటి వాటిల్లోకి మార్చి గానీ, రేకు మీద గానీ నాటు వేసే పొలానికి తీసుకెళ్ళాలి. నారు పీకిన తరువాత సాధ్యమైనంత త్వరగా (వీలయితే అరగంట లోపల) నాటు వేస్తే మొక్క దెబ్బతినకుండా ఉంటుంది.

నాటు వేసేటప్పుడు ఎంతో శ్రద్ధతో నాటు వేయాలి. విసుగు వంటివి ఉంటే నాటడంలో తప్పులు జరిగే అవకాశం ఉంటుంది.

1. నాటే పద్ధతి : మామూలు పద్ధతిలో వరి మొక్కను చూపుడు వేలు, మధ్యవేలు ఉపయోగించి బురదలోకి గుచ్చుతారు. మొక్కవేళ్ళ 'యు' అక్షర ఆకారంలో తిరుగుతాయి. అంటే వేళ్ళు ఆకాశం వైపుకి చూస్తుంటాయి. దీనివల్ల మొక్క వేరు మళ్ళీ కిందకు దిగి, మొక్క నిలదొక్కుకోటానికి చాలా సమయం పడుతుంది.

కానీ శ్రీ పద్ధతిలో వరి మొక్కలను పైపైన 'ఎల్' అక్షర ఆకారంలో నాటాలి. మార్కర్‌తో నిలువు, అడ్డం గీతలు కలిసిన చోటుకి ఒక అంగుళంపైన మొక్క నుంచి చూపుడు వేలుతో మెల్లగా లాగి వదిలి పెట్టాలి. బొటనవేలు, చూపుడువేలుతో ఒక్కొక్క మొక్కను మట్టి, గింజతో సహా వేరు చేసి జాగ్రత్తగా నాటాలి. ఇలా చేస్తే నారు తొందరగా నిలదొక్కుకుని ఆరోగ్యంగా పెరుగుతుంది. నారు వేసిన రోజున గానీ, మరునాడు కానీ పలచగా నీరు పెట్టాలి.

శ్రీ పద్ధతిలో నాటు వేయడానికి ఎకరానికి 10-15 మంది కూలీలు పట్టవచ్చు. అలవాటు ఉన్న వారైతే ఇంకా తక్కువ మందితోనే నారు వెయ్యవచ్చు.

**నీటి యాజమాన్యం :**

వరి మొక్క నీటిలో కూడా పెరుగుతుంది. అయితే దీనికి తప్పనిసరిగా నీళ్ళు ఉండాలని లేదు. సాధారణంగా రైతులు కలుపును అరికట్టడానికి నీళ్ళు ఎక్కువగా పెట్టి ఉంచుతారు. కాల్వల ప్రాంతాలలో కూడా నీటి దుర్వినియోగం ఎక్కువగా ఉంది. బాగా నీళ్ళు ఉన్న నేలల్లో వరి వేళ్ళు ఆరోగ్యంగా ఉండవు.

శ్రీ పద్ధతిలో వరిపొలంలో నీళ్ళు నిలబడేలా పెట్టరు. పొలం తడిచేలా మాత్రమే పెడతారు. నేల సన్నటి నెర్రలు కొడుతున్న దశలో మళ్ళీ నీళ్ళు పెట్టాలి. నేలను బట్టి, వాతావరణం బట్టి ఎన్ని రోజులకు ఒకసారి నీళ్ళు పెట్టాల్సి ఉంటుందో నిర్ణయించుకోవాలి. ఇలా చెయ్యటంవల్ల వరి మొక్క వేళ్ళు ఆరోగ్యంగా, లోతుగా, అన్ని వైపులా విస్తరిస్తాయి.

దూరంగా నాటడంవల్ల కూడా వరి మొక్క వేళ్ళు బాగా విస్తరిస్తాయి. పొలాన్ని తడుపుతూ, ఆరగడుతూ ఉండటం వల్ల నేలలోని సూక్ష్మజీవులు బాగా వృద్ధి చెంది మొక్కలకు పోషకాలు బాగా అందుతాయి.

(తరువాయి 5 వ పేజీలో)

# శరీరానికి మేలు కలిగించే మిరప

డా. చలసాని సాంబశివరావు, యం. విజయకుమార్, యం.నందకిషోర్, ఎం. బలరాం, ఆర్. బాలాజీ నాయక్, రుద్రూర్



మన రాష్ట్రంలో పండిస్తున్న వివిధ వాణిజ్య పంటలలో " మిరప" ముఖ్యమైనది. కారం కోసం వంటలలో ఉపయోగించే మిరపలో ఆరోగ్యానికి మంచి చేసే ఎన్నో పదార్థాలు ఉన్నాయి. మిరపలో పోషక విలువలతోపాటు వ్యాధి నిరోధక శక్తిని కలిగించే గుణాలు ఉన్నాయి.

**కేప్సిసిన్ :**

" కేప్సిసిన్" మిరపలో ఘాటును కలిగించే లక్షణము కలది. తగు పాళ్ళలో మిరపను తీసుకుంటే శరీరంలో జీర్ణక్రియను ఉత్తేజ పరుస్తుంది. గుండెజబ్బు, కాన్సర్ వంటి వ్యాధులు రాకుండా వ్యాధి నిరోధకముగా పని చేస్తుంది. ఈ పదార్థాన్ని మిరప కాయల నుండి వేరు చేసి వివిధ మందులలో వాడతారు. సాధారణంగా మన దేశంలో పండించే మిరపకాయల రకాలలో 0.2 నుండి 0.5 శాతం కేప్సిసిన్ ఉంటుంది.

**కాప్సాంథిన్ :**

మిరపకాయలలో లభ్యమయ్యే ఎర్రని రంగు పదార్థాన్ని " కాప్సాంథిన్ " అంటారు. ఆహార పదార్థాలలో మిరపను వాడినపుడు మన శరీరంలోకి చేరిన తరువాత అది విటమిన్ 'ఎ'గా మారుతుంది. ప్రస్తుతం మిరపలోని ఈ రంగు పదార్థాన్ని వేరుచేసి ఆహార పదార్థాల తయారీలో స్వాభావిక రంగుగా ఉపయోగిస్తున్నారు. పచ్చి మిరపలోని ఆకుపచ్చని పదార్థం కూడా శరీరంలో విటమిన్ 'ఎ'గా రూపాంతరం చెందుతుంది.

**ఓలిమోరెసిన్స్:**

ఎండు మిరప కాయల నుండి వేరు చేసిన మొత్తం సుగంధ ద్రవ్యాన్ని " ఓవిమో రెసిన్ " అంటారు. ఇది రకాలను బట్టి 8 శాతం నుండి 16 శాతం వరకు ఉంటుంది. దీనిలో మిరప కాయలకు ఉండవలసిన రంగు, రుచి, సువాసనలతో పాటు ముఖ్యమైన నూనెలు, క్రొవ్వు పదార్థాలు కూడా ఉంటాయి. ప్రస్తుత నూతన ఆహార పదార్థాల తయారీ పరిశ్రమలలో ఆహార పదార్థానికి కావలసిన పరిమాణంలో రంగు, రుచి, వాసన సమంగా రప్పించటానికి ఈ " ఓవిమోరెసిన్''ను వాడుచున్నారు. మిరప కాయల నుండి " ఓవిమోరెసిన్" ను వేరు చేసి డబ్బాలలో సీలు చేసి విదేశాలకు ఎగుమతి చేయటం క్రొత్తగా అభివృద్ధి చెందుతున్న పరిశ్రమ.

మిరపలో లభ్యమయ్యే విటమిన్‌లు, పోషక పదార్థాలు, వివిధ మూలకాలను గురించి తెలుసుకుందాము.

**విటమిన్లు :**

పచ్చిమిరపలో విటమిన్ 'సి' సమృద్ధిగా లభ్యమవుతుంది. వంద గ్రాముల కాయలలో 100 నుండి 200 మిల్లీ గ్రాముల విటమిన్ " సి " లభ్యమవుతుంది. ఎండు మిరప కాయలలోని ఎర్రని రంగు పదార్థము మన శరీరంలోనికి చేరినపుడు విటమిన్ " ఎ " గా మారుతుంది.

విటమిన్ 'బి' అయిన థయోమిన్, రైబోప్లావిన్, నయాసిన్ వంటివి కూడా కొద్ది పాళ్ళలో లభిస్తాయి.

'బిటా కెరోటిన్' అనే పదార్థం ఎండు మిరప కాయలలో 350 నుండి 400 మైక్రో గ్రాములు, పచ్చి మిరపలో 150 నుండి 250 మైక్రో గ్రాములు ఉంటుంది. మానవ శరీరంలో 'కేరోటిన్' విటమిన్ 'ఎ'గా మార్పు చెంది కండ్ల ఆరోగ్యానికి సహాయ పడుతుంది. దేహంలో విటమిన్ 'ఎ' తగినంతగా లేకపోతే ముఖ్యంగా చిన్న పిల్లలతో కనుగుడ్లు పొడిగాను, ముడతలు పడి ఉంటాయి. మనక వెలుతురులో చూడటానికి కష్టమవుతుంది. దీనినే 'రేచీకటి' అంటారు. విటమిన్ 'ఎ' లోపానికి ఇది తొలి చిహ్నంగా భావిస్తారు.

'కేరోటిన్ ' తో పాటు పచ్చి మిరపలో విటమిన్ 'సి' పుష్కలంగా లభించటం వలన, ఎముకలు, దంతాలు ఆరోగ్యానికి సహాయ పడుతుంది. ఆహారంలో విటమిన్ 'సి' లోపిస్తే పండ్ల చిగుళ్ళ నుండి రక్తం కారటం ఎముకల బలహీనత వంటి అనర్థాలు కలుగుతాయి. ప్రతి ఒక్కరు రోజుకు కనీసం 40 మిల్లీ గ్రాముల విటమిన్ 'సి' తీసుకోవాలి. అంటే ఈ మోతాదు 30 నుండి 40 గ్రాముల కూర మిరప ద్వారా లభ్యమవుతుంది.

**పోషక పదార్థాలు :**

వంద గ్రాముల ఎండు మిరపలో ప్రధాన పోషక పదార్థాలలో పాటు శక్తి 246 కేలరీలు, మాంసకృత్తులు 16 గ్రాములు, క్రొవ్వులు 6 గ్రాములు ఉన్నాయి. మిరపను ఆహారంలో ముఖ్యంగా కారం, రుచి కొరకు తక్కువ మోతాదులో ఉపయోగిస్తాం. కాబట్టి ఈ పోషకాలు కూడా తక్కువగా లభిస్తాయి. ఈ విటమిన్లు, ఖనిజ లవణాలు మిరప ద్వారా కొంతవరకు అందించబడతాయి.

**ఖనిజ లవణాలు :**

వంద గ్రాముల ఎండు మిరపలో ఖనిజ లవణాలయిన కాల్షియం 160 మిల్లీ గ్రాములు పాస్ఫరస్ 370 మిల్లీ గ్రాములు, ఇనుము 3 మిల్లీ గ్రాములు లభ్యమవుతాయి. శరీరంలో కాల్షియం, పాస్ఫరస్ ఎముకల నిర్మాణానికి, ఇనుము రక్తకణాల ఉత్పత్తికి అవసరమవుతుంది.

మనకు అందుబాటులో ఉన్న మిరపను తగు మోతాదులో ఆహారంలో తీసుకోవటం ద్వారా పోషక విలువలతో పాటు జీర్ణశక్తి కూడా పెంపొందుతుంది. అలా అనుకొని మరీ ఎక్కువ మోతాదులో కారం కానీ, మిరప కాయలు కానీ వాడితే జీర్ణకోశ సంబంధిత వ్యాధులకు గురికావలసి వస్తుందన్న విషయం గుర్తుంచుకోవాలి. ☆

**మిరపలో లభించే వివిధ పోషక విలువలు**

| పోషకం పేరు | ఎండు మిరప | పచ్చి మిరప |
|---|---|---|
| ప్రొటీన్ శాతం | 15.9 | 2.9 |
| ఖనిజ లవణాలు% | 6.1 | 1.0 |
| విటమిన్ ' సి ' మిల్లీ గ్రాములలో | -150 | -250 |
| విటమిన్ 'ఎ' మిల్లీ గ్రాములలో | 345 | - |
| పీచు పదార్థాం % | 30.2 | 6.8 |
| పిండి పదార్థం % | 31.6 | 3.0 |

# పండ్లతోటలలో సూక్ష్మధాతు పోషకాల లోపాలు - సవరణ

వి. బాలిరెడ్డి, ఎం.జి.బాలహుస్సేని, బి. విజయలక్ష్మి, డా॥ కె.అచ్యుతరాజు, డి.వెంకటేశ్వర్లు, వి.శాంతి శ్రీ, డా॥ పి. సంధ్యారాణి దర్శి, ప్రకాశం జిల్లా

మొక్కలు పెరుగుదలకు, అధిక దిగుబడులు తీసుకొనటానికి పోషకాలు ఎంతో దోహదం చేస్తాయి. మొక్కలలో జరిగే వివిధ ప్రక్రియలలో పోషకాలు (ఆహార సమతుల్యత) ఎంతో అవసరం. ఏ పంటకైనా మనం అందించే పోషకాలలో నత్రజని, ఫాస్పరస్, పొటాష్ మాత్రమే కాకుండా జింకు, ఇనుము, బోరాన్, మెగ్నీషియం, మాంగనీస్ మరియు రాగి కూడా ప్రధానమైనవే. మొక్కల పెరుగుదలకు మరియు మొక్కలలో జరిగే వివిధ ప్రక్రియల్లో ఈ సూక్ష్మధాతు పోషకాలు చాలా అవసరం. పంట్లతోటలలో సూక్ష్మధాతుపోషకాల పాత్ర అధిక దిగుబడులకు మరియు పండ్ల నాణ్యతకు ఎంతో అవసరం. మన రాష్ట్రంలో విస్తరించి వున్న నేలల్లో సూక్ష్మధాతు పోషకాల లోపం ఎక్కువగా కనిపిస్తుంది. ఇసుకతో కూడిన ఆమ్ల నేలలు, బంకమట్టి అధికంగా గల నేలలు, తటస్థ నేలలు, చౌడు నేలలు అధిక భాస్వరం గల నేలల్లో సూక్ష్మధాతు పోషకాల లోపాలు ఎక్కువగా గమనించవచ్చు.

పండ్ల తోటలలో వివిధ సూక్ష్మధాతు పోషకాల లోపాలు వల్ల జరిగే నష్టాలను (దిగుబడులు తగ్గడం) ఎదుర్కొనుటకు సూక్ష్మధాతులోపాలకు సరైన యాజమాన్య పద్ధతులను పాటించి నివారించవచ్చును. తద్వారా మొక్కల (చెట్ల) అభివృద్ధి (ఎదుగుదల) బాగా ఉండి అత్యధిక దిగుబడులను పొందవచ్చును.

ఈ సూక్ష్మధాతులోపాలు వివిధ పండ్ల తోటలందు గుర్తించి వాటికి సరైన నివారణ చర్యలు సరైన సమయంలో పాటించుట వలన రైతులు అధిక లాభాలను పొందవచ్చును

## మామిడి

**జింకు లోప లక్షణాలు :** మామిడిలో చిగురాకులు ఆకారం లేకుండా పోవటం, ఆకుల అంచులు వెనక్కు ముడుచుకొని కప్పు ఆకారంలా మారటం, అంచులు పసుపు రంగులోకి మారి ఎండిపోవటం గమనిస్తే, జింకు లోపంగా చెప్పవచ్చు. లోపం ఉధృతంగా ఉంటే పెద్ద కొమ్మలు కూడా ఎండిపోతాయి. కాపు, కాయసైజు నాణ్యత తగ్గుతుంది. చిన్న చెట్లలో లోపం తీవ్రంగా ఉంటే చనిపోతాయి. చౌడు, ఉప్పు నేలల్లో జింకు ధాతులోపం ఎక్కువగా ఉంటుంది.

**లోప నివారణ :** జింకు లోపాన్ని 5 గ్రా. జింకు సల్ఫేట్ మరియు 10 గ్రా. యూరియా ఒక లీటరు నీటికి కలిపి 15 రోజుల వ్యవధిలో రెండుసార్లు పిచికారి చేసి నివారించవచ్చును.

**ఇనుము లోప లక్షణాలు :**

మామిడి ఆకులు పచ్చదనాన్ని కోల్పోయి తెల్లగా మారతాయి. దీన్ని బ్లీచింగ్ అని అందురు. ఆకుల సైజు తగ్గుతుంది. లోపం తీవ్రమైతే కొనలు నుండి ఆకులు ఎండుకుంటూ వస్తాయి. ఈ లోపం సున్నం శాతం ఎక్కువగా ఉన్న నేలల తోటల్లో ఎక్కువ. అందుకే దీన్ని సున్నం ప్రేరేపించిన ఇనుము లోపం అంటారు. చెట్లు పెరుగుదల తగ్గుతుంది. కాపు అంతగా రాదు. కాయ నాణ్యతగా వుండదు.

**లోప నివారణ :** ఇనుము లోపాన్ని నివారించటానికి ప్రతి లీటరు నీటికి 5 గ్రా. అన్నబేధి లేదా 2.5 గ్రా. ఫెర్రస్ సల్ఫేట్ మరియు ఒక గ్రాము నిమ్మ ఉప్పు కలిపి 15 రోజుల వ్యవధిలో రెండు సార్లు చెట్టు మొత్తం తడిసేలా పిచికారి చేసి సవరించవచ్చును.

**బోరాన్ లోప లక్షణాలు :**

కాయ పగలటము బోరాన్ ధాతు లోప ముఖ్య లక్షణం. ఆకులు, ఈనెలు మందమెక్కడం, ఆకులు జీవము కోల్పోయినట్లుండటము కూడా చూడవచ్చు. పండు లోపల కండలో గోధుమ వర్ణపు ప్రాంతాన్ని బాగా చూడవచ్చును.

**లోప నివారణ :** నివారణకు జూలై - ఆగస్టు నెలల్లో ఎరువులు వేయుపుడు సిఫార్సు చేసిన ఎరువులతో పాటుగా ఒక్కొక్క చెట్టుకు 50 గ్రా. బోరాక్స్ లేదా బోరిక్ యాసిడ్ రసాయనం వేయాలి. ప్రత్యామ్నాయంగా, ప్రతి లీటరు నీటికి 2 గ్రా. బోరాక్స్ లేదా బోరిక్ యాసిడ్‌ను కలిపి చెట్టు మొత్తం మీద పిచికారి చేసి బోరాన్ లోపాన్ని నివారించవచ్చు.

## నిమ్మ, బత్తాయి

**జింకు : లోప లక్షణాలు :** నిమ్మ జాతి మొక్కల్లో జింకుధాతు లోపం ఎక్కువగా కన్పిస్తుంది. జింకు లోపించినపుడు, క్రొత్తగా పెరిగే కొమ్మలు, ముఖ్యంగా పెరిగే లేత ఆకులలో ఈనెల మధ్య భాగాలు పసుపు రంగుకు మారతాయి. ఆకులు మధ్య కాండం పొడవు తగ్గి, ఆకు గుబురుగా అగుపడతాయి. కొమ్మల చివరల నుండి మొదలయి క్రమంగా క్రింది భాగానికి విస్తరిస్తుంది. కాయల దిగుబడి, నాణ్యత తగ్గిపోతుంది. పండ్లు చిన్నవిగా ఉంటాయి. తొక్క మందంగా అవుతుంది. పండ్లు రుచిగా ఉండవు.

**లోప నివారణ :** ప్రతి చెట్టు మొదలులో 100గ్రా. జింకు సల్ఫేట్‌ను మట్టిలో కలిసేలా వేసి జింకు లోపాన్ని నివారించవచ్చు (లేదా) లీటరు నీటికి 2 గ్రా. జింకు సల్ఫేట్ చొప్పున కలిపి పిచికారి చేయాలి.

**మాంగనీసు : లోప లక్షణాలు :** మాంగనీసు లోపం చీనీ తోటల్లో ఎక్కువగా కన్పిస్తుంది. మాంగనీసు లోపం వల్ల ఆకుల మీద పసుపు రంగు లేక పాలిపోయిన మచ్చలు ఏర్పడతాయి. క్రమంగా అవి గచ్చకాయ రంగును లేదా తెల్లగా మారతాయి. ఆకులు క్రిందికి ముడుచుకొని బోర్లించిన గిన్నెలాగా కన్పిస్తాయి. చాలా సందర్భాలలో ఆకుల మీద ఈ లోపం చిహ్నాలు, జింకు లోప చిహ్నాలను పోలి వుంటాయి. అయితే మాంగనీసు లోపం వలన జింకు లోపం వలె కాక ఆకు పరిమాణం తగ్గదు.

**లోప నివారణ :** మాంగనీసు లోపాన్ని నివారించటానికి లీటరు నీటికి 2 గ్రా.



నిమ్మకాయలపై బోరాన్ లోప చిహ్నాలు

మాంగనీసు సల్ఫేట్ చొప్పున కలిపి పిచికారి చేయాలి.

**ఇనుము లోప లక్షణాలు :** ఇనుము లోపం నిమ్మలో అధికంగా కనిపిస్తుంది. లేత ఆకుల్లో ఈనెలు మాత్రం ఆకుపచ్చగా ఉండి మిగిలిన ఆకు భాగం అంతా పసుపుగా మారుతుంది. క్రమంగా ఆకంతా పాలిపోయి తెల్లగా దంతపు రంగులోకి మారుతుంది. కాయలు రాలిపోతాయి. నేలల్లో సహజంగా సున్నం అధికంగా ఉన్నప్పుడు మరియు సాగునీటిలో బైకార్బోనేటు, కార్బోనేట్‌లు అధికంగా ఉన్నప్పుడు ఇనుము లోపం సర్వసామాన్యంగా కనిపిస్తుంది.

**లోప నివారణ :** ఇనుము లోప నివారణకు 1 శాతం అన్నభేది ద్రవణాన్ని (10గ్రా. అన్నభేది మరియు 5 గ్రా. సున్నం ప్రతి లీటరు నీటికి) లోప లక్షణాలు తగ్గే వరకు వారం వ్యవధిలో పిచికారి చేయాలి.

**రాగి లోప లక్షణాలు :** రాగిధాతు లోపం వలన కొమ్మల చివర్ల నుండి లేత ఆకులు రాలిపోతాయి. కొమ్మ చివరి నుండి క్రిందికి ఎండిపోతుంది. ఆకులు, కాండము మరియు కాయలపై ఇటుక రంగు ఎండు మచ్చలు ఏర్పడతాయి. కాయలపై బడిపెల్లాంటి మచ్చలు వస్తాయి. కాయల పరిమాణం తగ్గుతుంది. కాయల నడుమ వంపు ఏర్పడుతుంది. కొమ్మలపై నుంచి కూడా బంక కారవచ్చు. జింకు, ఇనుము మరియు మాంగనీసు లోపాలు ఆగుపడే నేలల్లో బోర్డో మిశ్రమం వాడని సందర్భాలలో రాగి లోపం కనిపించవచ్చు.

**లోప నివారణ :** తెగుళ్ళు నివారణకు ఉపయోగించే రాగి ధాతు సంబంధిత మందులను పిచికారి చేసి కొన్ని శిలీంద్ర తెగుళ్ళను అరికట్టడమే కాక ధాతు లోపం కూడా నివారించవచ్చు.

**బోరాన్ లోప లక్షణాలు :** ఆకులు సహజమైన పచ్చరంగు కోల్పోయి రోగగ్రస్తమయినట్లు కనిపిస్తాయి. లేత ఆకుల ఈనెలు పసుపు రంగుకు మారతాయి. ముదురు ఆకుల ఈనెలు దళసరిగా ఉబ్బి, వంకర తిరిగి పగుళ్ళిస్తాయి. పిందెలు రాలిపోతాయి. కాయలో గింజలేర్పడవు. జిగురు వంటి పదార్థం కనిపిస్తుంది. కాయలు పగుళ్ళిచ్చి, నీరుపట్టి కుళ్ళినట్లు కన్పిస్తాయి.

**లోప నివారణ :** బోరాన్ లోప నివారణకు బోరాక్స్ లేదా బోరిక్ ఆమ్లం ప్రతి లీటరుకు



నిమ్మలో రాగిధాతు లోప లక్షణాలు

1 గ్రా. కలిపిన ద్రావణాన్ని పిచికారి చేసి బోరాన్ లోపాన్ని నివారించవచ్చు.

**మెగ్నీషియం లోప లక్షణాలు :** మెగ్నీషియం లోపం ఉన్నప్పుడు ప్రధానమైన మధ్య ఈనెకు ఇరువైపులా పసుపు పచ్చని మచ్చలు కనిపిస్తాయి. ఈ మచ్చలు క్రమేపి పెద్దవై కేవలం ప్రధాన ఈనెకు ఇరువైపుల తిరుగబడిన 'వి' ఆకారంలో ఆకు పచ్చని ప్రదేశం మిగులుతుంది. ఆ తరువాత ఆకులు రాలిపోతాయి.

**లోప నివారణ :** మెగ్నీషియం పోషక లోపాన్ని నివారించడానికి ఒక శాతం మెగ్నీషియం సల్ఫేట్ ద్రావణాన్ని 15 రోజుల వ్యవధిలో రెండు సార్లు పిచికారి చేయాలి.

బహుళ పోషక లోప లక్షణాలు : నేలల్లో సహజంగా అధికంగా సున్నం ఉన్నప్పుడు జింకు, ఇనుము, మాంగనీసు, బోరాన్ లోపాలు ఒకేసారి కన్పిస్తాయి. ఇటువంటి సందర్భాలలో వేర్వేరు పోషకాల లోపాలను ప్రత్యేకంగా గుర్తించటం కష్టం. ఈ లోపాలు అన్నింటిని సమిష్టిగా 'పల్లాకు తెగులు' అని అంటారు.

**లోప నివారణ :** పల్లాకు తెగులు నివారణకు జింకు సల్ఫేట్ 5 గ్రా., మాంగనీసు సల్ఫేట్ 2 గ్రా., మెగ్నీషియం సల్ఫేట్ 2గ్రా., ఫెర్రస్ సల్ఫేట్ 2గ్రా, బోరాక్స్ 1 గ్రాము, సున్నము, 6గ్రాములు, యూరియా 10గ్రాములు , ఒక లీటరు నీటికి కలిపి పిచికారి చేయాలి.

**మెగ్నీషియం లోప లక్షణాలు :** నీటి ఎద్దడి ఎక్కువగా వున్న ప్రాంతాలలో మెగ్నీషియం లోప లక్షణాలు ఎక్కువగా కనిపిస్తాయి. పంట తొలిదశలో ఆకులు రంగు కోల్పోయి పాలిపోతాయి. వేసవి కాలంలో ఆకులు ఎరుపు రంగుకు మారతాయి. లోపాలు తీవ్రమయినప్పుడు చెట్లలోని ఆకులు రాలిపోతాయి.

లోప నివారణ : మెగ్నీషియం పోషకలోప నివారణకు ఒక లీటరు నీటికి 2 గ్రా.ల మెగ్నీషియం సల్ఫేట్ కలిపి పిచికారి చేసి మెగ్నీషియం లోపాన్ని నివారించవచ్చు.

**జింకు లోప లక్షణాలు :** జామలో జింకుధాతు లోపం వలన ఆకులు చిన్నవిగా, దగ్గర దగ్గరగా పసుపు రంగులో ఉంటాయి. కణుపుల మధ్య దూరం తక్కువగా వుంటుంది. ఉధృత దశలో ఆకుల చివర్లు ఎండి తుప్పు రంగుకు మారతాయి.

**లోప నివారణ :** జింకు ధాతు లోప నివారణకు లీటరు నీటిలో 2 గ్రాముల జింకు సల్ఫేట్ చొప్పున కలిపి పిచికారి చేసి నివారించవచ్చు.

**జింకు లోప లక్షణాలు :** సపోటాలో జింకు ధాతు లోపం వల్ల ఆకు పసుపు పచ్చ రంగులోనికి మారి చిన్నవిగా, దగ్గర దగ్గరగా కనిపిస్తాయి. కణుపుల మధ్య దూరం తగ్గుతుంది. చివరి దశలో ఆకుల చివర్లు ఎండి, తప్పు రంగుకు మారతాయి.

లోప నివారణ : జింకు లోప నివారణకు 2 గ్రా. జింకు సల్ఫేట్‌ను ఒక లీటరు నీటికి కలిపి పిచికారి చేసి జింకు లోపాన్ని నివారించవచ్చును.

## జీడి మామిడి

**ఇనుము:** లోప లక్షణాలు : ఇనుప ధాతులోపమున్న మొక్క ఆకులలో ఈనెలు ఆకు పచ్చగా ఉండి మిగతా భాగమంతా లేత ఆకుపచ్చగా లేదా పసుపు రంగులో వుంటుంది. లోపం తీవ్రమైనప్పుడు ఆకు మొత్తం పసుపు రంగుకు మారుతుంది. చౌడు భూములలో ఈ లోపం అధికంగా ఉంటుంది.

**లోప నివారణ :** ఇనుము ధాతు లోప నివారణకు ఫెర్రస్ సల్ఫేట్ 2 గ్రాములు లీటరు నీటిలో కలిపి పిచికారి చేయాలి.

**మాంగనీస్ లోప లక్షణాలు :** మాంగనీస్ ధాతు లోపమున్న ఆకులలో మధ్య ఈనెతో పాటు అన్ని ఈనెలు ఆకు పచ్చరంగులో ఉండి ఈనెల మధ్యభాగం లేత ఆకుపచ్చ రంగులో ఉంటుంది. ముదురు ఆకులలో లోపలక్షణాలు ప్రస్ఫుటంగా కనిపిస్తాయి.

**లోప నివారణ :** మాంగనీసు ధాతు లోపాన్ని నివారించటానికి లీటరు నీటికి 2 గ్రా. మాంగనీసు సల్ఫేట్ చొప్పున కలిపి పిచికారి చేయాలి. 

# ఎరువుల సద్వినియోగానికి యాజమాన్య పద్ధతులు

డా॥ఎ.ప్రసాదరావు, హైదరాబాద్

దీర్ఘకాల అధికోత్పత్తికి, ఎరువుల మీద పెట్టిన ప్రతి రూపాయి పెట్టుబడి మీద అధిక లాభం తీయడానికి, ఈ క్రింది ముఖ్య యాజమాన్య సూత్రాలను పాటించాలి.

1. వేసే ఎరువులను తగు పాళ్ళల్లో, మొక్కలకు అవసరయ్యే సమయంలో వేయాలి. ఎరువులను కావాల్సిన మోతాదులో వేయడానికి, భూసార పరీక్షననుసరించి ఎరువులను వాడాలి. కనీసం ప్రతి మూడు పంటల కొకసారి తిరిగి భూసార పరీక్షను చేయించి, వేయవలసిన ఎరువుల మోతాదులను సవరించాలి. ఇలా చేయడం వల్లనే భూమిలోని పోషక పదార్థాల లభ్యత స్థాయి మరియు లోపాల ననుసరించి ఎరువులు సక్రమ పాళ్లలో వేయడానికి వీలుపడుతుంది. లేనిచో ఎరువులను ఫలితం లేకుండా ఖర్చుతో వాడాల్సి వస్తుంది.

2. భూ పరీక్ష వెంటనే చేయించలేని సందర్భాల్లో వేయబోయే పైరుకు వ్యవసాయ డిపార్టుమెంటు వారు సిఫారసు చేసే ఎరువుల మోతాదులను విధిగా వేయాలి.ఇలా చేయటం వల్ల,ఎరువు వాడకాన్ని తగ్గించవచ్చు.

3. దీర్ఘకాల అధికోత్పత్తికి రసాయనిక ఎరువులు మరియు సేంద్రీయపుటెరువులు సమీకృతంగా వాడాలి. ఇలా వాడితే, భూ భౌతిక పరిస్థితులు, ఇతర గుణాలు పెరిగే మొక్కలకు అనువుగా ఉండి దీర్ఘకాల అధికోత్పత్తి సాధించడానికి వీలు పడుతుందని పరిశోధనల్లో తేలింది. అందువల్ల సాధ్యమైనంత వరకు సేంద్రియపుటెరువులను చేను మొత్తం పల్చగానైనా కలిసేలా వాడాలి.

4. సేంద్రియపుటెరువులను దుక్కి సమయంలోనే చేలో వేసి కలియదున్నాలి. సేంద్రియపుటెరువులను చేలో తోలిన తరువాత ఎండనీయరాదు. నేలలో కలిసిపోవుటకు వెంటనే దంతె లేదా నాగలితో దున్నాలి. గొర్లపెంట పెట్టించినప్పుడు లేదా పందిపెంట వేసినపుడు కూడా ఇలానే వెంటనే కలియదున్నాలి.

ఒకవేళ బాగా చివకని చెత్త, చెదారం సేంద్రియపుటెరువులో ఎక్కువ శాతం ఉన్నచో, పైరు వేసే ముందు వారం పది రోజులు ముందుగానే సేంద్రియపుటెరువులను చేలో కలిసేటట్లుగా వేసి, నేలను కలియదున్నాలి. లేనిచో విత్తు నుండి మొలిసిన మొక్కలు సరిగా ఎరువు నుండి అవసరమైనంతగా పోషక పదార్థాలను పీల్చుకోలేవు.

5. సూచించిన మొత్తం ఫాస్ఫరస్ మరియు పొటాష్ మరియు మొదటి దఫా నత్రజని ఎరువులను విత్తే ముందు పైరుతో వేయాలి. వీనిని చేను మొత్తం మీద వెదజల్లకుండా, వరుసలలో పెరిగే పంట అయితే, ఎరువు గింజకు తగలకుండా, గింజకన్న లోతుగా వేయాలి. దీనికి గింజలు, ఎరువులు ఒకేసారి వేసే "సీడ్- కమ్-ఫర్టిలైజర్" డ్రిల్లును వాడవచ్చు. రైతులు ప్రస్తుతం వాడే గొర్రుకు స్వల్ప మార్పులు చేసి కూడా ఇలా ఎరువులను, గింజలను ఒకేసారి చేయవచ్చు.

మొక్కలకు పాదులుగా చేసినపుడు, మొక్క కాండానికి కొంత దూరంగా భూమిపై మట్టి "4 - 6" పక్కకు తీసి ఎరువు వేసి తిరిగి మట్టితో ఎరువును కప్పాలి.

6. సూచించిన నత్రజని ఎరువును భూమి రకాన్ని బట్టి రెండు లేక మూడు సమాన విడతలుగా వేయాలి. నల్లరేగడి ఇతర బంక మన్ను ఎక్కువగా ఉన్న భూముల్లో రెండు దఫాలుగా వేస్తే సరిపోతుంది. చెల్కా భూముల్లో, ఇతర ఎరువు భూముల్లో పంట కాలాన్ని బట్టి 3 దఫాలుగా వేయవచ్చు. ఇసుక ఎక్కువగా ఉండి, నీరు త్వరగా ఇంకే భూములలో నత్రజని ఎరువును ఒకేసారి ఫాస్ఫరస్ మరియు పొటాష్ ఎరువుల మాదిరిగా వేస్తే, వేసిన నత్రజని ఎరువు సాగునీరు కట్టినపుడు, మురుగు నీటితో వృధాగాపోయి, మొక్కలకు అందదు.

7. మాగాణి వరిపైరుకు ఎట్టి పరిస్థితిలోను నైట్రేటు నత్రజని కలిగి ఉన్న రసాయనిక ఎరువులను వాడరాదు. వరి పైరుకు మొదటి దఫా నత్రజని ఎరువు ఇతర ఫాస్ఫరస్ మరియు పొటాష్ ఎరువులతో కలిపి, కరికట్ల సమయంలో కొద్ది నీరులో దుక్కిలో పోయాలి. జింకు కూడా ఇదే సమయంలో వేయాలి. రెండవ దఫా నత్రజని ఎరువును చిరుపొట్ట దశ ముందు వేయాలి. ఎరువు వేసే ముందు, అన్ని గట్లను నీరు పోకుండా కట్టి గట్ల బొరియలు మూసి, నీరు కేవలం 2" ఉన్నప్పుడు యూరియా వేయాలి. ఈ నీరు పూర్తిగా ఇంకే వరకు తిరిగి నీరు పెట్టరాదు. పొలాన్ని ఎండనీయరాదు. మూడు-నాలుగు రోజుల తర్వాత తిరిగి నీరు పెట్టవచ్చు.

8. యూరియాలో 20 శాతం వరకు పొడి చేసిన వేప చెక్క కలిపితే, నత్రజని ఎరువు సామర్థ్యం పెరుగుతుంది. అందువల్ల వేప చెక్క దొరికేప్రాంతాల్లో పొడి చెక్కను యూరియాతో 20శాతం వరకు కలిపి వాడాలి.

9. వేసిన ఎరువులు సద్వినియోగం కావాలంటే, కలుపు తీయించాలి.

10. నీటి వసతి వున్న చోట, కలుపుతీసి ఎరువు వేయగానే పల్చగా నీరు కట్టాలి. ఎక్కువ నీరు వాడకూడదు.

11. చెరుకు, పత్తి, ఇతర తోటలు మరియు సాలు పైర్లకు, దఫాలుగా వేసిన నత్రజని ఎరువును వేళ్లకు వెంటనే అందుబాటులో వుండేలా, తగు లోతు వరకు గడ్డపార లేదా గునపం లేదా కర్ర లేదా కొచ్చగా చెక్కిన కర్రతో రంధ్రాలు చేసి, నత్రజని ఎరువును రంధ్రంలో వేసి మట్టితో కప్పాలి. తరువాత మామూలుగా నీరు కట్టాలి.

12. సూపర్ వేసేటపుడు రబీ మెట్టపైరుకు వేసి, తరువాత వరిపైరు ఖరీఫ్‌లో వేస్తే ఫాస్ఫరస్ ఎరువు సామర్థ్యం పెరిగి అధిక ఆదాయం వస్తుంది.

13. జీవన ఎరువులు ఖరీదు తక్కువ. ముఖ్యంగా పప్పుదినుసులు, పెసలు, కందులు, మినుములు, వేరుశనగకు పైర్లకు 'రైజోబియం' జీవన ఎరువును విత్తులతో కలపాలి. వరిపైరుకు నీలిఆకుపచ్చ లేదా అజోలా లను వాడవచ్చు. ప్రతి రైజోబియం ప్యాకెట్‌మీద ఏ పైరుకు ఎరువును ఎలా వాడవచ్చో వ్రాసి వుంటుంది. జీవన ఎరువులు వాడినపుడు, సూచించిన నత్రజని ఎరువుల మోతాదులో ఎకరానికి 10 కిలోల వరకు తగ్గించుకోవచ్చు.

14. ఏ రసాయనిక ఎరువులు కొనాలి అని నిర్ణయించేటపుడు, సామాన్యంగా మొక్కల పోషక పదార్థాలు కాంప్లెక్స్ ఎరువుల ద్వారా వేస్తే ధర తక్కువ. అయితే, వివిధ కాంప్లెక్స్ ఎరువులను మార్కెట్‌లో కొనేటపుడు, కేవలం ప్రతి బస్తాకు రేటును మాత్రమే పరిగణనలోకి తీసుకోరాదు. దీనిలో వున్న పోషక పదార్థాల స్థాయిని కూడా దృష్టిలో వుంచుకోవాలి. పోషక పదార్థాలు ఎంతవరకు వున్నట్లు ఎరువుల ప్రతి సంచిమీద వ్రాసి వుంటుంది.

15 ఏదైనా ఎరువు మార్కెట్‌లో లేనపుడు లేదా సరిగా దొరకనపుడు, బ్లాక్‌మార్కెట్‌లో అధిక రేటు పెట్టి కొనకూడదు. మార్కెట్‌లో దొరికే ఏ ఇతర ఎరువులనైనా వాడవచ్చు. అయితే ఇలా ఎరువులను మార్చి కొన్నపుడు ఎరువుల పోషక పదార్థాలు సమానంగా

(తరువాయి 14 వ పేజీలో)

# సస్య రక్షణలో వేప ప్రాముఖ్యత

వి. బాలిరెడ్డి, డా॥కె. అచ్యుతరాజు, డి. వెంకటేశ్వర్లు, బి. విజయలక్ష్మి, వి. శాంతి శ్రీ, దర్శి, ప్రకాశం

వేపకు భారతదేశం పుట్టినిల్లు. వేపకు ఔషధ గుణాలతో పాటు కీటకాలను చంపే గుణం వుంది. వేప పిండిని ఎరువుగా, వేపనూనె, వేప గింజల కషాయాలను సస్య రక్షణలో విరివిగా వినియోగిస్తున్నారు. ప్రతి సంవత్సరము వేసవి కాలంలో అనగా జూన్-జూలై మాసాలలో వేప పండ్ల నుండి గింజలు విరివిగా లభ్యమవుతాయి. ఈ సమయంలో రైతులు వేప గింజలను సేకరించి భద్రపరుచుకుని అనేక రకాలుగా వ్యవసాయ పంటకు వినియోగించవచ్చు. ఇపుడు గింజల సేకరణలో మెలకువలను, సస్యరక్షణ, వేప ప్రాధాన్యతను, వేప గింజల కషాయం తయారు చేయుట

**వేప గింజల సేకరణలో మెలకువలు :**

వేప విత్తనాలకు 35-45% నూనె, 30% నీరు వుంటాయి. సాధారణంగా రైతులు సేకరించే విత్తనాలలో నాణ్యత తక్కువగా వుంటుంది. దీనికి కారణం కాయలను చెట్టు క్రింద మట్టి, చెత్తా చెదారాలతో కలిపి సేకరించడమే. అందువల్ల విత్తనాలకు ధర తక్కువగా పలుకుతుంది. నాణ్యత పెంచుటకై కొన్ని పద్ధతులను పాటించాలి.

మొదటగా వేప పండ్ల సేకరించదలసిన చెట్టు చుట్టూరా వున్న నేలను వూడ్చి శుభ్రం చేసి గోనె సంచులు లేదా ప్లాస్టిక్ సంచులను లేదా ప్లాస్టిక్ వట్టలను పరచి తరువాత చెట్టుకొమ్మలను విదలగొట్టాలి. పట్టాలపై పండ్లు కుళ్ళిపోయి నల్లబడతాయి. నల్లబడితే వాటి నుండి వచ్చే నూనె శాతం తగ్గుతుంది. కాబట్టి సాధారణంగా ధర తగ్గుతుంది. కాబట్టి సేకరించిన పండ్ల నుంచి విత్తనాలను వేరు చేసి ఎండలో సరిగా ఎండబెట్టాలి. ఎండబెట్టిన విత్తనాలను గోనె సంచులలో నింపి గదిలో తేమ లేని ప్రదేశంలో భద్ర పరచాలి. అవసరాలనుగుణంగా రైతు గింజలను అమ్ముకోవటం లేదా వేప గింజల కషాయాన్ని తయారు చేసుకుని పంటపై పిచికారీ చేసుకోవటం లేదా వేప నూనె తీసిన పిండిని ఎరువుగానో వాడుకోవచ్చు. వేప నూనెను సస్య రక్షణలో వినియోగించుకోవచ్చు.

**సస్య రక్షణలో వేప ప్రాధాన్యత :**

❖ 50 కిలోల వేప కాయల నుంచి 30 కిలోల విత్తనాలు లభిస్తాయి. 1 కిలో విత్తనాల నుంచి 200గ్రా నూనె, 800గ్రా పిండి లభిస్తుంది.

❖ వేప సంబంధ పదార్థాలు మిగతా పురుగు మందుల కన్నా చౌకగా, సులభంగా లభ్యమవుతాయి. అయితే పంటపై పిచికారి చేయబడిన వేప సంబంధ పదార్థాలు 5-6 రోజులలో సూర్యరశ్మి ప్రభావం వల్ల వాటి శక్తిని కోల్పోతాయి. కావున అవసరానుగుణంగా పిచికారి సంఖ్య పెంచుకోవాలి.

❖ వేప నూనెను పిచికారి మోతాదు విషయంలో జాగ్రత్త వహించాలి. మోతాదు ఎక్కువైతే ఆకులు మాడిపోతాయి.

❖ వేప సంబంధ పదార్థాలు పురుగులపై యాంటి ఫీడెంట్‌గా పని చేస్తాయి. (వేప సంబంధ పదార్థాలు పిచికారి చేయబడిన పంటను పురుగులు తినవు)

❖ వేప రిపెల్లెంట్‌గా పని చేస్తుంది. (పురుగులు పంట నుంచి దూరంగా వెళతాయి)

❖ వేప సంబంధిత పదార్థాలు పిచికారి చేసిన పంటలపై పురుగులు ఎక్కువగా గుడ్లు పెట్టవు. తద్వారా పురుగుల ఉధృతి తగ్గుతుంది.

❖ పురుగుల గుడ్లపైన, మొదటి దశ లార్వాలపైన, వేప సంబంధ మందులు బాగా పని చేసి చంపి వేస్తాయి.

❖ వేప గింజ కషాయాన్ని అన్ని పంటలపై వాడవచ్చు. ముఖ్యంగా గుడ్లు, మొదటి దశ లార్వాలపై బాగా పని చేస్తుంది.

❖ ధాన్యం నిల్వలో ఆశించు కీటకాలైన ముక్కు పురుగు, ఇతర పురుగులను నియంత్రించే గుణం వేపకున్నది.

❖ వేపలో గల నింజడిన్, ధమోనేమోన్‌లకు నెమటోడ్ పురుగులను నియంత్రించగల గుణం ఉన్నది.

❖ వేప గింజల కషాయం వేప నూనె వంటి వాటి వల్ల మిత్ర పురుగులైన బదనికలకు, పరాన్న జీవులకు పని ఉండదు.

❖ వేప సంబంధ పదార్థాలు వాతావరణ కాలుష్య కారులు కావు.

❖ సమగ్ర సస్యరక్షణలో వేప సంబంధ పదార్థాలు ముఖ్యపాత్ర పోషిస్తారు.

**వేప గింజల పొడి కషాయ తయారు చేయుట:**

10 కిలోల వేప గింజల పొడిని 20 లీటర్ల నీటిలో రాత్రంతా నానబెట్టి మర్నాడు గుడ్డతో వడపోయాలి. ఈ ద్రావణానికి 250 గ్రాముల సర్ఫ్ లేదా 200 మీ.లీ. ట్రైటాన్ లేదా టీపాల్ లేదా శాండోవేట్‌ను కలిపి 200 లీ నీటిలో కలిపి ఎకరా పైరుపై పిచికారి చేసుకోవచ్చు. ☆

## ఈ మాసం వ్యవసాయ పనులు

పునర్వసు, పుష్యమి కార్తెలు

**వరి :** వరి నాట్లు వేసుకోవాలి. ముందుగా నాటిన వరికి సస్యరక్షణ చర్యలు తీసుకోవాలి. అంతర కృషి చేసుకొని, రసాయనిక ఎరువుని వేయాలి.

**మొక్కజొన్న :** పైరుకు అంతరకృషి చేయాలి. సస్యరక్షణ చర్యలు చేపట్టాలి. నెలాఖరులో రసాయన ఎరువులు వేసుకోవాలి.

**జొన్న :** ఖరీఫ్ జొన్న విత్తుకోవాలి. విత్తిన పంటకు అంతరకృషి చేసుకొని, రసాయనిక ఎరువులు వేయాలి. మొక్కలు పలుచన చేసుకోవాలి.

**పత్తి :** వర్షాధారంగా వేసే పంట విత్తుకోవాలి. ముందుగా నాటిన పత్తికి ఎరువులు వేయాలి. అంతరకృషి చేయాలి. అంతర పంటలు వేయాలి. సమగ్ర సస్యరక్షణ ప్లాను రూపొందించుకోవాలి.

**పసుపు :** గోదావరి ప్రాంతంలో పైరుకు కలుపు తీయడం, గొప్పు త్రవ్వడం, దుగ్గిరాల ప్రాంతంలో నాట్లకు భూమిని తయారు చేసి, నాట్లు వేసుకోవాలి.

**పండ్లు :** మామిడి, నిమ్మ, నారింజ, అరటి, సపోటాలకు ఎరువులు వేయాలి. జామ, సపోటాలకు అంట్లు కట్టుకోవాలి. దానివల్ల రేగు, అనాస నాట్లు వేసుకోవాలి.

**వేరుశనగ :** అంతరకృషి చేయాలి. సస్యరక్షణ చర్యలు చేయాలి.

**మిరప :** నారుమళ్లలో విత్తనాలు చల్లుకోవాలి. నారుమళ్లకు సస్యరక్షణ చర్యలు తీసుకోవాలి. మిరప నాట్లకు భూమిని తయారు చేసుకోవాలి.

**పశువులు :** గాలికుంటు, గురిక, పారుడు, దొమ్మ, ఇతర వ్యాధులు నుండి పశువులను రక్షించుకోవడానికి చర్యలు తీసుకోవాలి.

**పొగాకు :** నారుమళ్లు తయారు చేసుకోవాలి.

# విత్తన రంగాన్ని బహుళజాతి సంస్థల పరం చేస్తున్న ప్రభుత్వం


సారంపల్లి మల్లారెడ్డి, రాష్ట్ర కార్యదర్శి
ఆంధ్రప్రదేశ్ రైతు సంఘం

"విత్తనం పంటకు మూలం" నూతన వ్యవసాయ విధానం పుణ్యమాయంటూ విత్తన రంగాన్ని రాష్ట్రంలో క్రమ క్రమంగా బహుళజాతి సంస్థలపరం చేశారు. వారి లాభాలకనుకూలంగా వ్యవస్థీకృత మార్పులు చేసి వేస్తున్నారు. చట్టాలలో మార్పులు, విత్తన ఉత్పత్తి- పంపిణీ నుండి ప్రభుత్వం విరమించుకోవడం లాంటి చర్యలు అమలు చేస్తున్నారు. గత ప్రభుత్వం దారిలోనే నేటి ప్రభుత్వం పయనిస్తున్నది. అయితే నేటి ప్రభుత్వం నినాదాలలో కొంత మార్పు కనబరుస్తున్నది తప్ప ఆచరణలో తేడాలేమిలేవు. ఈ విధానాలు రైతులకు ప్రాణాంతకంగా పరిణమిస్తున్నాయి. ఎక్కడిక్కడ రైతులు ఆందోళనలు చేపడ్తున్నా ప్రభుత్వం "నిమ్మకు నీరెత్తినట్లు" న్నది. ప్రైవేటీకరణ- ప్రపంచీకరణను బహుళజాతి సంస్థలకనుకూలంగా రాష్ట్ర ప్రభుత్వం త్రికరణ శుద్ధిగా అమలు చేస్తున్నది. రాష్ట్ర రైతుల ప్రయోజనాలను బలిపెడ్తున్నది. ఎక్కడ చూచినా నకిలి విత్తనాల బెడద, కల్తీ విత్తనాల హోరు సాగుతున్నది. లక్షల రూపాయల విలువగల నాణ్యతలేని, ధృవీకరణ లేని విత్తనాలు పట్టుబడినా నేరస్తులు మాత్రం నిశ్చింతగానేతిరవుతున్నారు. రాష్ట్రంలో కల్తీ వ్యాపారానికి కినుక వహించిన వ్యవసాయ శాఖామాత్యులు "కల్తీ విత్తన వ్యాపారులను బట్టలూడదీసి బజారులలో త్రిప్పండి" అంటూ ప్రకటించారంటే పరిస్థితుల తీవ్రత అర్థమవుతుంది. ఎందుకీదురవస్థ?

రాష్ట్రంలో ఖరీఫ్‌లో 36 లక్షల క్వింటాళ్ళు, రబీలో 14 లక్షల క్వింటాళ్ళ విత్తనం అవసరం. ఈ అవసర లక్ష్యాన్ని గుర్తించిన ప్రభుత్వం మాత్రం ప్రభుత్వ, ప్రైవేటు రంగంలో ఖరీఫ్‌లో ఏటా 14 లక్షల క్వింటాళ్ళు మాత్రమే సేకరించి, సరఫరా చేస్తున్నారు. మిగిలిన 20 లక్షల క్వింటాళ్ళు రైతులు సేకరించుకుంటున్నారు. గత 6,7 సంవత్సరాలుగా కరువులు ఏర్పడడంతో వేసిన పంటలు నాసిరకంగా పండడమో, అసలు పంటలు పండకపోవడమో జరిగింది. ఫలితంగా రైతుల ఇండ్లలో విత్తనాలులేని పరిస్థితి ఏర్పడింది. ఇటు ప్రభుత్వ సరఫరా లేక, అటూ మార్కెట్లో తమకు కావాల్సిన విత్తనాలు దొరకక విత్తన సేకరణ సందర్భంగా ఒత్తిడి పెరిగి లాఠీఛార్జీలు, కాల్పులు సాగుతున్నాయి. ఏటా ఇది తతంగంగా మారింది. సరఫరా పట్టికలో చూపిన విధంగా ఉంది.

> నకిలీల వ్యాపారం యదేచ్ఛగానే సాగుతున్నది. చట్టం తన పనితాను చేసుకుంటూ పోతుందన్న పాలకుల మాట విలువ లేనిదిగా ఉంది. దీనికి తోడు లైసెన్సు లేని కంపెనీలు విత్తన ఉత్పత్తిలో కీలక పాత్ర వహిస్తున్నాయి. ప్రభుత్వ అధికారుల అండదండలతోటి ఈ అక్రమ వ్యాపారం సాగుతున్నట్లు జగమెరిగిన సత్యం. ప్రస్తుతం రాష్ట్రంలో విత్తన రంగంలో రైతుకు రక్షణలేని పరిస్థితి కొనసాగుతున్నది.

| సం॥ | లక్షల క్వింటాళ్ళు |
|---|---|
| 2000-01 | 12.67 |
| 2001-02 | 13.14 |
| 2002-03 | 13.90 |
| 2003-04 | 14.49 |
| 2004-05 | 13.50 |
| 2005-06 | 14.00 |

ఈ పంపిణీ విధానం పరిశీలిస్తే గత ప్రభుత్వం, నేటి ప్రభుత్వం పంపిణి విధానంలో జరిగిన మార్పేమిలేదు. ప్రచారంతప్ప-

విత్తన చట్టం

1966 విత్తన చట్టం నాటి హరిత విప్లవ అవసరాలకు దిగుమతి- కొరకు ఏర్పాటు చేశారు. కేంద్రం చేసిన ఈ బిల్లుకు మార్పులు చేస్తూ ప్రభుత్వాలు చట్టాలకు సవరణలు తెచ్చాయి. ఎకంగా రాష్ట్ర ప్రభుత్వం విత్తన సర్టిఫికేషన్ అధికారాన్ని ఉత్పత్తి సంస్థలకే దఖలు పర్చింది. "పరస్పర అవగాహనా పత్రం" (యం.ఓ.యు) లో విత్తన కంపెనీలచే అగ్రిమెంటు చేయించి అవకతవకలకు కంపెనీలను బాధ్యుల్ని చేస్తానని చెప్పారు. ఎం.ఓ.యు.ల అమలు వచ్చిన గత మూడు సంవత్సరాలుగా లక్షల రూపాయ విత్తనాలు నాణ్యతలేనివి సరఫరా చేసినట్లు జిల్లా, రాష్ట్ర కమిటీలు ధృవీకరించినా, ఏ ఒక్క కంపెనీని శిక్షించలేదు. సరికదా వారికే తిరిగి ఉత్పత్తికి అవకాశాలు కల్పించారు. విత్తన చట్టం రాజ్యాంగం రీత్యా రాష్ట్ర జాబితాలో నున్నప్పటికి రాష్ట్ర ప్రభుత్వం ఈ బాధ్యతను కేంద్రంపైకి త్రోస్తున్నది. రాష్ట్ర ప్రభుత్వం బిల్లు తయారు చేసి శాసన సభ ఆమోదం పొంది, కేంద్రానికి పంపింది. రాష్ట్రం పంపిన బిల్లును పరిశీలించకుండానే కేంద్రం "2004 విత్తన చట్టాన్ని" రూపొందించి రాష్ట్రాలకు పంపింది. కాని ఇంతవరకు రైతుల ప్రయోజనాలను రక్షించే చట్టం మాత్రం కేంద్రంగాని, రాష్ట్రంగాని చేయలేదు. దీనినవకాశంగా తీసుకున్న విత్తన వ్యాపారులు లైసెన్సు లేకుండానే విత్తనాల ఉత్పత్తి, సరఫరా కోట్ల రూపాయలలో చేస్తున్నారు.

### బహుళజాతి సంస్థల ప్రవేశం

మన్‌శాంటో, కార్గిల్, ఐ.టి.సి, డూపాంట్, ప్రో-ఆగ్రో లాంటి సంస్థలు రాష్ట్రంలో విత్తన రంగంలో వ్యాపారాలు చేయడమేకాక పెద్ద ఎత్తున రైతులచే విత్తన ఉత్పత్తి చేయిస్తున్నాయి. భారత దేశ విత్తన అవసరాలలో 40 శాతం విత్తనం అధికారికంగా మరో 20 శాతం విత్తనాలు అనధికారికంగా ఉత్పత్తి చేసి సరఫరా చేస్తున్నాయి. ధాన్యం, మొక్కజొన్న, పత్తి, మిరప, కూరగాయలు, ప్రొద్దుతిరుగుడు, వేరుశనగ, జొన్నలు, రాగులు, సజ్జలు మొదలైన విత్తనాలు పెద్ద ఎత్తున ఉత్పత్తి చేస్తున్నారు ఈ సంస్థలు రైతులకు మూల విత్తనాలు సరఫరా చేస్తాయి. విత్తన ఉత్పత్తి ద్వారా అధిక మొత్తంగా ఆదాయాన్ని పొందవచ్చని చేసిన ప్రచారంతో కర్నూలు, మహబూబ్‌నగర్, అనంతపురం, వరంగల్, కరీంనగర్, నిజామాబాద్ జిల్లాలలో పెద్ద ఎత్తున రైతులు విత్తన రాష్ట్రంలో ఉత్పత్తి ప్రారంభించారు. మొదటి రెండు సంవత్సరాలు రైతులను మురిపించిన కంపెనీలు రాను, రాను రైతులను దివాళా దిశకు నెట్టాయి. చివరకు విత్తన ఉత్పత్తి రైతులకు కూడా కల్తీ, నాణ్యతలేని మూల

విత్తనాల సరఫరా బెడద తప్పలేదు. కంపెనీలు అమ్మే ధరలో 10 శాతం కూడా రైతులకు ఉత్పత్తి ధర ఇవ్వడంలేదు. ఆ రైతులు ఆందోళనలు జరుపుతున్నారు.

### బి.టి. కాటన్ బాగోతం

మొదట పత్తి విత్తనాలతో ప్రారంభమైన బి.టి. (బాసిల్లస్ తురుంజీన్స్ రకం) టెక్నాలజీ మొక్కజొన్న, కూరగాయాలు, నూనె గింజలలోకి వ్యాప్తి చెందింది. శనగపచ్చ పురుగు దాడిని నివారిస్తుందని, రైతు పెట్టుబడి గణనీయంగా తగ్గి ఉత్పత్తి పెరుగుతుందన్న ప్రచారం బాగా సాగింది. మొదట మన్‌శాంటో బహుళజాతి కంపెనీ మహికో కంపెనీతో కలిసి పత్తి విత్తనం అమ్మింది. మాక్-12, మాక్-164, మాక్-184 విత్తనాలు విడుదల చేసింది. ఈ విత్తనాలు వేసిన పంటలు నష్టపోయాయని ప్రభుత్వానికి నివేదికలు రావడంతో అటూ ప్రభుత్వం, ఇటు నష్టపోయిన రైతులు పరిహారం కొరకు పెద్ద ఎత్తున ఆందోళనలు చేసారు. ఈ ఆందోళనలు గమనించిన జి.ఇ.ఎ.సి.(కేంద్ర సంస్థ) పై విత్తనాలను ఆంధ్రప్రదేశ్‌లో విడుదల చేయకుండా నిషేధించింది. అదే సందర్భంలో ఎం.ఆర్.సి-6322 మరియు 6198 బి.టి. విత్తనాలకు అనుమతిచ్చినట్లు తెలిసింది. ఈ అనుమతివ్వడానికి జి.ఇ.ఎ.సి. అంత్యంత ఉత్సాహం ప్రదర్శించి నిర్ణయించిన సమావేశ తేదిని మే 13 నుండి మే 3 కు (ముందుకు) తెచ్చింది. ఆంధ్రప్రదేశ్ మినహా మిగిలిన రాష్ట్రాలలో మన్‌శాంటోకు చెందిన అన్ని రకాల బి.టి. విత్తనాలకు అనుమతినిచ్చారు. ఇదే కంపెనీ ప్యారీ కంపెనీతో కలిసి మొక్కజొన్న విత్తన వ్యాపారం చేసింది. ప్రకాశ జిల్లాలో ఈ విత్తనం వేసిన రైతులు రు. 44 లక్షలకు నష్టపోయారు. పరిహారం చెల్లించనందుకు కంపెనీ లైసెన్సును ప్రభుత్వం రద్దు చేశారు. అయినా పరోక్షంగా వ్యాపారం సాగిస్తూనే ఉన్నారు. ప్రేరణ పొందిన రాశి - నూజివీడు విత్తన కంపెనీలు బి.టి. టెక్నాలజీని మన్‌శాంటో నుండి 450 గ్రామాల పత్తి విత్తనాలకు రు. 1250/- లు టెక్నాలజీ క్రింద రాయితీ చెల్లించి కొనుగోలు చేస్తున్నారు.ఈ విధంగా రు. 60 కోట్లు (అంచనా) రాయల్టీ చెల్లించి కొనుగోలు చేసి తమ విత్తన సంస్థల పేర అమ్మకాలు సాగిస్తున్నారు. ఎటు చూచినా మన్‌శాంటోకు ఆదాయాలు వస్తూనే ఉన్నాయి. ఆ భారాన్ని రైతులు విత్తన ధరలు పెంపుతో భరిస్తున్నారు. విత్తనాల ధరలు గత మూడు సంవత్సరాలపై 7,8 రెట్లు పెరిగాయి. ఈ ధరలకు ప్రభుత్వ నియంత్రణ లేదు. ధరల నిర్ణయానికి శాస్త్రీయ విధానమంటూ లేదు. రైతులను బహుళజాతి సంస్థలు కొల్లగొడుతున్నాయి.

### నకిలీల బెడద- చట్టం అమలు తీరు

నకిలీల వ్యాపారం యదేచ్ఛగానే సాగుతున్నది. చట్టం తన పనితాను చేసుకుంటూ పోతుందన్న పాలకుల మాట విలువ లేనిదిగా ఉంది. చట్ట ప్రకారం నకిలీ విత్తనాలు అమ్ముతూ మొదటి సారి పట్టుబడినవారికి రు. 500 లనుండి రు. 10 వేల వరకు జరిమానా వేస్తారు. రెండోసారి తప్పు చేస్తే రు. లక్ష జరిమానాతోపాటు 6 నెలలు జైలు శిక్ష ఉంది. నకిలీ రుజువు కావడం అంతతేలిక కాదు. పైగా రు. కోట్లలో వ్యాపారం చేసే వారికి ఈ శిక్ష ఒక లెఖ్ఖా! ప్రస్తుత చట్టాలు ఏ కంపెనీని ఏమి చేయలేవన్న వాస్తవం అందరెరిగినదే.

1998 నుండి కొనసాగుతున్న నూతన వ్యవసాయ విధానం ఫలితంగా నేటి వరకు లక్షలాది ఎకరాలలో పంటలు నాణ్యతలేని విత్తనాల వలన రైతులు నష్టపోయారు. కన్స్యూమర్ కోర్టులలో వేసిన వందలాది కేసులు నేటికి పరిష్కారం లేకుండా ఉన్నాయి. జిల్లా ఎం.ఓ.యు. కమిటీల పని రైతులకు అందుబాటులోలేదు. ఉన్నప్పటికీ విత్తనాల పరిశీలన కేంద్రాలు లేకపోవుటకే పంటలు దెబ్బతిన్నప్పటికి అవి విత్తనాల వలన కాదని నిర్ణయిస్తున్నారు. అనంతపురం జిల్లాలో జొన్న, మిరప పంటలు విత్తనాల లోపం వలన నష్టపోయినప్పటికి వారికి పరిహారం నిర్ణయించుటలో యం.ఓ.యు. కమిటీలు విఫలం చెందాయి. ఇలాంటి ఘటనలు అనేకం. రాష్ట్రంలో నాణ్యతలేని విత్తన వ్యాపారం కోట్లలో సాగుతున్నది., దీనికి తోడు లైసెన్సు లేని కంపెనీలు విత్తన ఉత్పత్తిలో కీలక పాత్ర వహిస్తున్నాయి. ప్రభుత్వ అధికారుల అండదండలతోటి ఈ అక్రమ వ్యాపారం సాగుతున్నట్లు జగమెరిగిన సత్యం. ప్రస్తుతం రాష్ట్రంలో విత్తన రంగంలో రైతుకు రక్షణలేని పరిస్థితి కొనసాగుతున్నది.

రాష్ట్రంలో 200 శాసన సభా నియోజకవర్గాలలో " రబీ విత్తన గ్రామం పథకం" ఏర్పాటు చేస్తానని, ఒక్కో విత్తన గ్రామానికి రెండు లక్షల చొప్పున రు. 4 కోట్లు విడుదల చేస్తామని, రాష్ట్రంలో 27 సీడ్ పార్మ్ పునరుద్ధరణకు రు. 2 కోట్లు ఇస్తానని ముఖ్యమంత్రి గారు ప్రకటించారు. ప్రస్తుతం ఐదుచోట్ల (తాడేపల్లిగూడెం, రాజేంద్రనగర్, బాపట్ల, వరంగల్, అనంతపురంలలో) యున్న విత్తన ఎరువుల పరీక్షా కేంద్రాలను అన్ని జిల్లాలలో ఏర్పాటు చేస్తానికి రు. 25.50 కోట్లు కేటాయిస్తానన్నారు. వీటి అమలుకు ఎదురు చూడాల్సిందే. గతంలో ప్రకటించిన పథకాలు ఆటకెక్కిన అనుభవం కండ్లముందున్నది. ఈ కేటాయింపు ఎంతమేర సమస్యలు పరిష్కరిస్తాయో వేచి చూడాల్సిందే.

పెటెంట్, విత్తన చట్టాలలో మార్పులు తెచ్చి పూర్తి రంగాన్ని బహుళజాతి సంస్థలు ఆక్రమించే దిశగా ప్రభుత్వాలు పరుగులు పెడ్తున్నాయి. దీనిని నిరోధించాలి. అన్ని వనరులున్న వ్యవసాయ విశ్వ విద్యాలయాలను కూడా బహుళజాతి సంస్థల పరం చేసే ఆలోచనలో ప్రభుత్వాలున్నాయి. ఈ విధానం రైతుల కనుకూలంగా విత్తన సమస్యను పరిష్కరిస్తాయా? లేక విత్తన సమస్యతో వ్యవసాయ సంక్షోభం మరింత తీవ్రతరమవుతుందా అన్నది నేడున్న ప్రశ్న? ప్రస్తుత విధానాలు సమూలంగా మార్చి విత్తన రంగాన్ని ప్రభుత్వ రంగంలోనే నిర్వహించి రైతులకు రక్షణ కల్పించాలి. రాష్ట్ర ప్రభుత్వ ఆ దిశగా కదలాలి. లేనట్లయితే ఉద్యమాలే శరణ్యం. ☆

### పెట్రోల్ డీజిల్ ధరల పెరుగుదల తెలుసా

| క్ర.. సం | వివరం – | పెట్రోల్ లీ/రు. | డీజిల్ లీ/రు. |
|---|---|---|---|
| **1** | నికర ధర | **17.51** | **18.53** |
| 2 | కష్టమ్స్ సుంకం 16.06.2005 నుండి | 49.00 | 83.00 |
| 3 | ఎక్స్‌సైజ్ డ్యూటీ | 14.74 | 4.93 |
| 4 | అమ్మకం పన్ను | 6.75 | 3.16 |
| **5** | **మొత్తం సుంకాలు** | **22.98** | **9.92** |
| **6** | చిల్లర అమ్మకం ధర **(1.5)** | **40.49** | **28.45** |
| | ప్రస్తుత పెంపు | 2.50 | 2.00 |

చమురు రంగం నుండి ఏటా కేంద్రం రు. 78 వేల కోట్లు రాష్ట్ర ప్రభుత్వాలు రూపాయలు రు. 37 వేల కోట్లు పన్నుల రూపంలో పిండుతున్నాయి. లీటరు పెట్రోల్ ధర రు. 2.50 పెంచితే అందులో రుపాయి 60 పైసలు పన్నులే. ఓ.ఎన్.జి.సి.కి రు. 12 వేల కోట్లు లాభాలు పెరిగాయి. మరీ రిలయన్స్, ఎస్సార్ లాంటి ప్రైవేటు సంస్థలు లాభాలు ఎంత గడిస్తున్నాయి?

పంటలసాగు

# తొలకరి వేరుశనగ సాగు ఆధునిక యాజమాన్య పద్ధతులు



శ్రీమతి ఆర్.సుజాత,
శ్రీ పి.వెంకట్రావు , విశాఖపట్నం.

వర్షాధారంగా పండించే నూనె గింజల పంటలలో వేరుశనగ ప్రధానమైనది.మన రాష్ట్రంలో వంట నూనెల ఉత్పత్తిలో కూడా వేరుశనగ ముఖ్యపాత్ర పోషిస్తుంది. వేరుశనగ గింజలలో ప్రోటీనులు 22-36% , నూనె 40-45% , పిండి పదార్థాలు 6-24% , సుక్రోజ్ 1-2%, స్టార్చ్ 1-5% సెల్యులోజ్ 1-2% లభ్యమవుతాయి. వేరుశనగ నూనెలో ప్రోటీనులు 45-60% వుండి అప్లా టాక్సిన్ శాతం చాలా తక్కువగా వుండి మధుమేహ వ్యాధిగ్రస్తులకు మంచి ఆహారంగా ఉపయోగపడుతుంది.రాష్ట్రంలో ఈ పంట 15 లక్షల హెక్టార్లలో సాగు చేయబడి, 10 లక్షల టన్నుల దిగుబడినిస్తుంది. దీనిలో ఎక్కువ భాగం (80%) తొలకరిలో వర్షాధారపు పంటగా సాగవుతుంది. కానీ తొలకరి దిగుబడులు మాత్రం వర్షాభావం తదితర పరిస్థితుల కారణంగా తక్కువగా వున్నాయి. చీడపీడలు, నాణ్యమైన వంగడాల లేమి, సరైన యాజమాన్య పద్ధతులు పాటించకపోవటం మొదలైనవి తక్కువ దిగుబడులకు కారణాలుగా చెప్పవచ్చు. ప్రస్తుతం వేరుశనగలో హెచ్చు దిగుబడులు పొందడానికి ఆధునిక యాజమాన్య పద్ధతులను గురించి తెలుసుకుందాం.

**పంటకాలం :** అధిక దిగుబడిని సాధించాలంటే సరైన సమయంలో విత్తటం చాలా మంచిది. రాయలసీమ, దక్షిణ తెలంగాణా, ఉత్తర కోస్తా ప్రాంతాలకు తొలకరిలో జూన్ - జూలై మాసంలోను విత్తుకోవచ్చును.

**తొలకరికి అనువైన రకాలు :**

1. అత్యల్ప వర్షపాతం మరియు బెట్ట పరిస్థితులకు: వేమన(కె-134), టి.యం.వి.-2, తిరుపతి-1, తిరుపతి-2, తిరుపతి-4, కదిరి-5
2. కొద్దిపాటి నీటి వనతి: వేమన, జె.యల్-24, టి.యం.వి2, తిరుపతి-1, తిరుపతి-4, కదిరి-3, కదిరి-5, నారాయణ.
3. అధిక వర్షపాత ప్రాంతాలకు: తిరుపతి-3, కదిరి-3, కదిరి-6, కదిరి-5, టి.జి.-26
4. మొవ్వుకుళ్ళు తెగులు ప్రాంతాలకు: కదిరి-3, ఐ.సి.జి.యస్-11, ఐ.సి.జి.యస్-44
5. ఆకుమచ్చ తెగులు ప్రాంతాలకు: వేమన, కదిరి-5, తిరుపతి-3

**నేల తయారి:** విత్తిన గింజలు సులువుగా మొలకెత్తడానికి వీలుగా కలుపు మొక్కల ఉధృతిని తగ్గించడానికి నేలను సుమారు 15-20 సెం.మీ లోతు వరకు మెత్తని దుక్కి చేసి పెద్ద పెళ్ళలు, ఎత్తుపల్లాలు లేకుండా బాగా చదును చేయాలి. ఆఖరి దుక్కిలో ఎకరాకు 4-5 టన్నుల పశువుల ఎరువు గాని కంపోస్టు గాని వేసి కలయదున్ని, బాగా దుక్కి వేయాలి.

**నేలలు:** ఇసుకతో కూడిన గరప నేలలు, చల్కా భూములు, ఎర్ర నేలలు అనుకూలమైనవి. చవుడు, నీరు ఇంకని బంకమన్ను గల నల్లరేగడి నేలలో పంట వేయరాదు.

**విత్తన మోతాదు :** వేరుశనగ విత్తే సమయం మరియు గింజ బరువుని బట్టి ఎకరాకు విత్తన మోతాదు మారుతుంది.

1. జె.యల్.24, కదిరి-4, వేమన(కె-134), తిరుపతి-4, ఐ.సి.జి.యస్-44, కదరి-5, కదిరి-6 రకాలైతే 60 కిలోలు వాడాలి.
2. టి.యం.వి.-2, తిరుపతి-1, తిరుపతి-2, తిరుపతి-3, కదిరి-3,ఐ.సి.జి.యస్-11, జె.సి.జి-88 రకాలైతే 50 కిలోలు వాడాలి.

**విత్తన శుద్ధి :** మంచి ధృఢమైన విత్తనం ఎంపిక చేసి, విత్తనం ద్వారా వ్యాప్తి చెందే తెగుళ్ళు నివారణకు మాంకోజెబ్ 3 గ్రాములు లేదా కార్బండజిమ్ 2.5 గ్రాములు లేదా ట్రైకోడెర్మా విరిడి 4 గ్రాములు చొప్పున ఒక కిలో విత్తనానికి వాడి విత్తన శుద్ధి చేయాలి.

**విత్తే దూరం :** ఒక చ॥మీ॥ కు పంట తీసే సమయానికి కనీసం 30-33 మొక్కలుంటే ఆశించిన దిగుబడులు పొందవచ్చు.కాబట్టి వరుసల మధ్య 30 సెం.మీ, మొక్కల మధ్య 10 సెం.మీ(గుత్తి రకాలకు)-15 సెం.మీ.(తీగ/పెద్ద గుత్తి రకాలకు) ఉండేటట్లు విత్తుకోవాలి.వేరుశనగ విత్తనం ఖరీదు ఎక్కువ కాబట్టి రైతులు తక్కువ విత్తనం వాడటం వలన మొక్కల సంఖ్య తగ్గి, దిగుబడి తగ్గుతుంది.అందువలన ప్రతి రైతు సిఫారసు మేరకు విత్తనాన్ని తప్పనిసరిగా వాడాలి. మొక్కల సాంద్రత పై విధంగా వుండేటట్లు విత్తితే మొవ్వుకుళ్ళు తెగులు వ్యాప్తిని అరికట్టవచ్చు. మొవ్వుకుళ్ళు తెగులు ఎక్కువగా ఆశించే ప్రాంతాలలో పొలం చుట్టూ 4-5 సాళ్ళు జొన్న లేదా సజ్జను వేసుకుంటే మొవ్వుకుళ్ళు ఉధృతి తగ్గుతుంది.

**విత్తుట:** దాదాపు 20మి.మీ. వర్షపాతం జూన్-జూలై 15 లోపు గాని వస్తే విత్తనాన్ని గొర్రుతో గాని, లేక నాగటి సాళ్ళలో గాని 5-7 సెం.మీ. లోతు మించకుండా నేలలో తగినంత తేమ వున్న సమయంలో వరుసలలో విత్తాలి.

**ఎరువుల యాజమాన్యం:** వేరుశనగ పంటకు నత్రజని, భాస్వరం, పొటాషియం, కాల్షియం, గంధకం వంటి ప్రధాన పోషకాలు జింకు, ఇనుము వంటి సూక్ష్మ పోషకాలు తగిన మోతాదులో అందించినపుడు కాయలు, గింజలు బాగా వృద్ధి చెంది, నాణ్యమైన అధిక దిగుబడులు పొందడానికి అవకాశం వుంటుంది.ఈ పోషక పదార్థాలను సేంద్రియ ఎరువుల ద్వారా మరియు రసాయన ఎరువుల ద్వారా అందించినప్పుడే చీడపీడల ఉధృతి తగ్గి నాణ్యత గల దిగుబడులు పొందవచ్చు. ఆఖరి

దుక్కిలో ఎకరానికి 4-5 టన్నుల బాగా చివికిన పశువు ఎరువు కాని, కంపోస్టు గాని వేసి కలియదున్నాలి. పశువుల ఎరువు ద్వారా స్థూల పోషకాలైన నత్రజని, భాస్వరం, పొటాషియం కాకుండా పంటకు అవసరమయ్యే సూక్ష్మ పోషకమూలకాలు కూడా లభ్యమవుతాయి. అంతేకాకుండా భూ భౌతిక స్థితి మెరుగుబడి నీరు నిల్వ చేసుకునే శక్తి పెరుగుతుంది. వర్షాభావ పరిస్థితులలో బెట్ట ప్రభావం తక్కువగా వుంటుంది.

రసాయన ఎరువుల విషయంలో ఎరువుల మోతాదును, భూసారాన్ని బట్టి నిర్ణయించడం చాలా ఉత్తమమైనది. వేరుశనగ లెగ్యూమ్ జాతికి చెందినది. కాబట్టి నత్రజని అవసరం అంతగా వుండదు. అయితే నత్రజని లభ్యత తక్కువగా వుండే తేలిక భూముల్లో మాత్రం ఎకరాకు 17 కిలోల యూరియాను విత్తే సమయంలోనే వేసుకోవాలి. వేరుశనగ పంటకు భాస్వరాన్ని సూపర్ ఫాస్ఫేట్ రూపంలో వేయటం చాలా ముఖ్యం. కాబట్టి ఎకరాకు 16 కిలోల భాస్వరాన్నిచ్చే 100కిలోల సూపర్ ఫాస్ఫేట్ ఎరువు వేయటం శ్రేయస్కరం. దీనిలో భాస్వరంతోపాటు నూనె శాతం, పప్పు శాతం పెరిగేందుకు అవసరమైన కాల్షియం 19.5%, గంధకం 12.5% కూడా వుంటాయి. ఎకరాకు 16 కిలోల పొటాష్ కూడా మ్యూరేట్ ఆఫ్ పొటాష్ (27కిలోలు) రూపంలో వేయాలి. పూర్తి భాస్వరం మరియు పొటాష్ ఎరువులను విత్తే ముందు ఆఖరి దుక్కిలో వేయాలి.

కాల్షియం, గంధకం వేరుశనగ కాయల్లో గింజలు బాగా అభివృద్ధి చెందటానికి, గింజలలోని నూనె శాతం పెంచటానికి దోహద పడతాయి. ఈ పోషక పదార్థాలు ఇచ్చేందుకు ఎకరాకు 200 కిలోల జిప్సంను పైరు పూత సమయంలో కలుపు తీసేటప్పుడు మొక్కల మొదళ్ళలో సుమారు 5 సెం.మీ. లోతులో కాయ వూరే ప్రదేశంలో పడేటట్లు వేయాలి. జిప్సం ఎరువు మొదళ్ళ దగ్గర వేశాక మట్టిలో కలిసిపోయేలా కలియబెట్టాలి.

ఉత్తర కోస్తా జిల్లాల్లో అక్కడక్కడ జింకుధాతు లోపం కనిపిస్తుంది. జింకు లోపముంటే ఆకులు పసుపు ఆకుపచ్చ రంగులో వుండి, ఈనెలు ముదురు ఆకుపచ్చ రంగులో కనిపిస్తాయి. భూమిలో జింకు ధాతులోపముంటే జింకు సల్ఫేటును ఎకరాకు 20 కిలోలు మూడు పంటలకొకసారి నేలలో వేసి కలియదున్నాలి. పైరు మీద లోప లక్షణాలు కనిపిస్తే 0.2% జింకు సల్ఫేట్ ద్రావణాన్ని (లీటరు నీటికి రెండు గ్రాముల చొప్పున) పిచికారి చేయాలి.

ఇనుప ధాతు లోపం నల్లరేగడి నేలల్లో అధిక తేమ వున్నప్పుడు కనిపిస్తుంది. లేత ఆకులు పసుపు పచ్చగాను, తర్వాత తెలుపు రంగుకు మారుతాయి. ఈ లోపాన్ని సవరించటానికి ఎకరాకు 1 కిలో అన్నభేది మరియు 200గ్రా. సిట్రిక్ ఆమ్లాన్ని 200 లీటర్ల నీటిలో కలిపి ఒకటి లేదా రెండుసార్లు (7 రోజుల వ్యవధిలో) పిచికారి చేయాలి.

**అంతర కృషి :** విత్తిన 45 రోజుల వరకు పైరును కలుపు మొక్కల బారి నుండి కాపాడాలి. విత్తిన 20 రోజులకొకసారి, అటు తర్వాత 15 రోజులకు రెండవసారి కలుపు తీసి మట్టిని త్రవ్వి మొక్కల మొదళ్ళకు ఎగదోయాలి. విత్తిన 45 రోజుల లోపు ఎలాంటి కలుపు లేకుండా చూడాలి. విత్తిన 45 రోజుల తరువాత ఏ విధమైన అంతర కృషి చేయరాదు. లేనిచో ఊడలు దెబ్బతిని దిగుబడి తగ్గుతుంది. కూలీలు కొరత వున్న ప్రాంతాలలో రసాయన మందులు వాడి కలుపు నివారించుకోవచ్చు. బుటాక్లోర్ 1.25లీ చొప్పున (3 మి.లీ/లీ) విత్తనం వేసిన మూడు రోజుల లోపల 450 లీటర్ల నీటిలో కలిసి పొలమంతా బాగా తడిచేటట్లు తేమ వున్నట్లు పిచికారీ చేయాలి. వీటి ద్వారా విత్తనం వేసిన 30 రోజుల వరకు వెడల్పాకులు గల కలుపు మొక్కలు నివారించబడతాయి.

**నీటి యాజమాన్యం:** పైరు మొలిచిన 15-20 రోజుల లోపు ఎకరాకు 2 టన్నుల చొప్పున వేరు శనగ పొట్టును పొలంపై పరచాలి. బెట్ట పరిస్థితులలో కయొలిన్ లేదా సున్నం లీటరు నీటికి 50గ్రా.ల చొప్పున కలిపి పైరుపై పిచికారీ చేసి మొక్కల ద్వారా ఆవిరైపోయే నీటి నష్టాన్ని తగ్గించుకోవచ్చు. బెట్ట నుండి పైరు త్వరగా కోలుకోవడానికి ప్రతి లీటరు నీటికి 20 గ్రా.ల యూరియా కలిపి పిచికారీ చేయాలి.

**అంతర పంటలు:** కంది, ఆముదం, సజ్జ మరియు జొన్న పంటలను వేరుశనగతో అంతర పంటలుగా సాగు చేయవచ్చు. తొలకరి వేరుశనగ పంటలో ప్రతి 7 వేరుశనగ సాళ్ళకు ఒక కంది లేక ఒక ఆముదం సాలు వేస్తే నికర ఆదాయం అధికంగా వుంటుంది. ప్రతి ఆరు సాళ్ళ వేరుశనగకు రెండుసాళ్ళ సజ్జను కూడా వేసుకోవచ్చు. వేరుశనగను వరితో పంట మార్పిడి చేయడం వలన వేరుశనగను నులి పురుగుల బెడద తగ్గించుకోవచ్చు.

**వచ్చే సంచికలో తెగుళ్లు, ఆశించే పురుగుల గురించి తెలుసుకుందాం.** ☆

( 9 వ పేజీ తరువాయి)

వుండేటట్లు వేసే ఎరువుల మోతాదులను సవరించాలి. డిఎపి ఎరువులు దొరకకపోతే, 20:20:20 లేదా 28:28:0 కాంప్లెక్స్ ఎరువులు లేదా యూరియా మరియు సూపర్‌లు వాడవచ్చు. అయితే ఎరువు మోతాదులను సరిచూసుకొని వాడుకోవాలి.

16. జింకులాంటి సూక్ష్మపోషక పదార్థం భూమిలో లోపం వున్నపుడు, నత్రజని, ఫాస్ఫరస్ మరియు పొటాష్ ఎరువులు ఎంత వేసినప్పటికీ, సరి అయిన పంట దిగుబడి రాదు. అటువంటి సందర్భాల్లో, విధిగా జింకు లోపాన్ని జింకు సల్ఫేట్ ఎకరానికి మెట్టకు 10 కిలోలు, మాగాణికి 20 కిలోలు (ప్రతి మూడవ పంటకు ఒకేసారి) వేసి జింకు లోపాన్ని సరిచేయాలి. అపుడే వేసిన ఎరువుకు అధిక ఫలసాయం వస్తుంది.

17. ఒక వేళ చౌడుభూమి అయితే, బీడు భూములకు సూచించిన యాజమాన్య పద్ధతులు అనుసరించుతూ, ఎరువులు వాడాలి. లేనిచో వేసిన ఎరువులు సద్వినియోగం కావు. బీడు భూమికి కాల్షియం అమ్మోనియం నైట్రేట్ ఎరువు శ్రేష్టం. కానీ దీన్ని మాగాణి వరికి ఎట్టి పరిస్థితులలోను వాడకూడదు.

18. ఎరువులు కొనడానికి తగినంత పెట్టుబడి లేనపుడు, పరిమితంగా వున్న ఎరువులను స్థాయిని బట్టి తక్కువ భూమిలో సూచించిన ఎరువుల స్థాయిని గుర్తించి, సాధ్యమైనంత ఎక్కువ భూమిలో పల్చగానైనా వేయాలి. ఇలా వేస్తే ఎకరానికి దిగుబడి స్థాయి మామూలుగా ఎరువులు వేసిన పొలానికన్నా తక్కువ వేసినప్పటికీ, పంట మొత్తం మీద ఎక్కువగా వచ్చి, ఎరువుల మీద పెట్టిన పెట్టుబడికి గరిష్ట లాభం వస్తుంది.

19. చాలా కొద్దిగా నత్రజని ఎరువు వున్నపుడు, నత్రజని ఎరువును స్ప్రేయర్ ద్వారా రెండు శాతం యూరియా ద్రావాన్ని మొక్కల మీద స్ప్రే చేస్తే, నత్రజని ఎరువు సామర్థ్యం గరిష్ఠంగా 70-80 శాతం వరకు పెరిగి, బాగా పనిచేస్తుంది. అయితే, వారం రోజుల కొకసారి నాలుగు, ఐదు సార్లు స్ప్రే చేయాలి.

20 నత్రజని ఎరువును అవసరమయిన దానికంటె ఎక్కువ వేస్తే లాభం కలుగకపోగా, చీడపీడల నష్టం కలుగుతుంది.

పై పద్ధతులు అన్ని ఒకేసారి ఆచరించడం వీలు కాకపోవచ్చు. వీలయినన్ని సూచనలు అమలు చేస్తే ఎరువుల మీద పెట్టుబడికి, అధిక ప్రయోజనం వుంటుంది. ☆

# ఆధునిక వ్యవసాయ పరికరాలు

వ్యవసాయ రంగంలో ఆధునిక పరికరాలు అందుబాటులోకి వచ్చాయి. ఈ పరికరాల వలన శ్రమ తగ్గుతుంది. సమయం వృధా కాదు. ఖర్చు తగ్గుతుంది. కొన్ని పనిముట్లు సాధారణ రైతుకు అందుబాటులో వున్న ధరల్లో కూడా లభ్యమవుతున్నాయి. ఉదాహరణకు 'శ్రీ' వరి సాగులో కలుపు తీసే పరికరాలు, మార్కరు వంటి తక్కువ ధరకు దొరుకుతున్నాయి. ఇటీవలి కాలంలో వ్యవసాయ పరికరాలను రైతులు వాడటంలో అలవాటు పడ్డారు. ఆసక్తి కనపరుస్తున్నారు. ఈ సీజన్‌లో రైతులకు అవసరమయ్యే కొన్ని పరికరాల గురించి తెలుసుకుందాం.

**దమ్మునాగలి :**

ఈ నాగలిని అన్ని రకాల నేలల్లోను ఉపయోగించవచ్చు. తేలిక నేలల్లో చిన్న గిత్తలు కూడా దీనిని లాగగలవు. 75 సెం.మీ. వెడల్పుగల ఈ దమ్ము నాగలితో రోజుకు సుమారు రెండు ఎకరాలను ఒకసారి దమ్ముచేయవచ్చు. ఈ నాగలి మట్టి గడ్డలను పగుల గొట్టటమేగాక నీరు భూమిలోపలికి ఇంకిపోవటాన్ని తగ్గించి సేద్యపు నీటి వాడకాన్ని పొదుపు చేస్తుంది. ఈ దమ్ము నాగలిని ఉపయోగించేప్పుడు భూమి పైన కనీసం 6 సెం.మీ. నీరు ఉండాలి. దీనిని దిగుబాటు నేలలో ఉపయోగించేటపుడుగాని చిన్న గిత్తలతో దమ్ము చేసేటపుడు గాని సీటుపై మనిషి కూర్చోరాదు. గడ్డి, కలుపు మొక్కలు ఎక్కువగా పెరిగిన నేలలో ఉపయోగించాలంటే ముందుగా ఒకసారి పొలాన్ని ఇనుప నాగలితో దున్నాలి. ఈ దమ్ము నాగలిని ఉపయోగించటం వలన దమ్ము చేయటానికయ్యే ఖర్చు తగ్గుటయేకాక పని తొందరగా పూర్తి అవుతుంది. దమ్ము నాణ్యత కూడా బాగుంటుంది. ఈ నాగలిని ఉపయోగించేటపుడు దిగుబాటు భూముల్లో బ్లేడ్లను అప్పుడప్పుడు శుభ్రం చేసుకోవాలి. ధర రూ. 1540.

**ఎరువు, విత్తనం ఒకేసారి వేసే పరికరం (ఎద్దులతో నడిచేది) :**

దీని సహాయంతో పలు పంటలను ఎరువుతో సహా విత్తుకోవచ్చు. జొన్న, మొక్కజొన్న, వేరుశనగ మరియు ఆముదం లాంటి విత్తనాన్ని తేలికగా విత్తుకోవచ్చు. వేరు వేరు పంటలను విత్తటానికి ఆయా పంటలకు సంబంధించిన రోలర్లను మార్చుకోవాలి. పంటలను బట్టి సాళ్ళ మధ్య దూరాన్ని మార్చుకొనే ఏర్పాటు ఉంది. ఒకేసారి 3 సాళ్ళ వరకు విత్తనం, ఎరువు వేసుకోవచ్చు. సాళ్ళ మధ్య దూరం 30 సెం.మీ. ల నుండి 90 సెం.మీ. ల వరకు మార్చుకోవచ్చు. దీని సహాయంతో రోజుకు రెండున్నర ఎకరాల్లో విత్తనం మరియు ఎరువు ఒకేసారి వేసుకోవచ్చు. ఈ పరికరాన్నుపయోగించటానికి ముందు భూమిని బాగా దున్ని తయారు చేయాలి. ఈ పరికరాన్ని ఒక జత ఎద్దులు సులువుగా లాగుతాయి. పవరు టిల్లరుకు కూడా తగిలించి విత్తుకోవచ్చు. గింజలు ఎరువు సక్రమంగా పడుచున్నది లేనిది అప్పుడప్పుడు చూసి సరిచేసుకోవాలి. ధర రూ. 6000/-



ఎరువు, విత్తనం ఒకేసారి వేయు యంత్రం

**ఎరువు, విత్తనం ఒకేసారి వేసే పరికరం (ట్రాక్టరుతో నడిచేది) :**

దీని సహాయంతో పలు పంటలను ఎరువుతో సహా విత్తుకోవచ్చు. జొన్న మొక్కజొన్న, వేరుశనగ మరియు ఆముదం లాంటి విత్తనాన్ని తేలికగా విత్తుకోవచ్చు. వేరు వేరు పంటలను విత్తటానికి ఆయా పంటలకు సంబంధించిన రోలర్లను మార్చుకోవాలి. పంటలను బట్టి సాళ్ళ మధ్య దూరాన్ని మార్చుకోవచ్చు. ఒకేసారి 9 సాళ్ళ వరకు విత్తనం మరియు ఎరువు వేసుకోవచ్చు. ఈ పరికరాన్ని ట్రాక్టరు కల్టివేటరుకు బిగించి 35 హెచ్.పి. ట్రాక్టరుతో నడపాలి. ఈ పరికరంతో రోజుకు ఏడున్నర ఎకరాల వరకు విత్తనం మరియు ఎరువు వేసుకోవచ్చు. విత్తేటప్పుడు గింజలు,ఎరువు సక్రమంగా పడుతున్నది లేనిది చూసి సరిచేసుకోవాలి. ధర రు. 25000/-

**మాగాణి భూమి చదును చేసే యంత్రం (ట్రాక్టరుతో) :**

ఇది ట్రాక్టరు సహాయంతో నడుస్తుంది. ఇది ట్రాక్టరు వెడల్పును మరియు కేజ్ వీల్స్ వెడల్పును కవరు చేస్తుంది. లెవలింగ్ బ్లేడు ఎత్తును మరియు బ్లేడు యొక్క వాలును $0^0$ నుండి $90^0$ వరకు ట్రాక్టరు హైడ్రాలిక్ లివరు సహాయంతో మార్చుకొనవచ్చు. ఈ యంత్రం సహాయంతో మాగాణి భూమిని తక్కువ సమయంలో చక్కగా చదును చేసుకొనవచ్చు. రోజుకు సుమారు 2 హెక్టార్ల పొలం చదును చేసుకొనవచ్చు. దీనిని బాగా దమ్ము చేసిన తరువాతనే ఉపయోగించాలి. దీనిని ఉపయోగించేటపుడు పొలంలో పలుచగా నీరు ఉంచాలి. గట్ల దగ్గర మరియు మలుపుల వద్ద మనుషుల సహాయంతో చదును చేసుకోవాలి. ధర రు. 18,700/-

**కోనో వీడరు :**

ఈ పరికరం ఐ.ఆర్.ఆర్. వారిచే రూపొందించబడింది. సాళ్ళలో నాటిన మరియు 'శ్రీ' పద్ధతిలో సాగు చేసిన వరిపొలంలో కలువు తీయుటకు సమర్ధవంతంగా పని చేస్తుంది. ఈ పరికరం పనిచేసేందుకు తగు మోతాదులో నీరు ఉండాలి. లేని ఎడల వీడరుకు మట్టి చుట్టుకొని



కోనోవీడర్

సరిగాపని చేయదు. దీనితో రోజుకు అర ఎకరంలో కలుపు తీసుకోవచ్చు. ఖరీదు రూ. 900/-

మార్కరు : ఈ పరికరంతో 'శ్రీ' పద్ధతిలో వరి నాటేందుకు కావలసిన గుర్తులను (గీతలను) పొలంలో గీసుకోవచ్చు. ఎటు చూసిన 25.0 సెం.మీ. దూరంలో గుర్తులు ఏర్పడతాయి. దీని పొడవు 2.0 మీ. ఒకేసారి 8 సాళ్ళలో గుర్తులు చేసుకోవచ్చు. ఈ పరికరంతో రోజుకు నాలుగు ఎకరాల్లో గుర్తులు చేసుకోవచ్చు. ఖరీదు రూ. 1000/-

రోటావేటరు : ఈ పరికరం మెట్టనేలల్లో మెట్ట దుక్కికి మరియు మాగాణి భూముల్లో దమ్ము చేసేందుకు మిక్కిలి ఉపయోగపడుతుంది. ప్రత్యేకంగా మెట్ట నేలల్లో గడ్డలు లేకుండా మెత్తటి దుక్కి చేయాలి. ఇది 350 లేదా అంతకు ఎక్కువ హెచ్.పి. ట్రాక్టరుతో పని చేస్తుంది. దీనికి అమర్చిన రోటావేటరులో 5 వరుసల్లో బ్లేడులు ఉంటాయి. ఈ రోటావేటరు, ట్రాక్టరు పి.టి.ఓ. ద్వారా పని చేస్తుంది. రోజుకు 6-7 ఎకరాల్లో దుక్కిగాని దమ్ముగాని చేసుకోవచ్చు. ఖరీదు రూ. 71000/-

పొలం దమ్ము చేసేందుకు దేశావాళి పద్ధతి బదులు ఎ.ఎన్.జి.ఆర్.ఎ.యే. దమ్ము నాగలి ఉపయోగిస్తే దమ్ము చేయటానికయ్యే ఖర్చులో 50 శాతం తగ్గుతుంది. అదే విధంగా మెట్ట పొలం దుక్కి చేయటంలో దేశవాళి పద్ధతికంటె ఇనుప నాగలి వాడిన యెడల 30 శాతం ఖర్చు తగ్గుతుంది. దుక్కి నాణ్యత బాగుంటుంది. మెట్ట పైరులు విత్తడంలో ఎ.ఎన్.జి.ఆర్.ఎ.యు. మెకానికల్ గొర్రు వాడితే 80 శాతం ఖర్చు తగ్గుతుంది. పని గంటల శాతం 80 వరకు తగ్గుతుంది. ఎరువు, గింజ ప్రక్కన పడటం వలన దిగుబడి పెరుగుతుంది. అంతర కృషికి 3 సాళ్ళ దంతి వాడితే ఖర్చు బాగా తగ్గుతుంది. అదే విధంగా పురుగు మందులు చల్లేందుకు ఎ.ఎన్.జి.ఆర్.ఎ.యు. బూమ్‌స్ప్రేయర్ వాడటంవలన ఖర్చు 40 శాతం తగ్గుతుంది. పని గంటల్లో 85 శాతం తగ్గుతుంది. మందు సరిగా పిచికారి చేయబడి పురుగు సమగ్రవంతంగా నివారణ అవుతుంది. కోత కోసి, నూర్పిడి చేసేందుకు వరికోత యంత్రం, వరి నూర్పిడి యంత్రం ఉపయోగిస్తే 50 శాతం ఖర్చు తగ్గించవచ్చు. అదేవిధంగా కంబైను ఉపయోగించిన యెడల ధాన్యం యొక్క నాణ్యత బాగుండి ధాన్యం దిగుబడిలో నష్టం ఉండదు.

**వ్యవసాయ యంత్ర పరికరాలు (లభించు) తయారు చేసే సంస్థల చిరునామాలు :**

1. మేనేజరు (ఇంప్లిమెంట్స్), ఎ.పి.అగ్రో ఇండస్ట్రీస్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్, అగ్రోభవన్, 10-2-3, ఎ.సి. గార్డ్స్, హైదరాబాద్-500004, ఫోన్ నెం. 23314246,23391331
2. విశ్వకర్మ ఇండస్ట్రీస్, ప్లాట్ నెం. 5, రోడ్ నెం. 6, ఇండస్ట్రియల్ ఎస్టేట్, కాటేదాన్, హైదరాబాద్-500 077. ఫోన్ నెం. 24361482
3. విశ్వకర్మ ఇంజనీరింగ్ కంపెనీ, ప్లాట్ నెం. 138, రోడ్ నెం. 26, ఇండస్ట్రియల్ ఎస్టేట్, కాటేదాన్, హైదరాబాద్-500 077, ఫోన్ నెం. 24361719
4. అరుణా ఇండస్ట్రీస్, 118-బి, ఇండస్ట్రియల్ ఎస్టేట్, కాటేదాన్, హైదరాబాద్ - 500 077, ఫోన్ నెం. 24362338,24360486
5. కర్షక్ ఇండస్ట్రీస్, 18-3014, ఛత్రినాక, లాల్‌దర్వాజ, హైదరాబాద్ - 500 253, ఫోన్ నెం. 24384680, 24382841
6. కర్షక్ అండ్ సన్స్, షాప్ నెం. 42, ఆల్ కరింట్రెడ్ సెంటరు, యం.జి. రోడ్డు, సికింద్రాబాద్- 3, ఫోన్. నెం. 27542315
7. మెకిన్స్ అగ్రో ప్రోడక్ట్స్ ప్రైవేట్ లిమిటెడ్, ప్లాట్ నెం. 30, ఐ.డి.ఎ. గాంధీనగర్, బాలానగర్, హైదరాబాద్ - 500 037, ఫోన్ నెం. 23085359
8. ఇన్‌కాన్ ఇంజనీర్స్ లిమిటెడ్, బి. 6/3, ఐ.డి.ఎ., ఉప్పల్, హైదరాబాద్-500 039, ఫోన్. నం. 27201271,27204034
9. బోయిస్ టౌన్, జహనుమ, హైదరాబాద్, ఫోన్.నెం. 24464511
10. రైట్ సెట్ ఇండస్ట్రీస్, గుడివాడ, క్రిష్ణా జిల్లా, ఫోన్. నెం. 0864-2439976
11. మోడరన్ ఆర్క్ వెల్డింగ్ వర్క్సు, 16-256-7/1, యన్.యన్.పురం, గుడివాడ, కృష్ణా జిల్లా ఫోన్. 08674-246505
12. రవి ఇంజనీరింగ్ వర్క్స్, ఆర్.ఎస్. రోడ్డు, నంద్యాల, కర్నూలు జిల్లా, ఫోన్ నెం. 08514-244169
13. భాస్కర్ ఇంజనీరింగ్ వర్క్స్, ఆర్.ఎస్.రోడ్డు, నంద్యాల, కర్నూలు జిల్లా, ఫోన్ నెం. 08514-244169
14. కుమార్ ఇంజనీరింగ్ వర్క్స్, బనగానపల్లి రోడ్డు, కోయిలకుంట్ల, కర్నూలు జిల్లా
15. మహబూబ్ ఇంజనీరింగ్ వర్క్సు, యన్.హెచ్-6, నంద్యాల రోడ్డు, తాడిపత్రి, కర్నూలు జిల్లా
16. రసూల్ ఇంజనీరింగ్ వర్క్సు, గుంటకల్, అనంతపురం జిల్లా
17. ఇందిరా ఇంజనీరింగ్ వర్క్సు, తపోవనం బైపాస్ రోడ్డు, అనంతపురం, ఫోన్ నెం. 9440-221252
18. బాలాజీ ఇంజనీరింగ్ వర్క్సు, ఆర్టిసి బస్సు స్టాండ్ దగ్గర, అనంతపురం
19. జిలానీ ఇండస్ట్రీస్, ఆత్మకూర్, అనంతపురం జిల్లా ఫోన్.నెం. 250080
20. శ్రీనివాస ఇంజనీరింగ్ వర్క్సు, బళ్ళారి రోడ్డు, కర్నూలు, ఫోన్ నెం. 259472
21. యస్‌డీయోర్ ఎంటర్ ప్రైజస్, 9/21, పి.ఎన్. రోడ్డు, చంద్రగిరి-511 001, ఫోన్.నెం. 0877-3120970
22. జ్యోతి ఇండస్ట్రీస్, పలమనేరు రోడ్డు, చిత్తూరు, ఫోన్ నెం. 9849466729
23. నవ్య అగ్రో ఇండస్ట్రీస్, 1-3/12, పామర్రు రోడ్డు, రైల్వేగేట్ దగ్గర, గుడివాడ-521301, కృష్ణా జిల్లా ఫోన్ నెం. 08674-244597

**మరిన్ని వివరాలకు :**

" సీనియర్ సైంటిస్ట్ (అగ్రి ఇంజనీరింగ్), వ్యవసాయ పరికరాలు మరియు యంత్రాల విభాగం. ఆచార్య ఎన్.జి. రంగా వ్యవసాయ విశ్వవిద్యాలయం, రాజేంద్రనగర్, హైదరాబాద్-500 030" ఫోన్ నెం. 040-240182277 ☆

# మనీషా అగ్రి బయోటెక్ వారు రైతాంగానికి అందిస్తున్న

# క్రొత్త తరం సంకర విత్తనములు



**ప్రత్తి**
భరణి
హీరా



**మొక్కజొన్న**
మనీషా-9090
మనీషా-8181
మనీషా-7272
మనీషా-6363



**సజ్జ**
మనీషా - 31
మనీషా - 41



**ప్రొద్దు తిరుగుడు**
జయ, ఆషా
ఉషా, కిరణ్



**వరి**
సూరజ్, చాందిని
పృథ్వి, తార
సింధూర్, సురభి



**జొన్న**
మనీషా-96
మనీషా-1001
(S.S.G)

మనీషా అగ్రి బయోటెక్

## మనీషా అగ్రి బయోటెక్ ప్రైవేట్ లిమిటెడ్

హైదరాబాద్ ... 029

# వివిధ రకాల పంటలనాశిస్తున్న శనగపచ్చ పురుగు-సమగ్ర సస్యరక్షణ

పి.యం.పార్ధసారధి, నెల్లూరు జిల్లా

శనగ పచ్చ పురుగు యొక్క శాస్త్రీయ నామం హెలికోవెర్పా ఆర్మిజెరా. ఇది వివిధ రకాల పంటలను ఆశించి అధిక నష్టాలను కలుగజేయుచున్నది.

**ఉధృతికి కారణాలు :**

❖ ఈ పురుగు వివిధ రకాల కలుపు మొక్కలు, వివిధ పంటలను ఆశించే గుణం కలిగి ఉండటం. ❖ విచక్షణా రహితంగా పురుగు మందులను వాడటం

❖ సరైన సమయలో తగు సస్యరక్షణ చర్యలు చేపట్టకపోవడం ❖ ఈ పురుగు లార్వా శరీర భాగంపై సన్నది, చిన్న దోమాలు కప్పబడి పిచికారి చేసిన పురుగు మందులు లోనికి వెళ్ళక పురుగు మందుల ప్రభావం నుంచి తప్పించుకుంటుంది. కెనబాలిజం (స్వజాతిని చంపుకోవడం) అనే లక్షణాన్ని కలిగి ఉండటంవలన ఆహారపు కొరత ఉన్న సమయంలో ప్రతికూల పరిస్థితులలో జాతి మొత్తం అంతరించి పోకుండా బలంగా దృఢంగా ఉండే పెద్ద లార్వాలు బలహీనంగా చిన్నవిగా ఉండే లార్వాలను తిని వేస్తాయి. ఈ లక్షణం జాతి మనుగడకు క్లిష్ట పరిస్థితులలో సైతం ఉపయోగ పడుతున్నది. ❖ రెక్కల పురుగులు ప్రతికూల వాతావరణ పరిస్థితులలో 50-100 కి.మీ. వరకు వలస వెళ్ళి వేరే ప్రాంతాలలో మనుగడ సాధించగలుగుతాయి.

❖ తల్లి రెక్కల పురుగులు గ్రుడ్లను ఒక్కొక్కటిగా మొక్కపై పెట్టడం సంవత్సరంలో 4-8 తరాలను పూర్తి చేసుకోవడం.

**జీవిత చరిత్ర**

❖ తల్లి రెక్కల పురుగులు ముదురు గోధుమ రంగు రెక్కలను కలిగి ఉంటుంది. ఆడ రెక్కల పురుగు మగ రెక్కల పురుగు కంటే సుమారు 15-20 మి.మీ. పొడవు ఉంటుంది. ఈ ఆడ రెక్కల పురుగు దాదాపు 500 గుడ్లు ఒక్కొక్కటిగా విడి విడిగా పెడుతుంది. ❖ గ్రుడ్లు మొదట తెల్లగా ఉండి తర్వాత గోధుమ రంగులోకి మారుతాయి. ఈ గ్రుడ్లు 3 నుంచి 5 రోజుల లోపు పగిలి పిల్ల గొంగళి పురుగులు బయటకు వస్తాయి. ఈ గొంగళి పురుగుల దశ దాదాపు 10 నుంచి 20 రోజుల వరకు ఉంటుంది. ఈ దశలో పంటను ఆశించి విపరీతంగా నష్టం కలుగజేస్తుంది. ❖ పిల్ల గొంగళి పురుగులు గ్రుడ్డు నుండి బయటకు వచ్చిన తరువాత పెరుగుతూ 5 సార్లు కుబుసం విడుస్తాయి. ఆ తర్వాత కోశస్థ దశకు చేరి భూమిలో ఈ దశను సుమారు 10 నుంచి 20 రోజుల వరకు గడిపి తర్వాత రెక్కల పురుగులు మళ్ళీ బయటకు వస్తాయి. ❖ జీవిత చక్రం పూర్తి కావడానికి సుమారు 4 నుంచి 6 వారాల పాటు పడుతుంది. ఈ పురుగు సంవత్సరం మొత్తం కన్పిస్తూ ఏడాదిలో 5 నుంచి 8 తరాలను పూర్తి చేసుకొంటుంది.

**పంటపై పురుగు ప్రభావం :**

❖ శనగపచ్చ పురుగు లార్వా దశలో (గొంగళి పురుగు) 60 రకాల కలుపు మొక్కలు, సుమారు 100 రకాల పంటలపై ఆశించి నష్టపరుస్తుంది. ❖ ప్రత్తిలో మొదట ఆకులను, పూత దశలో పూమొగ్గలను, కాయదశలో కాయలకు రంధ్రాలు చేసి తిని నష్టం చేస్తుంది. ❖ మిరప, టమాటో, కంది పంటలలో కాయ తొలుచుపురుగుగా కాయలకు రంధ్రాలను వేసి నష్ట పరుస్తుండడం మనం గమనించవచ్చు. ❖ ఈ పురుగు కాయలకు రంధ్రాలను చేసి తినునప్పుడు తలభాగం కాయలలోకి మిగిలిన శరీర భాగం కాయ వెలుపల ఉండడం కూడా గమనించవచ్చు. ❖ వేరుశనగలో ఆకులను, ప్రొద్దు తిరుగుడులో మొగ్గలను గింజలను తిని నష్టం చేస్తుంది. ❖ లార్వాదశలో ఈ పురుగు వివిధ పంటలలో వివిధ భాగాలను ఆశించి నష్టపరచి మొక్క పెరుగుదలను క్షీణింప చేయడం, పంట దిగుబడిని, నాణ్యతను తగ్గించి తీవ్ర నష్టం కలుగజేస్తుంది.

**సమగ్ర సస్యరక్షణ పద్ధతులు :**

❖ వేసవిలో లోతు దుక్కులు చేయడం వలన భూమిలో ఉండే పురుగు కోశస్థదశలను నిర్మూలించవచ్చు. ❖ పంట మార్పిడి విధానంను అవలంభించాలి. ❖ పంట కాలం పొడిగించకుండా పంట అయిపోగానే పంటను నాశనం చేయాలి. ❖ సిఫారసు చేసిన మేరకు మాత్రమే ఎరువులను వాడాలి. ❖ ఫిరమోన్ ఎరలను (లింగాకర్షణ బుట్టలు) ఎకరానికి 4-5 చొప్పున అమర్చి పురుగుల ఉనికినీ, ఉధృతిని అంచనా వేయాలి. ఈ లింగాకర్షణ ఎరలలో మగ రెక్కల పురుగులు మాత్రమే పడుతాయి. ❖ పక్షి స్థావరాలను ('టి' ఆకారపు పంగల కర్రలను) ఎకరానికి 15-20 చొప్పున ఏర్పాటు చేసుకోవాలి. ఈ కర్రలపై పక్షులు వాలి పొలంలో ఉన్న లద్దె పురుగులను గమనించి తినివేస్తాయి. ముఖ్యంగా మూడు, నాలుగో దశల్లో ఉన్న గొంగళి పురుగులను ఈ పద్ధతి ద్వారా సమర్థవంతంగా నివారించవచ్చు.

❖ ఎన్.పి. వైరస్ ద్రావణాన్ని ఎకరానికి 200 చొప్పున అరకిలో బెల్లం, 100 మి.లీ. శాండో విట్, 50 గ్రా. రాబిన్ భ్లూ కలిపి అవసరాన్ని బట్టి సాయంత్రం వేళల్లో పిచికారి చేసుకొని తొలి, రెండవ దశ లార్వాలను సమర్థవంతంగా నివారించవచ్చు. ❖ బాసిల్లస్ తురింజన్ సిస్ (బి.టి.) మందును ఎకరాకు 400 గ్రా. లేదా 400 మి.లీ. చొప్పున వాడితే తొలి దశ గొంగళి పురుగులు నివారించబడుతాయి.

❖ ప్రధాన పంటలలో అంతర పంటగా అలసంద బొబ్బర్లు, పెసర, సోయాచిక్కుడు లేదా వేరుశనగ పంటలు వేసుకోవాలి. అలా చేయడం వలన మిత్ర పురుగుల సంతతి అభివృద్ధి చెంది శనగ పచ్చ పురుగు నివారణకు దోహద పడుతాయి. ❖ ట్రైకోగ్రామా గ్రుడ్లను ఎకరానికి 60,000 చొప్పున లేక క్రైసోపా లార్వాలను ఎకరాకు 10,000 చొప్పున అవసరాన్ని బట్టి 3-4 సార్లు పంటలో విడుదల చేయాలి. మిత్ర పురుగులను వదలిన తర్వాత 7-10 రోజుల వరకు ఎలాంటి మందులను వాడరాదు. ❖ 5 శాతం వేప గింజల కషాయంలేక 0.5 శాతం వేప నూనె నేరుగా గానీ లేదా మనం వాడే పురుగు మందులతో కలిపి పిచికారీ చేసుకోవాలి. వీటి వాడకం వలన పంటలో తల్లి పురుగు గ్రుడ్లు తక్కువగా పెట్టడమే కాకుండా లార్వాలు కూడా పంటను ఎక్కువగా తినకపోవడం వలన నష్టం తక్కువగా ఉంటుంది. ❖ మూడవ దశ దాటిన లార్వాలను చేతితో ఏరి నాశనం చేయాలి.

❖ ఒకటి, రెండో దశ లార్వాలను ఎండోసల్ఫాన్ 2 మి.లీ. లేదా క్వినాల్‌ఫాస్ 2.5 మి.లీ. లేదా క్లోరిపైరిఫాస్ 2.5 మి.లీ. లేదా ఎసిఫేట్ 1.5 గ్రా. లేదా ట్రైజోఫాస్ 2 మి.లీ. లేదా ప్రొఫినోఫాస్ 2 మి.లీ. మొదలైన మందులలో ఏదైనా ఒక మందును ఒక లీటరు నీటిలో కలిపి పిచికారి చేసి నివారించవచ్చు. ❖ పురుగు మందులను పిచికారి చేసిన తరువాత రెండు రోజులకు చనిపోకుండా మిగిలిన లార్వాలను చేతితో ఏరి నాశనం చేయాలి. దీని వలన తరువాత తరాలకు ఈ పురుగు మందులకు తట్టుకొనే శక్తిని వ్యాప్తి చేయకుండా నివారించవచ్చు. ☆

# "లిఫ్టు" రైతులపై ప్రభుత్వ శీతకన్ను


నంద్యాల నర్సిహారెడ్డి, అధ్యక్షులు
నల్గొండ జిల్లా రైతు సంఘం

నాగార్జునసాగర్ ప్రాజెక్టు నివేదిక 1954లో తయారుచేయబడింది. ఎడమకాల్వపై నల్గొండ జిల్లాకు తగినంత ఆయకట్టు రావడం లేనందున, అప్పటి ఉమ్మడి మద్రాసు రాష్ట్రం, హైద్రాబాద్ రాష్ట్రం వారు సాగర్ ఎడమ కాల్వ 72వ మైలు వరకు 50 ఫీట్ల ఎత్తులో లక్ష ఎకరాలకు సేద్యపు నీరు ఇవ్వాలని ప్రతిపాదించారు. లిఫ్ట్‌లకు అవసరమైన విద్యుత్‌ను, ప్రాజెక్టు వద్ద తయారైన విద్యుత్‌ను వాడుకోవాలని నిర్ణయించారు.

ఈ నిర్ణయం ప్రకారం 70 గ్రామాలకు చెందిన 10 వేల మంది రైతులు సహకార సంఘాలుగా ఏర్పడి 19 లిఫ్ట్‌లను 36,462 ఎకరాలకు ఏర్పాటు చేసుకున్నారు. దీనికి అవసరమైన డబ్బులను బ్యాంకుల ద్వారా రుణం తీసుకున్నారు. మిగిలిన 63,537 ఎకరాల భూమికి సేద్యం నీరు అందించుటకు గాను, రాష్ట్ర ప్రభుత్వం మరో 22 లిఫ్టుల క్రింద 40,614 ఎకరాలకు ఏర్పాటు చేసి ఐడిసి వారే నిర్వహణ చేసి, లిఫ్ట్ రైతుల వద్ద నీటి తీరువా మాత్రమే వసూలు చేసేవారు.

సహకార రంగంలో ఏర్పాటు చేసిన లిఫ్ట్‌లను సమర్ధవంతంగా నడపలేక పూర్తిస్థాయిలో సేద్యం కాలేదు. దీనితో లిఫ్ట్‌లను మేము నిర్వహించలేమని, బ్యాంకు రుణాలు చెల్లించలేని స్థితిలో వున్నామని రైతులు ప్రభుత్వానికి విన్నవించుకున్నారు. అప్పటి సిపియం శాసనసభ్యులు రాఘవరెడ్డి చొరవతో ప్రభుత్వం దృష్టికి తీసుకొచ్చి, ఒత్తిడి తీసుకురాగా, ప్రభుత్వం ఇ.వి.రాంరెడ్డి,ఐఎఎస్ అధ్యక్షతన హైపవర్ కమిటీ ఏర్పాటు చేసారు. వారు మొత్తం లిఫ్ట్‌ల పరిస్థితిని అధ్యయనం చేసి లిఫ్ట్‌లను రైతులు నిర్వహించలేరని, బ్యాంకు రుణాలు చెల్లించలేరని, ప్రభుత్వమే లిఫ్టులను నిర్వహించి, బ్యాంకుల అప్పులు చెల్లించాలని రిపోర్టు ఇచ్చారు. 1982లో అప్పటి ముఖ్యమంత్రి భవనం వెంకట్రాం రెడ్డిగారు లిఫ్ట్‌లను ప్రభుత్వమే నిర్వహిస్తుందని, బ్యాంకు అప్పులు ప్రభుత్వమే చెల్లిస్తుందని, ప్రకటించారు. లిఫ్ట్‌ల క్రింద సేద్యము అయ్యే భూమిని ప్రాజెక్టులో అంతర్భాగంగా గుర్తిస్తామని ప్రకటించారు. బ్యాంకు రుణాలు ప్రభుత్వం చెల్లించింది. లిఫ్ట్‌లను ఐడిసికి అప్పగించింది. అప్పటి నుండి 42 లిఫ్ట్‌లు ఐడిసి వారే నిర్వహిస్తూ కేవలం నీటితీరువా రైతుల వద్ద నుండి వసూలు చేసేవారు. నీరురాక లిఫ్ట్‌ల క్రింద సేద్యభూమి క్రమేణా తగ్గుతూ వచ్చింది.

1996లో చంద్రబాబు గారు లిఫ్ట్‌లను ప్రభుత్వం నిర్వహించదని, కేవలం రిపేర్లకు డబ్బులు ఇస్తాం, వాటిని రైతులే నిర్వహించుకోవాలని ప్రతిపాదించారు. దానికి సిపియం శాసనసభ్యులు వ్యతిరేకించినా ప్రభుత్వం బలవంతంగా లిఫ్ట్‌లను రైతులకు అప్పగించి చేతులు దులుపుకుంది. దీంతో లిఫ్ట్ రైతుల కష్టాలు అధికమైనాయి. అప్పటివరకు లిఫ్ట్‌లకు 18 గంటల కరెంట్ రాగా ప్రభుత్వం వ్యవసాయానికి 9 గంటల ప్రకటనతో లిఫ్ట్‌లు నడవక, అనేక ఇబ్బందులు ఏర్పడి సేద్యభూమి 30 శాతానికే పరిమితమైంది. 9 గంటలను 7 గంటల కరెంట్ సరఫరాతో మరింత సేద్యభూమి తగ్గి లిఫ్ట్‌ల క్రింద వున్న రైతుల భూములు బీడు భూములుగా మారే పరిస్థితి వచ్చింది.

2002లో రైతుసంఘం రైతులను సమీకరించి లిఫ్ట్‌లను ప్రభుత్వమే నిర్వహించాలని పోరాటం జరిపింది. అప్పటికే కుడి కాల్వ క్రింద వున్న 91 లిఫ్ట్‌లను ప్రభుత్వమే నిర్వహిస్తూ, రైతుల వద్ద నుండి నీటితీరువా మాత్రమే వసూలు చేస్తున్నందున, ఎడమ కాల్వకు దానిని వర్తింపచేయాలని ఆందోళన చేసిన ఫలితంగా ప్రభుత్వం దిగివచ్చి, రైతుసంఘం, శాసనసభ్యులు, లిఫ్ట్ ఛైర్మన్‌లతో సమావేశం జరిపి లిఫ్ట్‌లను ఎన్ ఎస్ పి అధికారులకు అప్పగించి నడిపిస్తామని, లిఫ్ట్ సేద్యం భూమిని కూడా ప్రాజెక్టులో అంతర్భాగంగా గుర్తిస్తామని అప్పటివరకు లిఫ్ట్ రైతుల వద్ద వసూలు చేస్తున్న ఎకరా రు. 300 నీటితీరువాను తగ్గించి ప్రాజెక్టు క్రింద వసూలు చేస్తున్న విధంగా రు.200 నీటితీరువాను నిర్ణయించారు. ఎన్ ఎస్ పి వారికి లిఫ్ట్ మరమ్మత్తులు చేపట్టాలని ఆదేశాలు ఇచ్చినా పూర్తి స్థాయిలో స్వాధీనం చేసుకోలేదు. దీనితో రైతులు ఆందోళనగా ఎన్ ఎస్ పి అధికారుల చుట్టూ, ప్రభుత్వం చుట్టూ అనేక రాయబారాలు చేసినా ఎన్ఎస్‌పికి అప్పగించలేదు. ఈ లోగా శాసనసభ ఎన్నికలలో కాంగ్రెస్ వారు మేము అధికారంలోకి వస్తే లిఫ్ట్‌లను స్వాధీనం చేసుకొని ఐడిసి ద్వారా నిర్వహిస్తామని ప్రకటించారు. లిఫ్ట్‌లకు 16 గంటల కరెంట్ ఇస్తామని ప్రకటించారు. కానీ లిఫ్ట్‌లకు ప్రత్యేక ఫీడర్స్ ఏర్పాటు చేసి 16 గంటల కరెంట్ ఇవ్వవలసి వుండగా ఆ ఏర్పాటు లేదు. కేవలం 3,4 లక్షల ఎకరాలకే 15 గంటల కరెంట్ సరఫరా వున్నది.

దీనితో గత సంవత్సరం 7 గంటల కరెంట్, లిఫ్ట్ సామర్థ్యం తగ్గడంతో 76,000 ఎకరాలకు గాను కేవలం 20 వేల ఎకరాలుకూడా సాగలేదు. దీనితో లిఫ్ట్‌రైతులు దివాలా తీసారు. ఈ ముఖ్యమంత్రి కూడా మే నెలలో ఇరిగేషన్ అధికారులు సమావేశం ఏర్పాటుచేసి లిఫ్ట్‌లను రైతులకు అప్పగిస్తామని ప్రకటించారు కాని ఆ ప్రకటన అమలుకు నోచుకోలేదు. దీనితో ఆందోళనగా వున్న రైంతాంగం ఉద్యమ బాటకు సిద్దమై మిర్యాలగూడెంలో లిఫ్ట్ రైతుల సమాఖ్య, రైతు సంఘం ఆధ్వర్యంలో సదస్సు ఏర్పాటు చేసి దానికి ఆందోళన రూపం ఇవ్వడం జరిగింది. 2005 జూన్ 9నుండి 14 వరకు పాదయాత్ర నిర్వహించి లిఫ్ట్‌లను లిఫ్ట్‌రైతులను కలిసి వారి సమస్యలను వింటూ 14న ఎన్. యస్. పి.సి కార్యాలయం ముట్టడికి పిలుపు ఇవ్వడం జరిగింది. జూన్9న మిర్యాలగూడెం శాసన సభ్యులు జూలకంటి రంగారెడ్డి, రైతుసంఘం జిల్లా అధ్యక్షులు నంద్యాల నర్సింహరెడ్డి, రైతుసంఘం మిర్యాలగూడెం కార్యదర్శి వి. వెంకటేశ్వర్లు కోదాడ డివిజన్ రైతునాయకులు కె.వీరభద్రం గారితో పాటు లిఫ్ట్‌ల చైర్మన్‌లతో పాటు రైతులు, నల్గొండ జిల్లా సరిహద్దులోని కాగితపు రామచంద్రాపురం గ్రామంలోని లిఫ్ట్ వద్ద జూన్9న పాదయాత్ర ప్రారంభమై నాగార్జున సాగర్ ఎడమ కాల్వపై నున్న లిఫ్ట్‌లను సందర్శిస్తూ రైతులను కలుపుకోంటూ మండుటెండలను సైతం లెక్కచేయకుండా రోజు 35 కిలోమీటర్లకు పైగా పాదయాత్ర నిర్వహిస్తూ 230 కిలో మీటర్లు ఈనెల 14లోగా సమయం 1గంట వరకు పూర్తిచేస్తూ ఎన్.యస్.పి.సి కార్యాలయం చేరుకోవడం జరిగింది. పాదయాత్ర సందర్భంగా లిఫ్ట్‌లకు సంబందించిన సమస్యలు అధ్యయనం చేయడం జర్గింది. లిఫ్ట్‌లను నిర్మించి 30 సంవత్సరాలు దాటుతున్నందున వాటి సామర్థ్యం తగ్గింది. అన్ని స్కీముల్లోని మోటార్లు, పంపులు, స్టార్టర్స్, మెయిన్స్, రిపేర్లకు వచ్చాయి. సివిల్ వర్కు రిపేర్లు,సెక్షన్ పైపుల రిపేర్లు రస్ట్‌తో రంధ్రాలు

(తరువాయి 32 వ పేజీలో)

# వ్యవసాయంలో ఎరువుల పాత్ర

మొక్కల పెరుగుదలకు కావలసిన పోషక ధాతువులను అందించు పదార్థములనే ఎరువులంటారు. ఈ పోషక ధాతువులు స్వాభావికంగా సేంద్రియ పదార్థాలలో లభిస్తాయి. వాటిని సేంద్రియ ఎరువులు అంటారు. కొన్ని రసాయనిక పదార్థాల ద్వారా మొక్కల పోషక ధాతువులు అందించుతాయి. వాటిని రసాయనిక ఎరువులు అంటారు. వీటిని ఫ్యాక్టరీలలో కృత్రిమంగా రసాయనిక చర్యల ద్వారా తయారుచేస్తారు. ఈ రసాయనిక ఎరువులను ముఖ్యంగా నాలుగు రకాలుగా విభజించవచ్చు.

1. నత్రజని ఎరువులు
2. భాస్వరపు ఎరువులు
3. పొటాష్ ఎరువులు
4. మిశ్రమ / కాంప్లెక్స్ ఎరువులు.

పై ఎరువుల గురించి వివరంగా క్రింద తెలుసుకుందాం.

### నత్రజని ఎరువులు

**యూరియా :** దీనిలో 46 శాతం నత్రజని వుంటుంది. ఇది అన్ని రకాల భూములకు అనువైనది. ఇది పొలంలో వెదజల్లిన 72 గంటల తరువాత నీరు పెట్టవలసి వుంటుంది. లేనిచో దీనిలో వున్న నత్రజనిని మొక్కలు సద్వినియోగం చేసుకోలేవు.

**అమ్మోనియం సల్ఫేట్ :** దీనిలో 20 శాతం నత్రజని వుంది. దీనికి తోడు 23.4 శాతం గంధకం వుంటుంది. ఇది గాలిలో తేమ అతి తక్కువగా గ్రహిస్తుంది. ఈ ఎరువు వాడితే నత్రజని లోపాలు గంధకం కూడా మొక్కలకు లభిస్తుంది.

**కాల్షియం అమ్మోనియం నైట్రేట్ :** దీనిలో 20 శాతం నత్రజని వుంది. కొన్ని బస్తాలలో 26 శాతం కూడా వుండవచ్చు. ఇది రేగడి నేలలో బాగా పనిచేస్తుంది. ఇది గాలిలో తేమను పీల్చుకొనే గుణం కలిగి వున్నందున బస్తా విప్పిన వెంటనే పూర్తి ఎరువును ఒకేసారి వాడాలి. లేనిచో గడ్డ కట్టే ప్రమాదం వుంది.

### ఫాస్ఫరస్ ఎరువులు ( భాస్వరం )

సింగిల్ సూపర్ ఫాస్ఫేట్ : దీనిలో 16 శాతం మొక్కలకు ఉపయోగపడే భాస్వరికామ్లం వుంది. దీనిలో 2/3 వంతు జిప్సం వుంది. ఇది పంటలకు సున్నం, గంధకం అందిస్తుంది. అందుచే వేరుశనగ పంటకు దీనిని వాడవచ్చు. చౌడు నేలలకు కూడా చాలా శ్రేష్ఠం.

**ట్రిపుల్ సూపర్ ఫాస్ఫేట్ :** దీనిలో 40 శాతం ఉపయోగపడే భాస్వరికామ్లం వుంది. దీనిలో జిప్సం వుండదు. ఇది మార్కెట్‌లో కొన్ని ప్రాంతాలలో మాత్రమే దొరుకుతుంది.

### పొటాష్ ఎరువులు

**మ్యూరేట్ ఆఫ్ పొటాష్ :** దీనినే పొటాషియం క్లోరైడ్‌గా వ్యవహరిస్తారు. దీనిలో 60 శాతం పొటాష్ వుంది. ఇది గుళ్లుగా కానీ, పొడిగా గానీ వుంటుంది. దీనిని ప్రత్యేక సూచన చేస్తే తప్ప మిగతా పంటలకు వాడవచ్చు.

**సల్ఫేట్ ఆఫ్ పొటాష్ :** దీనిలో 50 శాతం పొటాష్ మరియు 18 శాతం గంధకం వుంటుంది. దీని ఖరీదు మ్యూరేట్ ఆఫ్ పొటాష్ కన్నా ఎక్కువ. దీనికి పొగాకు, ద్రాక్ష, చెరకు పంటలకు విధిగా వాడుకోవాలి.

### మిశ్రమ/ కాంప్లెక్స్ ఎరువులు

నత్రజని, భాస్వరం, మరియు పొటాష్ గల మిశ్రమ ఎరువులు వివిధ నిష్పత్తులలో ప్రస్తుతం మన దేశంలో తయారవుతున్నవి. వాటిని వాడటం వల్ల ధాతువులు సమానంగా మట్టిలో వెదజల్ల బడతాయి. దుక్కిలో వేయడానికి సమానంగా చాలా అనువుగా వుంటాయి. రవాణా ఖర్చులు కూడా కలిసివస్తాయి. ఒకే బస్తాలో ధాతువులు ఎక్కువ మోతాదులో లభిస్తాయి.

**అమ్మోనియం ఫాస్ఫేట్ :** దీన్ని వేస్తే పంటలకు నత్రజని, మరియు ఫాస్ఫరస్ ఒకేసారి లభిస్తాయి. వీటి శాతం 16.20 లేదా 20.20 లేదా 28:28 పాళ్లలో వివిధ కంపెనీల ద్వారా తయారుచేయబడుతున్నాయి.

**డై అమ్మోనియం ఫాస్ఫేట్ (డిఏపి) :** దీనిలో 18 శాతం నత్రజని, 46 శాతం భాస్వరం వుంది. ఇది ఉదారంగు కలిగి, గుండ్రని సమమైన గుళికల రూపంలో వుంటుంది.

**యూరియా అమ్మోనియం ఫాస్ఫేట్ :** దీనిలో 28 శాతం నత్రజని, 28 శాతం ఫాస్ఫరస్ వుంటుంది. నత్రజని అమ్మోనియం మరియు అమైడ్ రూపాల్లో మొక్కలకు లభిస్తుంది.

**నైట్రో ఫాస్ఫేట్ :** దీనిలో 20 శాతం నత్రజని, 20 శాతం ఫాస్ఫరస్ వుంటుంది. ☆

( 5 వ పేజీ తరువాయి)

కలుపు నియంత్రణకు కలుపు యంత్రం 'వీడర్' తిప్పటానికి ఒకరోజు ముందు నీళ్ళు నిలగట్టి వీడర్ తిప్పేటప్పుడు నీళ్ళు తీసెయ్యాలి.

వరి పైరు పొట్ట దశకు వచ్చినప్పటి నుంచి ఒక అంగుళం మేర నీళ్ళు నిలగట్టాలి. ఇలా గింజ 70 శాతం గట్టిపడే దశ వరకు నీళ్ళు నిలగట్టి ఆ తరువాత నుంచి తీసెయ్యాలి.

**కలుపు యాజమాన్యం :**

శ్రీ పద్ధతిలో నీళ్లు నిలగట్టక పోవడం వల్ల కలుపు ఎక్కువగా ఉంటుంది. ఒక రకంగా చెప్పాలంటే కలుపు వచ్చిరొట్టలా ఉపయోగపడుతుంది. కాబట్టి కలుపును పెరగనిస్తూ నేలలోకి కలుపుతూ ఉండాలి.

కలుపును చేతితో తియ్యటానికి బదులు దానికి నేలలోకి కలిపెయ్యాలి. ఇందుకు 'వీడర్' అనే వరికరాన్ని రూపొందించారు. ప్రతి రెండు వరసల మధ్య ఈ వీడర్‌ని ముందుకి, వెనక్కి తోస్తూ నడపాలి. కలుపు మొక్కలు చిన్నవిగా ఉన్నప్పుడే అంటే నాటు వేసిన 10-12 రోజులకు మొదటిసారి వీడర్ తిప్పాలి. అవసరాన్ని బట్టి వీడర్‌తో కాకుండా మనుషులతో కలుపు తీయించాలి. తొలిసారి కలుపు తీసిన తరువాత అవసరాన్ని బట్టి ప్రతి 10 రోజులకు ఒకసారి వీడర్‌ని తిప్పాలి.

వీడర్ తిప్పటం వల్ల కలుపును అరికట్టడం మొదటి ప్రయోజనం. కలుపును నేలలోనే కలిపెయ్యటంవల్ల నేలకు సేంద్రియ పదార్థం అందుతుంది. అంటే చేనుకి పచ్చిరొట్ట వేసిన ప్రయోజనం అందుతుంది. వీడర్ తిప్పటంవల్ల వేళ్లకు గాలి బాగా తగులుతుంది. ఈ రెండింటి వల్ల నేలలో అనేక రకాల సూక్ష్మ జీవులు దండిగా పెరిగి వరి మొక్కలకు అవసరమైన పోషకాలు అందిస్తాయి.

**పురుగులు, తెగుళ్ళ యాజమాన్యం :**

దూరంగా నాటడం, సేంద్రియ ఎరువులు నాటడం వల్ల వరి మొక్కలు ఆరోగ్యంగా పెరిగి పురుగులు, తెగుళ్ళు, సహజంగానే తక్కువగా ఉంటాయి. అవసరమైనప్పుడు, లేదా ముందుగానే కొన్ని రకాల కషాయాలు వంటివి పిచికారి చేస్తూ వాటిని సులువుగా అదుపు చేయవచ్చు.

**వరికోత :**

చేనువచ్చగా ఉన్నపుడే గింజ తయారువుతుంది. కాబట్టి అదునుకు కోత కోసేలా రైతులు సిద్ధమై ఉండాలి. ☆

# నేల సంపంగి సాగు

యల్. నారం నాయుడు,
కె.యం.యువరాజు, కె. భాస్కర్‌రెడ్డి,
తిరుపతి, చిత్తూరు

తెలుగులో నేల సంపంగిగా పిలువబడే 'లిల్లీ' పూల మొక్క ప్రధానంగా మెక్సికో దేశానికి చెందినది. నేల సంపంగి మరియు సుగంధ రాజం వంటి పేర్లతో పిలువ బడుతున్నది. పశ్చిమబెంగాల్ (మిద్నాపూర్, నదియా ప్రాంతాలు), మహారాష్ట్ర (పూనె), తమిళనాడు (కోయంబత్తూరు) కర్నాటక (టి.నరసిపూర్, దేవనహల్లి) మరియు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాల్లో వాణిజ్యపరంగా సాగు చేస్తున్నారు. మన రాష్ట్రంలో ప్రధానంగా గుంటూరు, చిత్తూరు, తూర్పుగోదావరి, కృష్ణా, మహబూబ్‌నగర్ జిల్లాల్లో సాగులో ఉన్నది.

నేల సంపంగి వివిధ వాతావరణ పరిస్థితులలో పెంచదగ్గ నీటి ఎద్దడిని తట్టుకోగల మొండి మొక్క. మల్లె తోటల మాదిరిగానే ఈ మొక్కలను ఆరు బయట పొలాల్లో పండించవచ్చును. పాలీహౌస్ వంటి ప్రత్యేక సదుపాయాలు అవసరంలేదు. విడిపూలను పూలదండల తయారీలోను, అలంకరణలోను వాడతారు. ముద్ద పూల రకాలను (డబుల్స్) కాడలతో తెంపి, బొకేలు, ఫ్లవర్ వాజ్‌ల తయారీలో కట్ ఫ్లవర్‌గా వాడుకోవచ్చును. పార్కులలో బోర్డర్లు/ ఫ్లవర్ బెడ్‌లుగా పెంచడానికి, పెరటితోటల్లోను పెంచుకోవడానికి పనికి వస్తుంది. పసుపు - ఆకుపచ్చ రంగులు మిళితమైన ఆకులున్న రకాలు కుండల్లో పెంచడానికి చాలా ఆకర్షణీయంగా ఉంటాయి. ఒంటిరెక్క రకాలు మంచి పరిమళంతో కూడినవై, సుగంధ తైలాల తయారీలో ముడి పదార్ధంగా ఉపయోగపడుతున్నాయి.

**రకాలు :**

భారత దేశంలో సాగులోనున్న రకాలు ప్రధానంగా నాలుగు తరగతులకు చెందినవి.

1. సింగిల్ : పూరెక్కలు ఒకే వరుసలో ఉండి, మంచి సువాసనతో ఉంటాయి. పూల దండల తయారీకి, అలంకరణకు అనువైనవి. సుగంధ తైలాల తయారీలో వాడొచ్చు.
2. సెమిడబుల్ : పూరెక్కలు 2-3 వరుసల్లో ఉంటాయి. కట్ ఫ్లవర్‌గా ఉపయోగపడతాయి.
3. డబుల్-పూరేకులు మూడు కంటే ఎక్కువ వరుసల్లో ఉండి, తెల్లటి పూరేకులపైన ఎరుపు-గులాబి వర్ణంలో మెరుపును కలిగి ఉంటాయి. కట్ ఫ్లవర్‌గా మంచి అనూకూల మైన రకాలు
4. వెరిగేటెడ్ : పువ్వులు ఒంటిరేక వరుసలోనే ఉంటాయి. కానీ, రెక్కల పైన గులాబి రంగు పూత ఉంటుంది. ఆకుల అంచుల వెంబడి బంగారు పసుపు ఛాయలో గీతలుండి, చూడడానికి చాల ఆకర్షణీయంగా ఉంటాయి. విడి పూలకు, కట్‌ఫ్లవర్‌గాను కూడా వాడుకోవచ్చు. పెరటితోటల్లో పెంచుకుంటే అదనపు ఆకర్షణగా నిలుస్తాయి.



జాతీయ వృక్ష పరిశోధనా సంస్థ, లక్నోవారు వాణిజ్య పరంగా సాగుకు పనికొచ్చే రకాలను విడుదల చేసారు. రజత్‌రేఖ : ఆకుల మధ్య తెల్లటి చారలుండే సింగిల్ రకం. మొక్కలు అందంగా ఉండి, పూలు మంచి సువాసన కల్గి ఉంటాయి.

**స్వర్ణరేఖ :** ఆకుల అంచులు బంగారు ఛాయలో ఉండే డబుల్ రకం. అధిక దిగుబడినిచ్చే మంచి కట్‌ఫ్లవర్ రకం. భారతీయ ఉద్యాన పరిశోధనా సంస్థ, బెంగుళూరు వారు నాలుగు సంకర రకాలను రూపొందించారు.

**శృంగార్ :** స్థానిక రకాల కంటే 36 శాతం అధిక దిగుబడినిచ్చే సింగిల్ రకం. పూలగుత్తి మధ్యస్థ పొడవుతో, దృఢంగా ఉంటుంది. పువ్వులు గులాబి రంగు పూతతో మంచి సువాసన కల్గి ఉంటాయి. కంకిపైన పువ్వులు ఎక్కువగా ఉండడమే కాకుండా, పూలు కూడా స్థానిక రకాల కంటే పెద్దవిగా ఉంటాయి. విడి పువ్వులు గండలు మరియు సుగంధ తైలాల తయారీకి పనికొస్తాయి. కంకిని బొకేలు, ఫ్లవర్ వాజ్‌లు అమర్చడానికి వాడొచ్చును.

**ప్రజ్వల :** ఇది కూడా సింగిల్ రకమే. అయితే కంకి శృంగార్ రకంతో కంటే పొడవుగా పెరిగి, ఎక్కువ పూలుతో ఉంటుంది. మొగ్గలపైన లేత గులాబీ రంగు పూత ఉంటుంది. కానీ, విచ్చుకున్న పువ్వులు తెల్లగా ఉంటాయి. పువ్వులు పెద్దవిగా ఉండి, శృంగార్ రకం కంటే 20 శాతం అధిక దిగుబడినిస్తుంది.

**సువాసిని :** పువ్వులు పెద్దవిగా స్వచ్ఛమైన తెలుపు రంగులో ఉండే డబుల్ రకం. ఎక్కువ పువ్వులతో కంకి ఆకర్షణీయంగా ఉండి, కట్ ఫ్లవర్‌గా ఉపయోగపడుతుంది. స్థానిక రకాల కంటే 26 శాతం అధిక దిగుబడినిస్తుంది.

**వైభవ్ :** మొగ్గలపైన లేత ఆకుపచ్చ రంగు పూత ఉండి, విచ్చుకున్న పువ్వులు మాత్రం తెల్లగా ఉంటాయి. కంకిపొడవు మధ్యస్థంగా ఉంటుంది. కట్‌ఫ్లవర్‌గా పనికొచ్చే డబుల్ రకం. సువాసిని రకం కంటే 50 శాతం అధిక దిగుబడినిస్తుంది.

కలకత్తా సింగిల్, కలకత్తా డబుల్, కోయంబత్తూరు సింగిల్, బెంగళూరు సింగిల్, పెరల్ డబుల్, రజని గంధ యదువల్ వంటి స్థానిక రకాలు కూడా ఉన్నాయి.

**ప్రవర్ధనము :**

లిల్లీ పూల మొక్కలను దుంపలుతో ప్రవర్ధనం చేస్తారు. పూత అయిన తరువాత

ఆకులు క్రమంగా ఎండిపోయి, దుంపలు నిద్రావస్థలోకి వెళ్తాయి. ఈ దశలో మొక్కలకు నీరుకట్టకూడదు. దుంపల్ని జాగ్రత్తగా త్రవ్వి తీసి, నీడలో ఆరబెట్టాలి. తరువాత వాటిని వేరు చేసి, శుభ్రం చేసి, నీడలో పొడిగానున్న ప్రదేశంలో నిల్వ ఉంచాలి. దుంపలు 4-6 వారాలపాటు నిద్రావస్థలోనే ఉంటాయి. కాబట్టి ఈ లోపుగా వాటిని పొలంలో నాటరాదు. తల్లి దుంపలను, చెడిపోయిన దుంపలను నాటడానికుపయోగించరాదు. 2 సెం.మీ. వ్యాసము కల్గిన, సుమారు 40 గ్రాముల బరువు గల ఆరోగ్యమైన దుంపలను నాటినట్లయితే, పూలకాడ బలంగా పెరిగి, ఎక్కువ పూలు పూస్తాయి. నాటే ముందు దుంపల్ని 0.2 శాతం బ్లైటాక్స్ ద్రావణంలో ముంచి శుద్ధి చేసినట్లయితే తొలి దశల్లో మొక్కలను తెగుళ్ళు ఆశించవు.

**వాతావరణం - నేలలు :**

నేల నంవంగికి నమశీతోష్ణ పరిస్థితులుంటే మంచిది. 20-30$^0$ సెంటీగ్రేడు ఉష్ణోగ్రత సూర్యరశ్మి బాగా తగిలే ప్రాంతాలు దీని సాగుకు మిక్కిలి అనుకూలం. సూర్యరశ్మి చక్కగా తగిలే ప్రాంతాల్లో పూలు అధికంగా పూస్తాయి. అధికమైన నీడవలన మొక్కలు నన్నగా, పీలగ పెరిగి దిగుబడులు తగ్గిపోతాయి. అధిక చలిని, మంచును తట్టుకోదు.

ఉదజని సూచిక 6.5-7.5 ఉండే ఎర్రగరప నేలలు లేదా ఇసుకతో కూడిన తేలిక పాటి గరప నేలలు దీనిసాగుకు మిక్కిలి అనుకూల నేలలు. ఎక్కువ సేంద్రియ పదార్థంతో నీటిని నిల్వ చేసుకోగల సామర్థ్యం కలిగి ఉండాలి. చౌడు నేలలు మరియు ఆమ్ల గుణమున్న నేలల్లో కూడా కొంత వరకు సాగు చేయవచ్చు. అయితే ముంపునకు గురయ్యే మురుగు నీటి నదుపాయంలేని నేలలు దీనిసాగుకు అసలు పనికి రావు.

**పొలం తయారీ :**

ఎంపిక చేసిన నేలను 2-3 సార్లు బాగా దున్ని, రెండు వారాలపాటు గాలి బారనివ్వాలి. తరువాత నేలను చదును చేసి, చిన్న మడులుగా చేసుకోవాలి. కొన్ని ప్రాంతాల్లో బోదెలు చేసి నాటే అలవాటు కూడా ఉంది. అయితే, బోదెలు చేసి నాటే కంటే, మళ్ళలో నాటుకుంటే దిగుబడులు అధికంగా ఉంటాయి.

**నాటే సమయం :**

బెంగుళూరు / తమిళనాడు ప్రాంతాల్లో దీన్ని మే-జూన్ నెలల్లోను, పశ్చిమబెంగాల్‌లో మార్చి - ఏప్రిల్ నెలల్లోను నాటుతారు. మన రాష్ట్రంలో జూలై-ఆగస్టు నెలలు అనుకూలం. అయితే నీటి వసతి బాగున్నచోట ఫిబ్రవరి - మార్చి నెలల్లో నాట్లు వేసినట్లయితే జూలై నుండి అక్టోబరు వరకు పూలు వస్తాయి. వర్షాధారంగా జూలై-ఆగస్టు నెలల్లో నాటుకుంటే నవంబర్ నుండి ఏప్రిల్ వరకు పూలు పూస్తాయి. ఈ విధంగా సంవత్సరం పొడవునా పూలు అందుబాటులో ఉంటాయి.

**నాట్లువేయుట :**

వరుసల మధ్య అడుగు దూరం వరుసల్లో మొక్కల మధ్య 20 సెం.మీ. దూరం ఉండేట్లు (30x20 సెం.మీ.) ఎంపిక చేసిన దుంపలను 5 సెం.మీ. లోతులో నాటుకోవాలి. పెద్ద దుంపలు ఆలస్యంగా మొలకెత్తి, త్వరగా కాపుకొస్తాయి. చిన్న దుంపలు త్వరగా మొలకెత్తి ఆలస్యంగా పూలు పూస్తాయి. సింగిల్ రకాలైతే 2-3 దుంపల్ని లేదా తల్లి దుంపతో నున్న దుంపల్ని యధాతథంగా నాటుకోవచ్చు. అదే డబుల్ రకాలైతే కంతకు రెండు దుంపల్ని నాటాలి. హెక్టారు భూమికి నుమారు 1,67,000 దుంపలు అవనరమవుతాయి. నాటిన తరువాత దుంపల్ని మట్టితో బాగా కప్పాలి.

**ఎరువులు :**

భారతీయ ఉద్యాన పరిశోధనా సంస్థ, బెంగళూరు వారి సిఫారసు మేరకు హెక్టారుకి 200 కిలోల నత్రజని (445 కిలోల యూరియా) భాస్వరము (1250 కిలోల సూపర్ ఫాస్ఫేటు) పొటాష్ (330 కిలోల మ్యూరేట్ ఆఫ్ పొటాష్) ఇచ్చే ఎరువులను వాడాలి.

పశువుల ఎరువుతోపాటు భాస్వరపు ఎరువులను ఆఖరి దుక్కిలో వేసి, బాగా కలియ దున్నాలి. నత్రజని, పొటాష్ ఎరువులను మూడు సమ భాగాలుగా చేసి, నాటినపుడు, నాటిన 30 వ రోజున మరియు 90వ రోజున వేయాలి. నేల సారాన్ని బట్టి, అవసర మనుకున్నప్పుడు ఎరువుల మోతాదును మార్చుకోవచ్చు. కార్శి పంటకు అదనంగా ఎరువుల మోతాదును మార్చుకోవచ్చు. కార్శి పంటకు అదనంగా ఎరువులనందించాల్సి ఉంటుంది. వేప పిండి వంటి సేంద్రియ ఎరువులనుపయోగించడం ద్వారా రసాయనిక ఎరువుల వాడకం తగ్గించడమే కాకుండా, మొక్కలను నులి పురుగుల బారినుండి కాపాడుకోవచ్చును. పైగా పూల నాణ్యత దిగుబడులు కూడా పెరిగే అవకాశం ఉంది.

**నీటితడులు :**

దుంపలు నాటే సమయంలో నేలలో అధికంగా తేమ ఉన్నట్లయితే అవి కుళ్ళిపోయే ప్రమాదముంది. మొలకలు పూర్తిగా వచ్చేంత వరకు నీరు అధికంగా పారించకూడదు. మామూలుగా వేసవిలో 5-6 రోజులకొకసారి చలికాలంలో 10-12 రోజులకొకసారి నీటి తడులు ఇచ్చినట్లయితే నరిపోతుంది. క్రమంతప్పక నీటి తడి ఉంటే పూల దిగుబడి అధికమవుతుంది.

**అంతరకృషి :**

పొలంలో ఎప్పటికప్పుడు కలుపు తీసి, మొక్కల మొదళ్ళలో మట్టిని ఎగదోస్తే మంచిది. ఈ విధంగా చేయడంవలన పూత సమయంలో పొడవుగా పెరిగే కంకికి అదనపు దన్ను ఇచ్చినట్టవుతుంది.

**పూత - కోత :**

నాటిన 70-75 రోజుల్లో మొక్కలు కంకిని వదులుతాయి. 85-90 రోజుల్లో కంకిపై చిన్న పూమొగ్గలు కనిపించి 100-120 రోజుల్లో పూలు విచ్చుకుంటాయి. పూత 6-8 నెలల వయస్సు వరకూ ఉంటుంది. విడి పూలకైతే పూర్తిగా ముదిరిన, విచ్చుకోవడానికి సిద్ధంగా ఉన్న మొగ్గల్ని ఉదయం వేళలో కోసి, మార్కెట్‌కు తరలించాలి. అదే కట్ ఫ్లవర్స్‌కైతే (కంకి కొరకైతే) కంకిపైన మొదటి రెండు మొగ్గలు విచ్చుకుంటున్న దశలో కంకిని పొడవాటి కాడతో నహా కోయాలి.

**ప్యాకింగ్ :**

విడి పూలను వెదురు గంపల్లో నింపి, దగ్గర్లోనున్న మార్కెట్లకు తరలించవచ్చు. అదే కట్ ఫ్లవర్స్‌కైతే, కోసిన కంకులను కంకిపొడవు, పూత, నాణ్యత ఆధారంగా మొదలు గ్రేడింగ్ చేయాలి. తరువాత వాటిని చిన్న కట్టలుగా (కట్టకు 100 కంకులుండేట్లు) కట్టాలి. కాడలన్నింటినీ డీ న్యూస్ పేపర్‌లో చుట్టి, మొత్తం కట్టను తెల్లటి టిష్యూ పేపరులో కానీ, పాలిథీన్ పేపర్‌లో కానీ చుట్టాలి. ఈ విధంగా సిద్ధం చేసిన కట్టలను కార్డ్‌బోర్డ్ పెట్టెల్లో అమర్చి ఎగుమతి చేయాలి.

**దిగుబడి :**

హెక్టారుకి సుమారు 200 క్వింటాళ్ల విడి పూలు కోయవచ్చును. అదే కట్ ఫ్లవర్స్ అయితే హెక్టారుకి 1.5-2.0 లక్షల కంకులు వస్తాయి.

**కార్శి పంట :**

ప్రధాన పంట కోత ముగిసిన

తరువాత, దుంపలు నిద్రావస్థలోనికి వెళ్ళిపోతాయి. కాబట్టి కోత పూర్తయిన 4-6 వారాలపాటు నీటిని నిలిపివేయాలి. తరువాత నీరు పారించినట్లయితే, దుంపలు మరలా మొలకెత్తుతాయి. కార్శి పంటకు కూడా ప్రధాన పంటకు ఆచరించిన అన్ని యాజమాన్య పద్ధతులను పాటించాలి. కార్శిపంటలో కంకులు అధికంగా వస్తాయి. కానీ, వాటి నాణ్యత తగ్గుతుంది. కాబట్టి కార్శి పంటను విడి పూల కోసమే పెంచుకుంటే మంచిది.

**దుంపల త్రవ్వకం - నిల్వ :**

పూత ముగిసే సమయానికి మొక్క పెరుగుదల తగ్గుతుంది. క్రమంగా ఆకులు పండుబారి, ఎండిపోతాయి. ఈ దశలో దుంపలు ముదిరి, నిద్రావస్థకు చేరుకుంటాయి. ఈ దశలో నీరు పారించకుండా నేలను ఆరనివ్వాలి. నేలపైనున్న ఆకులను కత్తిరించి, దుంపలను త్రవ్వి, తీయాలి. దుంపలను చల్లని నీడ ప్రదేశంలో ఆరబెట్టి, విడదీసి, మట్టిలేకుండా శుభ్రం చేయాలి. ఆరబెట్టిన దుంపల్ని ఎప్పటికప్పుడు కదిలించి అవి కుళ్ళిపోకుండా చూడాలి. 4-6 వారాల తరువాతనే ఈ దుంపలు నాటడానికి సిద్ధమవుతాయి.

ఒక తల్లి మొక్క నుండి సుమారు 25-30 చిన్న/పెద్ద దుంపలు వస్తాయి. ఒక ఎకరం పొలం నుండి 2 లక్షల పెద్ద దుంపలు (వ్యాసం 2 సెం.మీ. కంటె ఎక్కువ), 4 లక్షల చిన్న దుంపలు వస్తాయి. పెద్ద దుంపలు నాటినట్లయితే అదే సంవత్సరంలో పూతకొస్తాయి.

సస్యరక్షణ :

1. ఆకు తినే గొంగళి (హెలికోవర్ప ఆర్మిజెరా)

గొంగళి పురుగులు ఆకులను కొరికి తినివేస్తాయి. మొగ్గలను కూడా కొరికి, పాడు చేస్తాయి. దీని నివారణకు ఎండోసల్ఫాన్ ( 2 మి.లీ./లీటరు) ప్రొఫినోఫాస్ లేదా మిథైల్ పెరాథియాన్ (1.5 మి.లీ/లీటరుకి) పిచికారీ చేయాలి.

2. నల్లి (త్రిప్స్) :

ఈ పురుగులు మొక్కల నుండి రసాన్ని పీల్చి వేస్తాయి. ఉధృతి అధికమైనపుడు మొక్కలు కంకి సరిగ్గా వదలవు. మొక్కలు చనిపోయే ప్రమాదముంది. వీటి నివారణకు డైమిథోయేట్ (1 మి.లీ/ లీటరు నీటికి) లేదా అసిఫేట్ (1.5 మి.లీ./ లీటరుకి) పిచికారీ చేయాలి.

3. నులి పురుగులు :

నులి పురుగులు ఆశించిన మొక్కల వేర్లపై బుడిపెలు ఏర్పడతాయి. మొక్కలు వడలిపోతాయి. నీరందినపుడు, ఉదయం వేళల్లో సాధారణంగా కనిపించే, ఎండ తగిలినపుడు లేదా బెట్ట పరిస్థితుల్లో వడలిపోతాయి. వీటివలన దిగుబడులు గణనీయంగా తగ్గిపోతాయి. వీటి నివారణకు

హెక్టారుకి 300 కిలోల వేప పిండిని ఆఖరు దుక్కిలో కలపాలి. కార్బోఫ్యూరాన్ లేదా ఫోరేట్ గుళికలు (2.5-30 కిలోల మందు) వేయాలి. అంతర పంటగా కానీ, పంట మార్పిడిలో కానీ బంతిని వేయాలి.

నేల సంపంగి పూలకు ఎల్లపుడూ గిరాకీ ఉంటుంది. కాబట్టి రైతులు గిట్టుబాటు ధరలను ఆశించవచ్చును. నీటి వసతి ఉన్నచోట సంవత్సరం పొడవునా పూలను మార్కెట్‌కు అందించే వీలుంటుంది. ఈ పంట నాశించే చీడపీడలు చాలా తక్కువనే చెప్పాలి. పైగా తక్కువ యాజమాన్యపు ఖర్చుతో అధిక దిగుబడులు సాధించదగ్గ పంట ఇది. కాబట్టి కాస్త శ్రద్ధ వహించి, సరియైన యాజమాన్య పద్ధతులను పాటించినట్లయితే మంచి లాభాలు పొందవచ్చును.



# సమగ్ర సస్యరక్షణ



ప్రొ॥ ఎన్. వేణుగోపాలరావు,
ఎంటమాలజిస్టు, తిరుపతి.

## వివిధ పైర్లలో సమగ్ర సస్యరక్షణా పద్ధతులు

సమగ్ర సస్యరక్షణా పద్ధతుల్ని పంటకాలానికి, ప్రాంతానికి తగిన విధంగా రూపొందించుకొని సామూహికంగా ఆచరించగలిగినప్పుడే, మనం ఈనాడు పంటలపై దాడి చేస్తున్న గడ్డు పురుగులను తెగుళ్ళను ఎదుర్కొని వ్యవసాయాన్ని లాభకరంగా మార్చుకోవచ్చని గుర్తించడం జరిగింది. ఈ ధ్యేయంతో వివిధ పైర్ల సాగులో చేయదగ్గ ప్రక్రియల్ని పలు పరిశోధనా కేంద్ర శాస్త్రజ్ఞులు ముందుకు తేవటం జరిగింది. వాటిని పంట వారిగా చర్చించుకొందాం.

**1. వరి :**

ప్రాంతాన్ని బట్టి కీలకమైన పురుగును సుడిదోమ, ఉల్లికోడు, కాండం తొలిచే పురుగు. పచ్చదోమ (టుంగ్రోవైరస్), అగ్గి తెగులు తట్టుకునే వంగడాల్ని సాగుకు ఎన్నుకోవాలి. కేవలం గింజ నాణ్యతకు, దిగుబడికి ప్రాముఖ్యతనిస్తూ అధిక పెట్టుబళ్ళతో వరి పండించడం అన్ని సందర్భాల్లో లాభదాయకం కాకపోగా పోనుపోను కొన్ని ప్రాంతాల్లో పంట పండించలేని స్థితి కూడా రావచ్చని అనుభవాలు చెప్తున్నాయి.

**సుడిదోమకు తట్టుకొనేవి :** వజ్రం, చైతన్య, కృష్ణవేణి, యం.టి.యు - 10018.

**ఉల్లికోడుకు తట్టుకొనేవి :** పోతన, ఫల్గుణ, సురేఖ, దివ్య, ధాన్యలక్ష్మి, కావ్య, ఎర్రమల్లెలు, భద్రకాళి, శివ, కేశవ, అప్పాజి.

**మొగిపురుగును తట్టుకొనే :** రత్న, సస్యశ్రీ, సాకేత్, యంటియు - 4370, పోతన ఎం.టి.యు-5849

**పచ్చదోమ :** ఐ.ఆర్.20, విక్రమార్య, రాధ.

**అగ్గి తెగులు :** ఎన్ఎల్ఆర్-8863

❖ వరి తరువాత వరి వేసుకుంటూ సంవత్సరానికి రెండు - మూడు వరి పంటలనే పండిస్తూపోతే కొన్ని రకాల తెగుళ్ళు పురుగులు విపరీతమైన స్థాయికి పెరిగే స్థితి కల్పించబడుతుంది. కాబట్టి విధిగా ఈనాడు దాళ్వా, వేసవి వరి పైర్లను సాగు చేస్తున్న గోదావరి. కృష్ణా, నెల్లూరు, వరంగల్ జిల్లా రైతులు ఈ విషయాన్ని దృష్టిలో పెట్టుకొని భూసార రక్షణ, పురుగు/తెగుళ్ళ నియంత్రణల నిమిత్తం విధిగా పంట మార్పిడి విధానాన్ని ఆచరించాలి. దీనికనుగుణంగా ప్రభుత్వ పథకాలుండాలి.

❖ వరిలో వచ్చే ముఖ్యమైన పురుగులకు తగిన విధంగా నిఘా కార్యక్రమం చేపట్టాలి. ఏ పురుగు, తెగులు ఒకేసారి ఉధృత రూపంలోకి మారదు. ప్రతిదానికి ప్రారంభ దశల స్థాయి ఉంటుంది. ఆ స్థితిని, కాలాన్ని గమనించగల్గినప్పుడు తగిన యాజమాన్య పద్ధతిని తక్కువ ఖర్చుతో చేపట్టవచ్చును. ఆధునిక పరిజ్ఞానంతో వరిలో వచ్చే ముఖ్య పురుగుల ఉనికిని, ఉధృతిని తెలిపే కృత్రిమ లింగాకర్షణ రసాయనాలు అందుబాటులోకి వచ్చాయి. కావున వీటి ప్రాముఖ్యతనిచ్చే దిశలో రైతుల్ని నడపాలి.



❖ వరి నారును విధిగా తలలు త్రుంచి నాటడం ద్వారా కాండం తొలిచే పురుగుల గ్రుడ్ల దశల్ని, ఉల్లికోడు ప్యూపా దశల్ని తక్కువ స్థాయిలో ఉంచవచ్చు. నాటిన పైరును మొదటి దశలో ఆశించే ఉల్లికోడు, మొవ్వు ఈగ, ముడత పురుగుల్ని తగ్గించే నిమిత్తం వరినారు పీకబోయే 6-7 రోజులు ముందు, పల్లగా నీళ్లుంచిన మడిలో సెంటుకు (40 చ.మీ) 120 గ్రాముల కార్బోఫ్యూరాన్ గుళికల్ని చల్లాలి. అది వీలు కానప్పుడు నారు వేళ్ళను 12-24 గంటలు క్లోరోఫైరిఫాస్ 0.05 శాతం ద్రావణంలో ముంచి నాటితే ప్రయోజనకరమని కూడా తేలింది.

❖ నాటబోయే (దమ్ము) మడిలో వేసే కృత్రిమ రసాయన ఎరువులను సమపాళ్ళతో వేయటంతోపాటు సేంద్రియ ఎరువుల్ని, పచ్చిరొట్ట ఎరువుల్ని, చెక్క ఎరువుల్ని వాడితే మంచి ఫలితముంటుంది.

❖ వరిలో వృద్ధి అయ్యే దోమల సహజ అదుపుకై నాటేటప్పుడు ప్రతి 5-6 మీ. కు 75 సెం.మీ. వెడల్పు దారి వదలినాటడం మంచిది.

❖ సాధ్యమైనంతవరకు వరిపైరు మొదటి దశలో ఏ విధమైన కృత్రిమ రసాయనాలు వాడకుండా ఉంటే ప్రయోజన మెక్కువని గుర్తించడమైనది. తద్వారా పైరులోని దోమ, పెంకు పురుగుల నాశ్రయించి పెరిగే తూనీగలు, సాలీళ్ళు, పొడుగు మెడ బిళ్ళ పురుగులు, పచ్చ నల్లులు, అక్షింత పురుగులు వృద్ధి చెందుతాయి. అదే విధంగా వివిధ రకాల బదనికలు, పురుగులు వివిధ జీవిత దశల్ని ఆశ్రయించే నిమిత్తం వలస వచ్చి పెరగడం ప్రారంభిస్తాయి. వీటిని రక్షించుకొనే ధ్యేయంతో సస్యరక్షణ చర్యలు ఉండాలి.

ఇటువంటి మిత్ర జీవుల్ని '' కృత్రిమంగా పొలంలో వదలగలిగితే మంచిది. కాని ఇది ప్రస్తుత దశలో వీలుకావడంలేదు. అందువలన కనీసం వీటిని నిలబెట్టుకొని వృద్ధిపరిచే ప్రక్రియలు చేపట్టాలి. అందు నిమిత్తమై వరి పొలం గట్లపై అలసంద, పెసర, సోయా చిక్కుడు వంటి పప్పుజాతి మొక్కల్ని పెరగనిస్తే మంచిది. ఎండుగడ్డి కుప్పల వలన సాలీళ్ళు పెరిగే స్థితి ఉంటుందని కూడా గమనించబడింది. ఇటువంటి ప్రక్రియల్ని చిన్న చూపు చూడకుండా ఆచరిస్తే మంచిది.

పైరులో నత్రజనిని పై ఎరువు ద్వారా అందించవలసి వచ్చినప్పుడు విధిగా వేపపిండిని 5:1 నిష్పత్తిలో కలిపి వేయడం ప్రయోజనకరం.

మొగిపురుగు / తెల్లకంకి పురుగు, నాము తెగులు పురుగు, సుడిదోమల స్థాయిని గమనించి వీటికి తగిన బదనిక పురుగు ఉనికిని కూడా బేరీజు వేసుకొని, అవసరమైనప్పుడు వేప సంబంధమైనవి, జంతు సంబంధమైనవిగా, సూక్ష్మక్రిమి సంబంధమైనవి - అజాడిరెక్టిన్, కార్టాప్,

•సిల్లస్ వంటి వాటిని వాడాలి. అత్యవసర రిస్థితుల్లో కార్బోఫ్యురాన్ గుళిక మందు/ ్ఫోరిపైరిఫాస్/ ఎండోసల్ఫాన్ వంటి మందులు ాడాలి. అయితే మిగిలిన పద్ధతులన్నీ మన్వయ పరిచి వాడినప్పుడు ఈ అత్యవసర రిస్థితి రాదు.

వీటితోపాటుగా వరి మోళ్ళ •గురించి ఏర్పడే దుబ్బుల్ని ఆశ్రయించి పెరిగే ుగిపురుగు ప్యూపాలు, ఉల్లికోడు లార్వాలు, •మల యొక్క పెరుగుదలని నిరోధించే మిత్తం, మోళ్లను చిగురించనియ్యకుండా .దిల్చే పద్ధతి (దున్నకం) మంచిది. అయితే •రి తరువాత పప్పు గింజపైరో లేక పచ్చిరొట్ట ైరో వేసే స్థితిలో ఈ ప్రక్రియ ువసరముండదు.

**. జొన్న :**

• జొన్నలో ఆలస్యంగా విత్తినప్పుడు పైరును ఆశించే మొవ్వు ఈగను గమనంలో ుంచుకొని, దీన్ని తట్టుకొనే రకాల్ని న్నుకోవాలి. జొన్నలో కొన్ని ప్రాంతాల్లో ుక్కువ సమస్యగా మారిన కాండపు పురుగు స్థాయిని దృష్టిలో ఉంచుకొని సాగు రకాన్ని ెన్నుకోవాలి.

❖ మొదటి దశలో వచ్చే పురుగుల్ని తగ్గించుకొనే నిమిత్తం జొన్న గింజల్ని ఎిత్తనశుద్ధి (కార్బోఫ్యురాన్ పొడి 40 గ్రా./కిలో) చేయడం మంచిది.

❖ మొవ్వు ఈగలపై నిఘా ఉంచి, వాటిని అదుపు చేసే నిమిత్తం చేప పొట్టుతో నింపిన ఎర డబ్బాల్ని పైరులో ఉంచడం ప్రయోజనకరం.

❖ కాండం తొలిచే పురుగులపై కూడా నిఘా ఉంచి, ఇవి సోకిన మొక్కల మొవ్వు భాగాన్ని తీసివేయడం మంచిది. వీటి సంఖ్యాస్థాయిని బట్టి సహజ మిత్రజీవులు క్రైసోపా, ట్రైకోగ్రామ్మా, సాలీళ్ళు, లేని ప్రాంతాల్లో బాసిల్లస్, వేప సంబంధిత మందుల్ని పిచికారి చేసుకోవాలి.




❖ పైరు తరువాత దశలో వచ్చే గింజనల్లి, కంకి ఈగల నష్టాన్ని తగ్గించే నిమిత్తం ఇమిడాక్లోప్రిడ్, ఎండో సల్ఫాన్ వంటి మందుల్ని చల్లుకోవాలి.

❖ కంకి దశలో నష్టపరిచే పక్షుల్ని బెదరగొట్టే నిమిత్తం రంగు రిబ్బన్లు కట్టడం మంచిది.

**3. మొక్కజొన్న :**



❖ మొక్కజొన్న ఏక పైరుగా కంటే సహపైరుగా వేసినప్పుడు పురుగుల, తెగుళ్ల బెడద తక్కువని గమనించబడింది. ముఖ్యంగా ఇది పసుపు కంది వంటి దీర్ఘకాలపైర్లలో మినుము, పెసర, సోయాచిక్కుడు వంటి స్వల్పకాల పైర్లలో వేసినప్పుడు మంచి ఫలితముంటుంది. అంతేగాక దీన్ని పంట మార్పిడి పైరుగా సాగు చేస్తే మంచిది.

❖ మొక్కజొన్న విత్తిన 40-50 రోజుల దశలో వచ్చే కాండం తొలిచే పురుగుల దృష్టిలో ఉంచుకొని, అవసరమైన స్థితిలో కార్టాప్ లేక ఎజడిరెక్టిన్ వంటి మందును చల్లాలి. వీటి వలన మిత్రజీవులకు హాని తక్కువ.

❖ మొక్కజొన్న కంకి వెళ్లే దశలో ఆశించే శనగపచ్చ పురుగును దృష్టిలో ఉంచుకొని దాని గ్రుడ్ల దశపై నిఘా జరపాలి. కంకి చివర పీచులపై పెట్టబడే ఈ గ్రుడ్లను తగ్గించుకొనే నిమిత్తం పైరులో పదే పదే తిరుగుతూ ఉండాలి. పురుగు స్థాయి పెరిగినప్పుడు, ఎండోసల్ఫాన్, ప్రొఫెనోఫాస్ వంటి రసాయనాల్ని పిచికారి చెయ్యాలి. ☆

## ఎరువుల వినియోగ సామర్థ్యాన్ని ఎలా నిర్ణయిస్తారు?

ఎరువుల సామర్థ్యాన్ని కొందరు ప్రతి కిలో రసాయనిక ఎరువు వాడకం వల్ల వచ్చిన అధిక దిగుబడిగా పరిగణిస్తే మరి కొందరు ప్రతి కిలో రసాయనిక ఎరువు వాడకం వల్ల వచ్చిన అధిక ఆదాయాన్ని లెక్కలోకి తీసుకుంటారు. తక్కువ మోతాదులో రసాయనిక ఎరువులు వాడినపుడు ఈ ఎరువుల వినియోగ సామర్థ్యం అధికంగా వుండి మోతాదు పెంచిన కొద్దీ తగ్గుతుంది.

ఎరువుల వినియోగ సామర్థ్యాన్ని అధికంగా చెయ్యడం వల్ల ఈ క్రింది విధంగా లాభిస్తుంది.

1. ప్రతి కిలో రసాయనిక ఎరువు వాడకం వల్ల వచ్చే పంట దిగుబడి పెరిగి తద్వారా రైతుకు ఆదాయం పెరుగుతుంది. ఉత్పత్తి వ్యయం కూడా తగ్గుతుంది.

2. వాతావరణ కాలుష్యం, భూమి మరియు నీటి కాలుష్యాలు తక్కువగా వుంటాయి.

3. పొదుపుగా వాడటం వల్ల రైతు తన దగ్గర వున్న రసాయనిక ఎరువులను చాలా కాలం వరకు మరియు ఎక్కువ పంటలకు వేసుకునే అవకాశం వుంటుంది.

4. ఎరువులను ఆదా చెయ్యడం అంటే విద్యుచ్ఛక్తిని కూడా మనం ఆదా చేసినట్లవుతుంది. మన దేశంలో తయారవుతున్న నత్రజని రసాయనిక ఎరువులకు చాలా విద్యుత్ అవసరం వుంది. భాస్వరపు ఎరువులు, పొటాషియం ఎరువుల కోసం ఎంతో విదేశీ మారక ద్రవ్యాన్ని మనం ఖర్చు చేస్తున్నాము. కాబట్టి ఎరువుల వినియోగ సామర్థ్యం పెంచడం వలన విద్యుచ్ఛక్తి మరియు విదేశీ మారక ద్రవ్యాలను మనం పొదుపు చెయ్యవచ్చునన్నమాట.

# నేరుగా చాళ్ళలో వరి నాటు యంత్రం

ఎస్. జితేంద్రనాథ్, రాజమండ్రి

ఆంధ్రప్రదేశ్‌లో ఎక్కువ విస్తీర్ణంలో సాగు అవుతున్న ఆహారధాన్యాలలో వరి అతి ముఖ్యమైనది. వరి పైరును అన్ని రకాల నేలలు, వాతావరణ పరిస్థితులలోను సాగు చేయవచ్చు. వరి పంటకి నీటి అవసరం ఎక్కువ (హెక్టారుకు సుమారు 800-1250 మి.మీ.) ప్రస్తుతం రైతాంగం అనిశ్చిత వర్షాభావ పరిస్థితులు, భూగర్భ జలాలు అడుగంటి పోవడం తదితర సమస్యలతో సతమతమవుతున్నారు.

వరి సాగులో మెట్ట వరి సాగు, మాగాణి వరి సాగు పద్ధతులు ఉన్నా, మన రాష్ట్రంలో 99 శాతం మాగాణి పద్ధతినే అనుసరిస్తున్నారు. మాగాణి వరిసాగులో రెండు పద్ధతులున్నాయి. 1. పొలంలోనేరుగా విత్తనాలను విత్తడం. 2. నారుమళ్ళలో విత్తనాలను పెంచి నారును నాటడం. ఈ రెండవ పద్ధతిలో నారు పెంచేందుకు సరిపడా నీరుండాలి. నీళ్ళు వదిలాక నారుమడి పోసి నాట్లు వేయాలంటే కొంత సమయం వృధా అవుతుంది. అందరూ ఒకేసారి నాట్లు వేయడంవల్ల కూలీల కొరత, డిమాండు ఏర్పడుతుంది. ఈ సమస్యను అధిగమించడానికి నేరుగా చాళ్ళలో ప్యాడీ సీడర్‌తో వరి విత్తనాలను నాటుకోవచ్చు.

ఈ ప్యాడీ సీడర్ పలుచని తుప్పు పట్టని ఇనుప రేకులతో తయారు చేసిన 4 డబ్బాలు కలిగి (మొలకెత్తిన విత్తనం పోయడానికి) ప్రతి డబ్బాకి 20 సెం.మీ. దూరంలో రంధ్రాలు కలిగి ఉంటాయి. పరికరం సులభంగా కదలడానికి ఇరువైపులా రెండు పెద్ద చక్రాలు ఉంటాయి. పరికరం బురదనేలపై జారడానికి వీలుగా రెండు దిమ్మలు కలిగి లాగడానికి వీలుగా హ్యాండిల్ ఉంటుంది. ఈ ప్యాడీసిడర్ బరువు సుమారు 25 కిలోలు.

కొద్దిగా కోరవచ్చి మొలకెత్తించిన వరి విత్తనాలను నాలుగు డబ్బాలలో పోసి దమ్ము చేసి చదునుగా ఉన్న మడిలో పెట్టి ముందుకు లాగాలి. ఎకరానికి 24-30 కిలోల విత్తనం సరిపోతుంది. వరి మొలక ఎక్కువగా పెరగకూడదు. ముక్కులు పగిలి కొద్దిగా తెలుపు మొలక కనిపించాలి. ఇద్దరు మనుషులు 3 గంటలలో ఒక ఎకరం పొలంలో విత్తనాలను విత్తవచ్చు. ఒకసారి పరికరం లాగినపుడు 8 చాళ్ళలో విత్తనం పడుతుంది. చాళ్ళమధ్య 20 సెం.మీ. ఎడం ఉంటుంది. ఈ సీడ్ డ్రిల్‌ను స్థానికంగా చిన్న చిన్న వెల్డింగ్ షాపులలో కొద్దిపాటి పరిజ్ఞానంతో తయారు చేసుకోవచ్చు. దీని తయారీకి సుమారు రూ. 2000 నుంచి రూ. 2500 వరకు ఖర్చు అవుతుంది.



పొలాన్ని సరిగా చదును చేయకపోతే ఈ పద్ధతిలో మొలక శాతం దెబ్బతిని మొక్కల సాంద్రత తగ్గుతుంది. విత్తిన 15 రోజులకు మొదటి దఫా నత్రజని వేయక ముందు ఒత్తుగా ఉన్నచోట మొక్కలను తీసి ఖాళీలలో నాటుకోవాలి. విత్తనం విత్తేటప్పుడు పొలంలో బురద పదును ఉండి నీరు పలుచగా ఉండాలి. విత్తిన తరువాత 2-3 రోజులకు ఒకసారి పల్చగా నీరు పెడుతూ మడి ఆరకుండా 10 రోజులపాటు పల్చగా నీరు ఉంచాలి. నాలుగైదు ఆకులు తొడిగేవరకు మొక్క నీటిలో మునగ కూడదు. అవసరమైనపుడు నీరు బయటకు పోయేటట్లు మురుగు నీటి కాలువ ఏర్పాటు చేయాలి.

సీడ్‌డ్రిల్‌తో విత్తిన పొలంలో ‌వ మొక్కలు, కలుపు మొక్కలు ఒకేసా మొలుస్తాయి. కలుపు విపరీతంగా పెరిగి నీ ఎరువులు, గాలి, వెలుతురు కోస పోటీపడటమే కాకుండా పంటపై వచ్చే ఇత పురుగులకు, తెగుళ్ళకు, సూక్ష్మజీవుల ఆశ్రయమిస్తాయి. ఈ పరిస్థితుల్లో విత్తిన 2 రోజుల తరువాత చేతితో కలుపు తీయడాని వీలుపడదు. కాబట్టి కలుపు నివారణ కోస తప్పని సరిగా రసాయన మందులు వాడా దమ్ము చేసిన 4-5 రోజుల లోగా సేఫన కలిపిన ప్రెటిలాక్లోర్ (సోఫిట్) రసాయానాని 1 లీటరు నీటికి 2 మి.లీ. చొప్పున కలి ఎకరానికి 200 మి.లీటర్ల మందు ద్రవాని (ఎకరానికి 400 మి.లీ) బురద పదునుపై స్ప్రే చేయాలి. లేదా విత్తనం విత్తిన 8 రోజులలో ఎకరానికి 4 కిలోల 2,4-డి ఇథైల్ ఎస్ట గుళికలను 1( కిలోల ఇసుకతో కలిపి మడి అంతా సమానంగా చల్లాలి. గుళికలు చల్లేటప్పుడు 3-5 సెం.మీ. నీరు ఉండాలి. ఇవి చల్లిన 48 గంటల వరకు నీరు బయటకు పోకుండా చూసుకోవాలి.

నారు మడి తయారి, నారు పెంపకం, నాట్లు లేకపోవడం వలన శ్రమ, కూలీల ఖర్చులు బాగా తగ్గుతాయి. (సుమారు ఎకరానికి రు. 1000-1200) నాట్లు వరుస క్రమంలో ఉండటం వలన మడిలో సూర్యరశ్మి, గాలి బాగా సోకి, చీడపీడల బెడద తగ్గుతుంది. కలుపు తీతకు, ఎరువులు, పురుగు మందులు చల్లేందుకు వీలుగా ఉంటుంది. ఈ పరికరంతో నాటిన విత్తనం భూమిపై తక్కువ లోతులో మొలకెత్తడం వలన వేర్లు బాగా అభివృద్ధి చెంది, పైరుకు ఇచ్చే పోషక పదార్థాలను సక్రమంగా వినియోగించుకొని ఒక్కో దుబ్బులో ఎక్కువ పిలకలతో మంచి వెన్నులు వేసి అధిక దిగుబడికి దోహదపడుతుంది. నాట్లు పద్ధతి కన్నా పైరు 10 రోజుల ముందుగానే కోతకు వస్తుంది. కావున రైతులు శ్రమ, ఖర్చును తగ్గించే ఈ ప్యాడీ సీడర్‌ను ఉపయోగించుకొని ప్రయోజనం పొందుతారని ఆశిద్దాం. ☆

# పశువులకు సూక్ష్మజీవుల ద్వారా సోకే వ్యాధులు

సి.హెచ్. రమేష్, నల్గొండ

పశువులకు తొలకరిలో వివిధ కాల వ్యాధులు సోకుతాయి. ప్రధానంగా ంతు వాపు వ్యాధి, జబ్బవాపు వ్యాధి స్తాయి. దీంతో పాడిపశువులు అకస్మికంగా రణిస్తాయి. అందువల్ల ముందుజాగ్రత్తగా కాలు వేయించడం తప్పనిసరిగా చేయాలి. ంది జాగ్రత్తలు తీసుకొని వ్యాధులనుండి శువులను రక్షించుకోవాలి.

**గొంతువాపు వ్యాధి**

వర్షాకాలంలో పశువులకు సోకే వ్యాధుల్లో "గొంతువాపు" ప్రధానమైనది. దీనినే రక వ్యాధి, కంఠమాద అని కూడా పిలుస్తారు. ూన్ నుంచి సెప్టెంబర్ మాసాల్లో తొలకరిలో ది ఎక్కువగా సోకుతుంది. లికుంటు వ్యాధి ప్రబలిన మాల్లో గొంతువాపు కూడా క్కువగా సోకుతున్నట్లు మనించారు. దీనికి ముఖ్యకారణం, ఆ గ్రామాల్లో పశువుల్లో వ్యాధి ప్రబలడం వల్ల వ్యాధి నిరోధక శక్తి తగ్గిపోవడమే.

గొంతువాపు సోకిన పశువు శరీర ఉష్ణోగ్రత పెరుగుతుంది. కంటి నుంచి రు, నోటి నుంచి చొంగ పడుతుంది. గొంతు, మెడ వాస్తాయి. శ్వాస కష్టమై, గురక శబ్దంతో 24 గంటల్లో పశువు మరణిస్తుంది. వ్యాధి నిర్ధారణ ఖచ్చితంగా, వీలైనంత త్వరగా చేయాలి. సాధారణంగా రక్త పరీక్షల ద్వారా వ్యాధి కారక బ్యాక్టీరియా గుర్తించి వ్యాధి నిర్ధారిస్తున్నారు. కాని పశువు శరీర ఉష్ణోగ్రత ఎక్కువగా ఉన్నప్పుడు సేకరించిన రక్తంలోనే బ్యాక్టీరియా కనిపిస్తుంది. దీన్ని వేరుచేసి, గుర్తించడం తేలికైనపనేమికాదు. మూలుగుతో సహా పశువు ఎముకను ఐస్‌లో ఉంచి పరీక్షకు పంపితే 3 రోజుల్లో వ్యాధి నిర్ధారణ సాధ్యమవుతుంది.

**చికిత్స :**

ఇటీవల ఎన్నో కొత్త మందులు, అంటిబయోటిక్స్ లభిస్తున్నాయి. సల్ఫాడిమిడిన్ ఇంజెక్షన్ బాగా పని చేస్తుంది. వ్యాధి తీవ్రతను బట్టి పశువైద్యుల సలహాతో వాడాలి.

నివారణ : ప్రతి ఏడాది గొంతువాపు సోకే ప్రాంతాల్లో తొలకరిలోనే ముందు జాగ్రత్తగా పశువులన్నింటికి టీకాలు వేయిస్తే 7-10 రోజుల్లో వ్యాధినిరోధక శక్తి పెంపొంది 6-12 మాసాల పాటు వ్యాధి రాకుండా ఉంటుంది. గ్రామాల్లో పశువులు మరణిస్తున్న సందర్భాల్లో టీకాలు వేయకూడదు. తప్పనిసరి వేయించాల్సి వస్తే ఆరోగ్యమైన పశువులకు టీకాలు వేసి, బూస్టర్ డోస్ తప్పక చేయాలి. నివారణగా సల్ఫాడిమిడిన్ ఇంజెక్షన్ వాడవచ్చును.

❖ గొంతువాపు త్వరగా వ్యాపించే అంటువ్యాధి. ఈ వ్యాధిసోకిన పశువుల్ని విడిగా ఉంచాలి. మరణించిన పశుకళేబరాన్ని, అవి తినగా మిగిల్చిన గడ్డిని నీటి ప్రవాహాల్లో, బీళ్ళల్లో పడేయకుండా గొయ్యి తీసి పాతి పెట్టాలి.



వ్యాధి నిరోధక టీకాలు ముందుగా వేయించాలి.

**ప్రయోగ దశలో :**

సాధారణంగా ప్రతి గ్రామ్‌నెగెటివ్ బ్యాక్టీరియా చుట్టూ ఉండే కణజాలం పొరల్లో ప్రోటీన్లు ఉంటాయి. గొంతువాపు వ్యాధిని కలుగజేసే పాశ్చరుల్లా మల్టోసిడా గ్రామ్‌నెగెటివ్ బ్యాక్టీరియాలో మాత్రం ఒక ప్రత్యేకమైన ప్రోటీన్ ఉంటుంది. ఇలాంటిదే మరే గ్రామ్ నెగెటివ్ బ్యాక్టీరియాలో ఉండదు. పాశ్చరుల్లా మల్టోసిడా ప్రోటీన్ విడదీసి దానిలోని జన్యువు (జీన్)ను క్లోనింగ్ ప్రక్రియ ద్వారా అంటి బాడిలు తయారు చేసే ప్రయత్నాలు జాతీయపాడి అభివృద్ధి సంస్థ, గుజరాత్‌లో ముమ్మరంగా జరుగుతున్నాయి. ప్రస్తుతం ఎన్.డి.డి.బి. వారి గొంతువాపు వ్యాక్సిన్ ఒకసారి పశువులకు వేస్తే రెండు నుంచి రెండున్నరేళ్ళపాటు వ్యాధినిరోధక శక్తి కలిగి ఉంటాయి. ఈ వ్యాక్సిన్ ఒక మి.లీ.ను కండలోనికి ఎక్కిస్తే సరిపోతుంది. ప్రస్తుతం ఈ వ్యాక్సిన్ వనితనాన్ని పరిశీలిస్తున్నారు.

**జబ్బవాపు వ్యాధి :**

ఈ వ్యాధిని సొప్ప వ్యాధి అని కూడా వ్యవహరిస్తారు. క్లాస్ట్రిడియం చావై అనే బ్యాక్టీరియా ద్వారా పశువుల్లో సోకే అంటువ్యాధి ఇది. ఆరు మాసాల యుక్తవయస్సులో ఉండి, ఆరోగ్యంగా, ధృఢంగా ఉన్న పెయ్యలకు ఎక్కువగా సోకుతుంది. ఈ వ్యాధి వర్షాకాలంలో ఎక్కువగా సోకుతుంది. కలుషితమైన ఆహారం, నీరు, గాయాలద్వారా వ్యాధి సోకుతుంది.

లక్షణాలు : జ్వరం $106^0$-$108^0$ ఫారన్ హీట్, ఆకలిలేమి, నీరసం, నెమరు వేయకపోవడం, గుండె వేగంగా కొట్టుకోవడం. శ్వాస కష్టంగా తీసుకోవడం మొ॥ లక్షణాలు ఉంటాయి. సూక్ష్మజీవులు భుజం, తొడ ప్రాంతాల్లోని కండరాలను ఆశించి, మాంసం కుళ్ళిపోయేలా చేస్తాయి. తద్వారా పశువులు వాపుతో కుంటుతుంటాయి. వెనుకకాలు కాని, ముందుకాలుగాని పైకి లేపి ఉంచి, కుంటుతాయి. వాపు దగ్గర కరకరమని శబ్దం వస్తుంది. వాపు ప్రారంభంలో ఎర్రగా, నొప్పిగా ఉండి, రాను రాను నొప్పి లేకుండా ఉంటుంది. రక్తంలో విష పదార్థాల ప్రభావంవల్ల పశువులు 12-48 గంటల్లో మరణిస్తాయి.

చికిత్స :

❖ వ్యాధి ప్రారంభంలో పెన్సిలిన్, ఆక్సీవంటి అంటిబయోటిక్స్ వాడాలి.

❖ అంటి పైరెటిక్స్, అంటి హిస్టమిన్స్ వాడాలి. కార్టిజోన్లు, డెక్ట్రోజ్ నార్మల్ సెలైన్ వాడాలి.

నివారణ :

❖ తొలకరిలో జబ్బ వాపు వ్యాధి నివారణ టీకాలు వేయించాలి.

❖ వ్యాధిగ్రస్త పశువుల్ని వేరు చేయాలి. పశుకలేబరాల్ని కాల్చి వేయాలి లేదా గొయ్యిలో పాతి పెట్టాలి. వ్యాధి సోకిన ప్రాంతాల్లో వ్యాధి సోకకుండా ఉండేందుకు పశువుల్ని మేపనీయకూడదు.



కవర్ స్టోరీ

# ఉప్పు రైతులకు కష్టాలు

# బడా కంపెనీలకు లాభాలు



**బి. బలరాం**, కార్యదర్శి
పశ్చిమగోదావరి జిల్లా రైతు సంఘం

ఉప్పులేని చప్పని ఆహారం తినాలంటే కష్టమే! ఆహారంలో ఉప్పు కున్న స్థానం, దాని పాత్ర పెద్దదే. (స్వాతంత్ర్య పోరాటంలోనూ ఉప్పు సత్యాగ్రహానికి (దండి) పెద్ద పేరే!) కాని ఆ ఉప్పును పండించడానికి పడే శ్రమ, ఉప్పు రైతుల కష్టం అంతా ఇంతా కాదు. ఆహార పదార్థాల్లో కరిగిపోయి, కనుమరుగైపోయి, తాను కన్పించకుండా రుచి కల్పిస్తున్న ఉప్పులాగే రైతు కష్టం కూడా ఆవిరైపోతున్నది. మనం పొందుతున్న రుచి వెనుక రైతు శ్రమ, చెమట బిందువుల ధారలు ఉన్నాయి. కాని ఉప్పు రైతుకు వస్తున్నది మాత్రం అతి తక్కువ ధర. మిగులుతున్నది చప్పటి బ్రతుకులే.

మన రాష్ట్రంలో తీర ప్రాంత జిల్లాలైన శ్రీకాకుళం, తూర్పుగోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణా, ప్రకాశం, నెల్లూరు తదితర జిల్లాలో సుమారు 20 వేల ఎకరాల్లో ఉప్పును పండిస్తున్నారు. శ్రీకాకుళం జిల్లాలోని 'నౌపాడ' వద్ద అత్యధి కంగా 6 వేలు పైగా ఎకరాల్లో పండిస్తున్నారు. ఈ జిల్లాల్లో 25 సెంట్ల నుండి 1 ఎకరా, 2 ఎకరాలు కలిగి వున్నారు. ప్రధానంగా ఎస్.సి.బిసి, ఇతర కులాలకు చెందిన పేద రైతులే సాగుదార్లు. సముద్ర తీర గ్రామాల్లోని మత్స్యకారులు కొన్ని చోట్ల గిరిజనులు కూడా ఉప్పు పండిస్తున్నారు.

**ఉప్పు ఎలా తయారవుతుంది :**

ఫ్యాక్టరీల్లో తయారవుతుందనుకునేవారున్నారు. ఉప్పు తీర గ్రామాల్లోని భూముల్లో చిన్న, చిన్న మడులు కట్టి, వాటిలోనికి ఉప్పు నీటిని తోడి, నిల్వబెట్టి సూర్యరశ్మికి ఆవిరయ్యేలా చేస్తారు. పటికల రూపంలో తెల్లగా ఉప్పు తయారవుతుంది. తయారైన మడులు తెల్లగా చూడముచ్చటగా ఉంటాయి. క్రింద భాగం మట్టి రాకుండా జాగ్రత్తగా ఉప్పును సేకరిస్తారు. ఉప్పు నీటిని పెట్టే ముందు మడి తయారు చేయడం చాలా శ్రమతో కూడుకున్నది. ఇంటిల్ల పాదీ ఈ పనిలో రోజూ గంటల తరబడి ఉంటారు. మండుటెండలో చేసే పని ఇది. సముద్రపు నీరు 3 డిగ్రీల సెంటీగ్రేడు నుండి 5 డిగ్రీల సెంటీ గ్రేడు వరకు ఉంటుంది. బోరు నీరు $9^0$ సెం ఉంటుంది. ఈ రెండు విధాలా నీటిని సేకరించి మడులలో నింపుతారు. పశ్చిమ గోదావరి జిల్లాలోని నర్సాపురం మండలంలో పెదమైనవా నిలంక, తూర్పుతాళ్ళు, వేముల దీవి, బియ్యపుతిప్ప, మొగల్తూరు మండలంలోని కె.పి.పాలెం ప్రకాశం జిల్లాలోని కొత్త పట్నం మండలంలోని పలు గ్రామాల్లోను కృష్ణా జిల్లా బందరు మండలంలో సేద్యం జరుగుతోంది. ఈ జిల్లాల్లో కొన్ని ప్రాంతాల్లో ఆయిల్ ఇంజన్లు, కొన్ని ప్రాంతాల్లో కరెంటు మోటార్లు వాడుతున్నారు. పశ్చిమగోదావరి జిల్లాలో 3,500 ఎకరాల్లో 1500 మందికి పైగా ప్రకాశం జిల్లాలో 2 వేల మంది (2వేల ఎకరాలు) ఉప్పు రైతులున్నారు.

**కష్టానికి తగ్గ ఫలితం లేదు :**

ఎంతో కష్టపడి పండించే ఉప్పు రైతుకు ధర మాత్రం ఎ మాత్రం గిట్టుబాటు కాదు. ప్రకృతి అనుకూలిస్తే ఎకరాకు 800 నుం 1000 బస్తాలు తయారవు తుంది. పంటకాలంలో అకాల వర్షాల తుఫానులు, వరదలు వస్తే శ్రమ అంతా నీటి పాలవుతుంది. ఇటీవ త్సునామి, తరువాత అకాల వర్షాలు ఉప్పు పంటను, రైతులను తీవ్రం దెబ్బతీశాయి. ఎకరాకు కుటుంబం మొత్తం శ్రమతోపాటు 15 వే వరకు ఖర్చు అవుతుంది. ధర చూస్తే క్వింటాలకు అతి తక్కువ రు 30/- అత్యధి.కంగా రు. 160 వస్తుంది. ఎక్కువ సందర్భాల్లో వచ్చే రు. 60 నుండి రు. 70 లోపు ఉంటుంది.

**దళారుల దగా - కంపెనీల మోసం**

దళారులు కొనుగోలు చేసి ఇతర ప్రాంతాలకు తీసు వెళతారు. ధర అతి తక్కువ చెల్లిస్తా తూకాల్లో మోసం ఉంటుంది. క్వింటా అంటే వారి దృష్టిలో 100 కేజీలు కాద సుమా! 120 కేజీలు 130 కేజీలు అంటే రైతుకు కిలోకు 60 పైసలు కూడా రాదు. ఈ పంటలోనికి బడా కంపెనీలు ప్రవేశించాయి. పేదలకు భూములు వంచేస్తున్నామని గొప్పలు చెప్పుకుంటున్న ప్రభుత్వాలు పేద రైతులకు తాము కష్టపడి సాగు చేసుకుంటున్న బంజర్లకు పట్టాలు ఇవ్వడానికి ముందుకు రావు కాని బడా కంపెనీలకు మాత్రం వేల ఎకరాలు నామ మాత్రపు లీజుకు కట్ట బెడుతున్నాయి. కృష్ణా జిల్లా బందరు మండలం పల్లె తుమ్మలపాలెం వద్ద భూస్వాముల ఆధ్వర్యంలోని భారత్ సాల్ట్స్ అనే సంస్థకు ప్రభుత్వం గతంలో 5 వేల ఎకరాలు కట్టబెట్టింది. ఇపుడు మరో రెండు వేల ఎకరాలు ఇచ్చింది. అప్పటి కలెక్టరు మీనా అతి తక్కువగా ఎకరాకు లీజుకు రు. 200 కు రికమండ్ చేస్తే ప్రభుత్వం మరింత దయ, కనికరంతో భూస్వాములకు ఎకరా 50 రూపాయలకే లీజు కిచ్చింది. ఈ సంస్థ ఉప్పు పండిస్తోంది. మరి కొన్ని ప్రాంతాల్లోను ఈ ప్రయత్నాలు సాగుతున్నాయి. బడా కంపెనీలు ప్రోసెసింగు పేరుతో పొడిగా చేసి టాటా కంపెనీ కిలో రు. 7.50 లకు, ఐటిసి కంపెనీ రు. 7.50 లకు అన్నపూర్ణ (ఆశీర్వాద్) రు.7.50 లకు అమ్ముతున్నాయి. కొత్తగా విటమినైజ్డ్ ఉప్పు పేరుతో రు. 9.50 పైసలకు (కిలో) మార్కెట్‌లోకి

**బడా కంపెనీలు ప్రోసెసింగు పేరుతో పొడిగా చేసి ఎక్కువ ధరలకు అమ్మి వినిమయదారుల్ని విపరీతంగా దోచుకుంటూ వందల కోట్లు లాభాలు గడిస్తున్నాయి. నాడు బ్రిటిష్ వాడు ఉప్పుపై పన్ను వేస్తే ఉప్పు సత్యాగ్రహం నడిచింది. నేడు బడా బహుళజాతి కంపెనీలు తక్కువ ధరకు ఉప్పును, భూములను కాజేసి ప్రజలను దోచుకుంటున్నాయి.**

( వ పేజీ తరువాయి)

ప్తింది. వినిమయదారుల్ని విపరీతంగా చుకుంటూ వందల కోట్లు లాభాలు పిస్తున్నాయి. చిన్న చేపలను పెద్ద ప మింగినట్లు చిన్న కంపెనీలను ద్ద కంపెనీలు మింగి వేశాయి. ాడు బ్రిటిష్ వాడు ఉప్పుపై పన్ను స్తే ఉప్పు సత్యాగ్రహంగా ్వాతంత్రోద్యమంలో చెన్నికగన్నది. ఇపుడు తిరిగి బడా హుళజాతి కంపెనీలు తక్కువ ధరకు ప్పును, భూములను కాజేసి ప్రజలను చుకుంటున్నాయి.



**ధింపులు :**

'అయొడిన్' పేరుతో పలు ప్రాంతాల్లో అధికారులు ఉప్పు తులను వేధింపులకు గురి చేస్తున్నారు. కృష్ణా, వరంగల్, ఖమ్మం, తూ॥గోదావరి, ప॥గోదావరి, కరీంనగర్, ఆదిలాబాద్ జిల్లాల్లో ఆయొడిన్' కలిపి మాత్రమే అమ్మాలంటున్నారు. 'అయొడిన్' లేకుండా ిజామాబాద్, మెదక్, మహబూబ్‌నగర్, రంగారెడ్డి, నల్గొండ, కడప, ర్నూలు జిల్లాల్లో అమ్మాలి. ఈ పేరుతో రైతులపై చిన్న అమ్మకందార్లపై సులు పెడుతున్నారు. బడా కంపెనీలకు ప్రయోజనం చేకూర్చేందుకే ి కేసులు, వేధింపులు. ఆగస్టు 15 నుండి 'ఐయోడిన్ ఉప్పు అమ్మేవారిపై ిరిన చర్యలు తీసుకుంటామని కేంద్రం ప్రకటించింది. ఉప్పు పంటను వ్యవసాయంగా కాకుండా పరిశ్రమగా, వ్యాపారంగా గుర్తించి మోటార్లకు యూనిట్‌కు రు. 6/- లు వసూలు చేసి ప్రభుత్వాలు దగా చేస్తున్నాయి. ఆక్వాకు సైతం యూనిట్‌కు (1-20 పై వసూలు చేస్తున్నారు)

**ఈ క్రింది చర్యలు తీసుకోవాలి**

- తమిళనాడు, గుజరాత్‌లో వలె వ్యవసాయంగా గుర్తించాలి. పరిశ్రమల కేటగిరీ నుండి తొలగించాలి. ఉచిత కరెంటు ఇవ్వాలి. ఆయిల్ ఇంజన్లు, ఆయిల్ సబ్సిడీపై ఇవ్వాలి.
- సముద్ర బంజర్లు బడా కంపెనీలకు కాకుండా బడుగు రైతులకివ్వాలి. ఇప్పటికే పేదల సాగులో ఉన్న వాటికి పట్టాలు ఇవ్వాలి. రుణ సదుపాయం కల్పించి ప్రోత్సహించాలి. ప్రకృతివైపరీత్యాలవల్ల పంట నష్టానికి నష్ట పరిహారం ఇవ్వాలి.
- రైతులు 'అయొడిన్' కలిపి అమ్మాలనే నిబంధన తొలగించాలి. అధికారుల వేధింపులు, తప్పుడు కేసులు ఆపాలి.
- ప్రభుత్వం సివిల్ సప్లయిస్, స్టేట్ ట్రేడింగ్ కార్పొరేషన్, మార్క్‌ఫెడ్‌ల ద్వారా గిట్టుబాటు ధరకు కొనుగోలు చేయాలి. దళారుల దోపిడి అరికట్టాలి. రైతులను ఆదుకోవాలి. ప్రభుత్వమే ప్రోసెసింగ్ ప్లాంట్లు పెట్టి ప్రజలకు తక్కువ ధరలకు అందించాలి.
- సాగుదార్లు అత్యధికులు ఎస్.సి, బి.సి,ఎస్.టి.లు, ఆర్థికంగా వెనుకబడిన తరగతులకు చెందినవారు అయినందుకు కనుక ఆయా ఆర్థిక సంస్థల ద్వారా సహాయం అందించాలి. ప॥గోదావరి జిల్లాలో తూర్పుతాళ్ళు, పి.ఎం.లంక వద్ద ఏర్పాటు చేయాలి.
- బీమా సౌకర్యం కల్పించి, రైతులను ఆదుకోవాలి.
- తీర ప్రాంత రైతులైన వీరికి, ఇతర ప్రజలకు ప్రకృతి వైపరీత్యాల నుండి అన్ని విధాల రక్షణ కల్పించాలి.
- పేద రైతులైన ఉప్పు రైతులు ఐక్యమై తమ సమస్యలు పరిష్కరించుకుంటారని ఆశిద్దాం. రుచిని పొందుతున్న మనం వారికి అండగా నిలుద్దాం. ☆

పడి నీటిపంపుల గుండా నీరు రావడంలేదు.ట్రాన్స్‌ఫార్మర్లు ఓవర్‌లోడ్ అయినాయి. కొన్ని ట్రాన్స్‌పార్మర్స్ లేవు. సెకండ్‌స్టేజీ స్కీమ్‌లు దాదాపుగా నడవడం లేదు. కేవలం ముప్పయిశాతం భూమికే సేద్యం నీరు అందుతుంది. కేవలం ఆరు స్కీములకే 16 గంటల విద్యుత్ వ్యవస్థ అందుబాటులో ఉంది. మిగతా స్కీమ్‌లకు కేవలం 7 గంటల కరెంటు సరఫరా ఉంది. లిఫ్ట్‌లకు 9.5 టి.యం.సి నీరు కేటాయించగా కేవలం 3.50 టి.యం.సి ల నీటినే వాడుకొంటున్నారు.

పాదయాత్ర ముగింపు సందర్భంగా సాగర్ ఎన్.యస్.పి.సి.ఇ.సి. ఇ.కార్యాలయం ముట్టడిలో మూడువేల మంది రైతులు పాల్గొన్నారు. ఈసందర్భంగా జరిగిన కార్యక్రమంలో రైతుసంఘం రాష్ట్ర కార్యదర్శి సారంపల్లి మల్లారెడ్డి, సి.పి.యం. శాసన సభాపక్ష నాయకులు నోముల నర్సింహయ్య, శాసన సభ్యులు తమ్మినేని వీరభద్రం, సి.పి.యం. నల్గొండ జిల్లా కార్యదర్శి చెరుపల్లి సీతారాములు, 42 లిఫ్ట్‌ల చైర్మన్‌లు పాల్గొన్నారు. సి.ఇ గారు బయటికి వచ్చి సభనుద్దేశించి మాట్లాడినారు. లిఫ్ట్‌లను మరమ్మత్తులు చేపట్టుతామని,16గంటల విద్యుత్‌లైన్ల ఏర్పాటుకు చర్యలు తీసుకొంటామని ప్రకటించారు. లిఫ్ట్‌లను ప్రభుత్వం స్వాధీనం చేసుకోవాలనే డిమాండ్‌ను ప్రభుత్వం దృష్టికి తీసుకు వెళతామని చెప్పారు. స్వాధీనం విషయంలో స్పష్టమైన హామీ ప్రభుత్వం నుండి వచ్చేవరకు ఆందోళన చేపట్టాలని నిర్ణయించి జూన్ 25 వరకు మండల కార్యాలయం ముందు రిలే నిరాహార దీక్షలు జరపాలని నిర్ణయించడంతో దీక్షలు కొనసాగుతున్నాయి. లిఫ్ట్ పోరాటంలో సంబంధిత రైతులు ఉత్సాహంగా పాల్గొంటూ భవిష్యత్ పిలుపులపై కూడా సమరశీల పోరాటాలు నిర్వహించే విధంగా రైతాంగం సన్నద్ధమయ్యింది. ☆

## ఎరువులు కొనడానికి అవసరమైనంత పెట్టుబడి లేనపుడు...

పైరుకు ఎరువులు వేసుకోవాలి. కానీ రైతువద్ద తగినంత పెట్టుబడి లేదు. వున్నంతలో పైరును కాపాడుకోవాలి. ఈ పరిస్థితులలో వున్న కొద్ది పెట్టుబడిని సద్వినియోగం చేసుకోవడానికి ముందే పటిష్టమైన వ్యూహాన్ని రూపొందించుకోవాలి. సేంద్రియ ఎరువులు, ముఖ్యంగా పశువుల పెంట, ఆకులు అలములు ఇతర వ్యర్థ పదార్థాలు సేకరించి కంపోస్ట్ చేసుకోవచ్చు. లేదా ఆకులు అలాలను పచ్చిరొట్టగా వాడుకోవచ్చు. అవకాశాన్ని బట్టి పచ్చిరొట్ట పైరుగా జీలుగ, జనుము, అలసంద లేదా పిల్లిపెసరలను పెంచి చేనులో కలియదున్నవచ్చు. నేలకు సారం వస్తుంది. పైరుకు పోషకాలు అందుతాయి.

జీవన ఎరువులు కొద్ది ఖర్చుతో అందుబాటులో వున్నాయి. వీటిని సూచించిన విధంగా ఎంపిక చేసుకొని వాడుకోవాలి. మిగిలిన పెట్టుబడితో రసాయనిక ఎరువులను కొని పలుచగా పైరులో అన్ని వైపులా సమానంగా అందేట్లు వాడుకోవాలి. ఇలా వాడుకునేటపుడు యూరియా **2** శాతం ద్రవాన్ని పలుమార్లు స్ప్రే చేసి పైరుకు అవసరమైన నత్రజనిని అత్యంత సమర్థవంతంగా అందించ వచ్చు. అయితే కొంత మేరకు పైరుకు నేల ద్వారా కూడా వేసుకోవాలి. వేరుశనగ, ఇతర పప్పుజాతి పైర్లకు సూపర్‌ఫాస్ఫేట్ ఎరువు నేరుగా వేస్తే అధిక ఫలితం వస్తుంది. పొటాష్ సరఫరాపై బాగా కాలిన బూడిద( అందుబాటులో వుంటే) వేయవచ్చు. ఇతర అన్ని యాజమాన్య పద్ధతులను మామూలుగా ఆచరించవచ్చు.

# పండ్లు, కూరగాయల సాగులో జీవన ఎరువులు



కె. నవీన్ కుమార్
కృషి విజ్ఞాన కేంద్రం, ఆదిలాబాద్

నవీన వ్యవసాయ పద్ధతుల్లో భూసారాన్ని పెంచేందుకు ఉపయోగించే రసాయన ఎరువుల వలన చాలా దుష్ప్రభావాలు కలుగుతున్నాయి. మొక్కలకు అవసరమైన పోషక పదార్థాలకోసం వివిధ రకాల రసాయనిక ఎరువులు వాడాలి. మన రాష్ట్రంలో కొన్ని జిల్లాల్లో సంవత్సరానికి సగటున హెక్టారుకు 100 కిలోల రసాయనిక ఎరువులు వాడుతుంటే, మరికొన్ని జిల్లాల్లో 250-300 కిలోలు వాడుతున్నారు. ఈ విధంగా విచక్షణారహితంగా ఈ ఎరువులను వాడటం వలన పంటల పెట్టుబడి అధికం కావడమే కాక, మొక్కల్లో ఉండే వివిధ పోషకాల్లో తేడాలు వచ్చి వాటి జీవన ప్రక్రియల్లో తీవ్ర పరిణామాలు ఏర్పడతాయి. వాటి వలన మొక్కలు చీడపీడలకు గురవ్వడం, మరల వివిధ క్రిమిసంహారక మందులను వినియోగించడం జరుగుతున్నాయి. ఇటువంటి రసాయనిక మూలకాలు ఆయా పంటల్లో అవశేషాలుగా మిగిలిపోయి, వాటిని తిన్నప్పుడు మన శరీరంలో ప్రవేశించి విషపదార్థాలుగా పరిణమిస్తున్నాయి. ఇంతేకాకుండా, భూమి ఆమ్లత్వం కూడా పెరిగి, సూక్ష్మ జీవులు కూడా చనిపోతున్నాయి. భూమి నిస్సారమవుతోంది.

కావున వాతావరణ కాలుష్యం తగ్గించి అధిక దిగుబడులను పొందుటకు రసాయన ఎరువులను తగ్గించి జీవన ఎరువుల వాడటం వలన పంటలలో దిగుబడులు పెరగడంతోపాటు కాలుష్యం తగ్గడం, 20-25 శాతం వరకు రసాయనిక ఎరువుల వినియోగాన్ని తగ్గించి పెట్టుబడి ఖర్చుల్లో ఆదా జరుగుతుంది. వాతావరణ మార్పులు, వర్షాభావ పరిస్థితులను కూడా రసాయనిక ఎరువులు వాడిన పంటలకంటే జీవన ఎరువులు వాడిన పంటలు ఎంతో సమర్థవంతంగా తట్టుకోగలుగుతాయి.

జీవన ఎరువులను (బయో ఫెర్టిలైజర్స్) - సహజ ఎరువులు అని కూడా పిలవవచ్చు. ఇవి సూక్ష్మజీవులు గల ఎరువులు. ఈ సూక్ష్మజీవులు నత్రజని స్థాపన ద్వారా పంటల దిగుబడి పెంచడంలో తోడ్పడుతున్నాయి. కొన్ని సూక్ష్మజీవులు భూమిలో సేంద్రియ రూపంలో ఉన్న భాస్వరాన్ని ధాతురూపంలోకి మార్చి కూరగాయల పంటలకు అందుబాటులో తెచ్చి అధిక దిగుబడులనిస్తుంది. వీటి ధర తక్కువ కాబట్టి సాగు పెట్టుబడి తగ్గుతుంది. జీవన ఎరువులు వాటం వలన 25-30 శాతం రసాయనిక ఎరువుల వాడకం తగ్గించవచ్చు. అంతేకాక 15-20 శాతం దిగుబడి పెరుగుతుంది. ప్రకృతి సమతౌల్యం, వాతావరణ కాలుష్య నివారణ ప్రాతిపదికగా నూతన వ్యవసాయ విధానానికి జీవన ఎరువులే తొలి మెట్టని చెప్పాలి.

**జీవన ఎరువులు- రకాలు**

1. నత్రజని స్థిరీకరించే జీవన ఎరువులు
2. భాస్వరాన్ని అందించే జీవన ఎరువులు

1. నత్రజని స్థిరీకరించే జీవన ఎరువులు :

వీటిలో రెండు రకాలున్నాయి. 1. స్వతంత్రంగా నత్రజనిని స్థిరీకరించే రకాలు. అజిటో బ్యాక్టరు, అజోస్పైరిల్లమ్, నీలి ఆకుపచ్చ నాచు వంటివి. నీలి ఆకుపచ్చ నాచు ఎరువుగా మాగాణి వరి పంటకు ఉపయోగిస్తారు. అజిటో బ్యాక్టరు, ఇసుక, గరప నేలల్లో వాడుకుంటే అజోస్పైరిల్లమ్ బరువైన నేలల్లో ప్రయోజనకరంగా పని చేస్తాయి. ఇవి మొక్కల వేళ్ళ పైన మట్టిలో పెరుగుతూ నత్రజనిని స్థిరీకరిస్తాయి.

2. మొక్కలతో కలిసి నత్రజనిని స్థిరీకరించే రకం రైజోబియం అనేది. మనం పండించే లెగ్యూమ్ జాతి పంటల వేర్లపైన బుడిపెలుంటాయి. వీటినే వేరుబుడిపెలు లేదా నాడ్యూల్స్ అంటారు. ఈ బుడిపెల్లో ఉండే సూక్ష్మజీవులే రైజోబియం అనేవి. రైజోబియంను కేవలం లెగ్యూమ్ జాతి పంటల్లో వాడుకోవాలి. ఉదాహరణకు రైజోబియమ్ లెగ్యూమ్‌నోసేరమ్ అనే తెగ బఠాణి పంటకు, రైజోబియం ఫాసియోలై అనేది చిక్కుడు రకాలకి, రైస్పీషిస్ అలసందలకి వాడుకోవచ్చు.

ఈ రెండు రకాలు నత్రజనిని స్థిరీకరించే జీవన ఎరువు ఉద్యానవన పంటలకు వాడుకుంటే 25-30 శాతం వరకు రసాయనిక ఎరువులను ఆదా చేయడమే కాక, 15-20 శాతం వరకు దిగుబడికి పెంచవచ్చుని పరిశోధనల్లో తేలింది.

**భాస్వరాన్ని మొక్కలకు అందించే జీవన ఎరువులు :**

నత్రజని తర్వాత మొక్కలకు కావాల్సిన ముఖ్యమైన పోషక పదార్థం భాస్వరం, మొక్కల వేర్లు బాగా ఎదగడానికి, మంచి పూత, గట్టి గింజలు ఏర్పడేదానికి, వేసే నత్రజని ఎరువులు మొక్కలకు బాగా ఉపయోగపడేందుకు, ఆమ్లజనిత భూమి ఆమ్లగుణాన్ని నివారించేందుకు భాస్వ ఉపయోగపడుతోంది. నత్రజనిలాగా భాస్వ భూమి లేదా గాలి లేదా నీటి ఆవిరి రూప నష్టపోదు. తర్వాత వేసే పంటకు కూ ఉపయోగపడుతోంది.

90 శాతం 'భాస్వరం, నేల స్థిరీకరించబడి మొక్కలకు సులభంగా అంద ఇలా తేలికగా లభించని భాస్వరాన్ని అం నేలలో స్థిరీకరించుకుపోయిన దాన్ని మొక్కల అందజేసేందుకు జీవన ఎరువు ఉపయోగపడతాయి. వాటిలో కూడా రెం రకాలున్నాయి.

**1. ఫోస్ఫో బాక్టీరియా :**

ఇది కొన్ని ఆమ్లాలను భూమిల వదిలి, నేలలో స్థిరీకరించబడిన భాస్వరా కరిగించి మొక్కలు గ్రహించే రూపం విడుదల చేస్తాయి. వాటిలో కొన్ని రకా సూడోమోనాస్ స్ట్రయేట, బాసిల్లస్ పైయోమిక్ ఆస్పరిల్లస్ అవామోరి, పెనిసిలియ డిజిటేటమ్, ఫ్యుసేరియమ్ స్పీషీస్ లాంటివి ఫాస్ఫో బాక్టీరియాతోపాటు పశువుల ఎరువుల కలిపి మొక్కలకి వేస్తే మొక్కలు అధి భాస్వరాన్ని గ్రహించి, అధిక దిగుబడులిచ్చినట్ల పరిశోధనల్లో తేలింది. ఇది అన్ని పంటలక వాడుకోవచ్చు. ఇలా వాడుకోవడం వల రెండు రకాల రసాయనిక ఎరువులు 25 శాత వరకు తక్కువగా వాడుకునేందుక దోహదపడతాయి.

**2. మైకోరైజా :** ఇవి రైతులకు వరప్రసాదం అనుకోవాలి. ఇది అన్ని పంటల వేర్లలో ఉంటుంది. దీని వలన మొక్కలు తాము తయారు చేసుకున్న ఆహార పదార్థాలను వాటికి అందజేస్తాయి. కొన్ని పప్పు జాతి పంటల్లో జరిగిన పరిశోధనల ద్వారా మైకోరైజా వాడినప్పుడు వేరు బుడిపెలు కూడా అధికమైనట్లు తెలిసింది. మైకోరైజా ఉన్న వేర్లు, లేని వేర్ల కన్న అధిక పోషక పదార్థాలు భూమి నుంచి సేకరించి మొక్కలకు అందజేస్తాయి.

జీవన ఎరువులు 200 గ్రా. ప్యాకెట్లలో దొరుకుతాయి. వీటి ధర ప్యాకెట్ నాలుగైదు రూపాయల వరకు ఉంటుంది. ఏయే పంటలకు వాడుకోవాలి. ఎలా

వాడుకోవాలి. అనేది వాటి మీద రాసి ఉంటుంది. దాని బట్టి మనం వాడుకోవాలి.

**జీవన ఎరువులు వాడే విధానం పద్ధతులు**

1. విత్తనానికి పట్టించడం : 10-14 కి.గ్రా. విత్తనాలకు 200 గ్రా. జీవన ఎరువు సరిపోతుంది. ఒక జీవన ఎరువు ప్యాకెట్‌ను (200 గ్రా. ) 400 మి.లీ. నీటితో కలిపి ఆ మిశ్రమాన్ని విత్తనాలు ఉంచిన పాత్రలో పోసి సమానంగా అన్ని విత్తనాలకు పట్టే విధంగా కలపాలి. తర్వాత విత్తనాలను 10-15 నిముషాలు నీడలో ఆరబెట్టి విత్తుకోవాలి.

2. నారు ద్వారా : ఈ పద్ధతి టమాట, మిరప, ఉల్లి నార్లకు పనికొస్తుంది. ఒక కిలో జీవన ఎరువును 10 లీ. నీటిలో కలిపి, మిశ్రమం తయారు చేసుకోవాలి. ఒక ఎకరాకు సరిపడ నారును చిన్న చిన్న కట్టలుగా కట్టి 15-20 నిముషాలపాటు తయారు చేసుకున్న ఈ మిశ్రమంలో ఉంచాలి. అలా ఉంచిన తర్వాత, నారును నాటుకోవచ్చు.

3. నేల ద్వారా : 2-3 కిలోల జీవన ఎరువును 40-60 కిలోల మట్టిలో గానీ, సేంద్రీయ ఎరువులో గానీ కలిపి దానిని ఒక ఎకరానికి చల్లుకోవచ్చు. దానిని విత్తుకునే సమయంలోగానీ, విత్తుటకు 24 గంటల ముందుగానీ చల్లుకోవచ్చు. ఈ పద్ధతిలో ఫాస్పేట్ బ్యాక్టీరియాను ఎక్కువగా ఉపయోగించవచ్చు. ఈ సమయంలో నేలలో తేమ ఉండాలి.

**పండ్ల తోటలకు వాడకం**

బహువార్షికాలైన పండ్ల పంటలు ఉద్యాన పంటల్లో ముఖ్యమైనవి. మొక్కలు నాటేటప్పుడు లేదా నాటి ఉన్న చెట్లకైనా వేసుకోవచ్చు. నాటేటప్పుడు వేసుకోవాలంటే ఎకరానికి నాలుగైదు కిలోల కల్చర్‌ను బాగా చీకిన పశువుల ఎరువులో కలిపి పొలం అంతా పడేటట్లు సమానంగా చల్లి వెంటనే నీళ్ళు పెట్టాలి.

పండ్ల మొక్కలకు ఎక్కువగా సంవత్సరానికి ఒకసారి కత్తిరింపులు చేయాల్సి ఉంటుంది. అలా కత్తిరించినప్పుడు మొక్క మొదలుకు కొంచెం ఎడంగా 10-15 సెం.మీ. లోతు మట్టిని వదులు అయ్యేటట్లు తవ్వి, 2 కిలోల కల్చర్‌కు 20 కిలోల పశువుల ఎరువు, 5 కిలోల ఇసుక కలిపి చెట్లకు వేసుకోవాలి.

మైకోరైజాలను విత్తే ముందు కల్చర్‌ను కొంచెం ఇసుకతో కలిపి నారుమడులపై వేసి బాగా కలపాలి. జీవన ఎరువులు, ఉద్యాన పంటల్లో వీటి వాడుక గురించి పలు పరిశోధన స్థానాల్లో పరిశోధనలు చేయడం జరిగింది. నత్రజని స్థిరీకరించే కల్చర్‌లో ముంచి నాటిన విత్తనం కేవలం 75 శాతం రసాయనిక ఎరువు వాడినప్పుడు 7-10 శాతం అధిక దిగుబడులు వచ్చాయి. అంతేకాకుండా మొక్క పెరుగుదల, అధిక కొమ్మలు, త్వరగా పూలకు రావడం, కాయ పరిమాణం పెరగడం, చీడపీడలకు తక్కువ గురవ్వడం గమనించబడ్డాయి.

మైకోరైజాను వాడి అరటి, నిమ్మ, లిచి, మామిడి, బొప్పాయి వంటి పంటల్లో వాడటం వలన మొక్కల పెరుగుదల, కొమ్మలు ఎక్కువగా రావడం, త్వరగా పుష్పించి, ఫలించడం జరిగాయి. అంతేకాక 25 శాతం భాస్వరపు ఎరువులను తగ్గించి వేసినా అధిక లాభాలు రావడం జరిగింది. మొక్కలు కొన్ని పోషక ధాతువులైన జింకు, రాగి, కాల్షియం, మెగ్నీషియం వంటి వాటిని ఎక్కువగా గ్రహించడం వలన అధిక దిగుబడులను ఇస్తున్నట్లు తేలింది. కూరగాయ పంటల్లో కూడా 25 శాతం భాస్వరపు ఎరువులు ఆదా చేసినట్లు కనుగొన్నారు.

ఈ మైకోరైజాలు ఆశించిన వేర్లు చాలా రకాలైన వేరుకుళ్ళు తెగుళ్ళకి, నులిపురుగులకు తట్టుకుంటాయి. ఎందుకంటే మొక్క వేరంతా శిలీంధ్రం మాదిరిగా అల్లుకొనిపోయి ఇక వేరేవి దాడి చేసేందుకు ఆస్కారం లేకుండా చేస్తాయి.

ఈ విధంగా అజటో బ్యాక్టీరియాను జీవన ఎరువుగా వాడటం ద్వారా బెండలో 8.3 శాతం, వంగలో 8.9 శాతం మిరపలో 15.7 శాతం, కాలిఫ్లవర్లో 10.3 శాతం అధిక దిగుబడులను పొందినట్లు పరిశోధనల ద్వారా తేలింది. ఫాస్ఫో బ్యాక్టీరియా వాడటం ద్వారా వంగలో 10 శాతం, కాలీఫ్లవర్‌లో 7.3 శాతం అధిక దిగుడులను పొందవచ్చని పరిశోధన ద్వారా రుజువైంది. ఈ జీవన ఎరువుల ఖరీదు స్వల్పం- 200 గ్రా. ప్యాకెట్ ధర 10 రూపాయలకు మించదు. పంటల దిగుబడులు పెరగడంతోపాటు నేలలో ఈ బ్యాక్టీరియా వృద్ధి చెంది భూసారాన్ని పెంపొందిస్తుంది.

**జీవన ఎరువుల వాడకంలో పాటి మెలకువలు**

1. మనం వేసుకోబోయే పంటకు కావల్సిన జీవన ఎరువులను ముందుగానే తెప్పించుకోవాలి.

2. తెప్పించిన జీవన ఎరువులను రసాయనిక, క్రిమినంహారక మందుల దగ్గర నిల్వ ఉంచరాదు. పొడి, చల్లటి ప్రదేశాల్లో (35 డిగ్రీల సెం.గ్రే.లోపు) ఉంచాలి.

3. అన్ని జీవన ఎరువులు దాదాపు నల్లగా ఉంటాయి. ప్యాకెట్ మీద వాడాల్సిన గడు తేదీ, ఎలా వాడాలి అనే వివరాలు ఉంటా ఈ విషయాలను రైతులు అర్థం చేసుకొని గడువు తేదీల్లోగా వాడాలి. విప్పిన ప్యాకెట్ ని ఉంచరాదు. ఎందుకంటే బ్యాక్టీరియా, శిలీం చనిపోతాయి.

4. నేలలో నరైన తేమ ఉన్నప్పు నాటుకొనేటప్పుడు మాత్రమే వాడుకోవా. అవసరానికంటే ఎక్కువ విత్తనాలకు కల్చ పట్టించి నిల్వ ఉంచరాదు.

5. జీవన ఎరువులను రసాయనిక ఎరువు లేదా పురుగు మందులతో కలిపి వాడరాదు వీటి వాడకంలో కనీసం ఒక వారమైనా ఎ ఉండేట్లుగా చూసుకోవాలి.

6. జీవన ఎరువులు కేవలం 1/3 లేదా 1 వంతు నత్రజని, లేదా భాస్వరాన్ని అందిస్తా కాబట్టి ఇవి వాడేటప్పుడు రసాయని ఎరువులను తగ్గించి వాడాలి. అంతేగా పూర్తిగా రసాయనిక ఎరువులను వాడట మానకూడదు.

7. సారవంతమైన భూములు, అధిక సేం పదార్థాలు గల భూముల్లో జీవన ఎరువుల సంతృప్తికరంగా ఆశించిన మేరకు ప చేస్తాయి. నత్రజని లోపం ఉన్న భూముల జీవన ఎరువుల ప్రభావం బాగా కనిపిస్తుంది ఈ ఎరువుల వాడకం వల్ల భూమి లేదా పంటకి ఎటువంటి హాని జరగదు.

8. జీవన ఎరువుల మోతాదును మించి వాడిన పైరు లేదా భూమికి ఎలాంటి హాని జరగదు

9. నీటి ఎద్దడి వచ్చినప్పుడు రసాయనిక ఎరువులను మొక్క తీసుకోదు. జీవన ఎరువులు సమర్థంగా పని చేయడానికి ఎక్కువ కాలం పడుతుంది. కాబట్టి నాటిన 75 రోజులకు 2 శాతం యూరియా, 90 రోజులకు 2 శాతం డి.ఎ.పి.ని పురుగు మందులతో పాటు పిచికారీ చేస్తే సత్ఫలితాలుంటాయి.

రైతులు జీవన ఎరువులు వాడితే సత్ఫలితాలు పొందడమే కాకుండా జీవ పర్యావరణ కాలుష్యాన్ని నివారించడంలో తోడ్పడిన వారవుతారు. ☆

**మీకు తెలుసా?**

దేశంలో పశువుల సంఖ్య 48.5 కోట్లు ఉన్నట్లు ప్రభుత్వం తెలిపింది. ఒక్క ఉత్తర ప్రదేశ్‌లోనే 5.85 కోట్ల పశువులు ఉన్నాయి. కోళ్లు 10.23 కోట్లతో రాష్ట్రం అగ్రస్థానంలో ఉంది. దేశ వ్యాప్తంగా 49 కోట్లు ఉన్నాయి.

# కౌలు రైతుల కష్టాలు ఎన్నో... ఎన్నెన్నో...

## సర్వేలో వెల్లడైన నిజాలు



కె. శ్రీనివాస్, కార్యదర్శి
పశ్చిమగోదావరి జిల్లా వ్యవసాయ కార్మిక సంఘం

కౌలురైతులకు రుణాలు లేవు. ప్రభుత్వ పథకాలు వర్తించవు. కౌలు రేటు అధికం. ఆరుగాలం కష్టపడ్డా గడ్డి మినహా మిగిలిందేమీ లేదు. అప్పుల ఊబిలో కూరుకుపోయి వున్నారు. ఇదీ నేడు కౌలురైతుల దయనీయ స్థితి. ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ కార్మిక సంఘం జిల్లా కమిటీ నిర్వహించిన సర్వేలో వెల్లడైన నిజాలు. పశ్చిమ గోదావరి జిల్లా ఉండి మండలంలో పెదపుల్లేరు గ్రామంలో సర్వే నిర్వహించారు. వ్యవసాయ కార్మికులు 5 శాతం కౌలుదార్లుగా మారారని తెలిపారు. అధిక శాతం మంది 5 నుండి 15 సంవత్సరాలుగా కౌలు చేస్తున్నట్లు తేలింది. వీరు 5 ఎకరాల నుండి 20 ఎకరాల వరకు కౌలుకు తీసుకుంటున్నారు. ఈనాందార్లు ఎవరూ సొంత వ్యవసాయం చేయడం లేదు. 5 ఎకరాల పైగా కౌలు చేస్తున్న వారు 65%, 10 ఎకరాలకు పైగా కౌలు చేస్తున్నవారు 25% మంది ఉన్నారు. ఇతర గ్రామాలు, ఇతర జిల్లాల నుండి వచ్చిన వ్యవసాయ కూలీలు స్థిర నివాసం ఏర్పాటు చేసుకోవడంతో కౌలుదార్ల నుండి పోటీ పెరిగి 25 బస్తాల నుండి 40 బస్తాల వరకూ 3,4 సంవత్సరాలల్లో కౌలు పెరిగింది. దీంతో కౌలుదార్లకు గడ్డి తప్ప మరేమి మిగలడంలేదు. ప్రకృతివైపరీత్యం సంభవిస్తే ఆ గడ్డి కూడా మిగిలే పరిస్థితిలేదు. ఈ సీజనులో 40% మంది కౌలు రైతులకు మిగులులేదు. 25% మంది అప్పుల్లో ఉన్నారు. 20% మందికి రూ. 1000/- లోపు మిగిలింది. 10% మందికి రు. 500/- మిగిలింది. రు. 2000/- పైన 5% కౌలు రైతులకు మిగులు కనబడింది.

కౌలుదార్ల వద్ద నుండి కౌలును కల్లం మీదనే లాగేసుకుంటున్నారు. పండిన పంటను మొత్తం ఈనాందార్లే స్వాధీనం చేసుకుని మిగిలితేనే కౌలుదారుడికి డబ్బులు ఇస్తున్నారు. 60% మందికి పైగా కౌలుదార్లు ఈనాందారుడికి అనేక రూపాల్లో పాలేర్లుగా పని చేస్తున్నారు. అలా చేయకపోతే కౌలుకు పొలాలు ఇవ్వమని చెబుతున్నారు.

ప్రైవేటు వడ్డీ వ్యాపారులు, ఈనాందార్ల వద్ద అప్పులు చేసి పీకల లోతు మునిగిపోయామని కౌలుదార్లు వాపోయారు. రు. 100/- లకు రు. 2/- ల నుండి రు. 5/- ల వరకూ వడ్డీ చెల్లిస్తున్నారు. రు. 50 వేల పైన అప్పుల్లో ఉన్న వారు 40% మంది రు. 25 వేల లోపు అప్పుల్లో ఉన్న వారు 20% మంది ఉండగా అప్పుల్లో లేనివారు కేవలం 10% మంది మాత్రమే ఉన్నారు. బ్యాంకులు మాత్రం కౌలు రైతులకు ఒక్క పైసా కూడా రుణం ఇచ్చిన దాఖలాలులేవు. కానీ ఈనాందార్లు మాత్రం వ్యవసాయం చేయకుండానే బ్యాంకుల నుండి వేలకు వేలు తక్కువ వడ్డీకి రుణాలు తీసుకుని వీటిని కౌలుదార్లకు రు. 4/- రు. 5/-ల వడ్డీలకు ఇస్తున్నారు. కౌలుదార్లు తమవద్ద నున్న బంగారం, ఇళ్ల దస్తావేజులు, ఇతర విలువైన వస్తువులు తాకట్టు పెట్టి అప్పులు తీసుకుంటున్నారు. చేసిన అప్పులకు వడ్డీలు చెల్లించలేక కౌలు రైతులు అయోమయ స్థితిలో నున్నారని సర్వేలో వెల్లడయింది.

కౌలురేట్లు 24 బస్తాల నుండి 40 బస్తాలకు పెరిగింది. 30 బస్తాలలోపు కౌలు చెల్లిస్తున్న వారు 25% ఉండగా 35 బస్తాలు చెల్లిస్తున్న వారు 50%, 35 పైగా చెల్లిస్తున్న వారు 20% మంది ఉన్నారు.

### పెరిగిన పెట్టుబడులు :

మార్కెట్‌లోకి నకిలీ పురుగు మందులు విచ్చలవిడిగా, యదేచ్ఛగా రావడంతో రు. 8 వేల వరకు పెట్టుబడులు అయ్యాయి. దీంతో కౌలు రైతులు అప్పుల భారం ఈ సంవత్సరం మరింత పెరిగింది. ఎరువులు, పురుగు మందుల వ్యాపారస్తులు వీటిని ముందుగా రుణంగా ఇచ్చి వడ్డీలు వసూలు చేస్తున్నారు. గత్యంతరం లేని పరిస్థితుల్లో వ్యాపారస్తులు ఇన్నన్న నకిలీ, నాసిరకపు మందులనే వాడుతున్నారు. దీంతో కౌలుదార్లకు అప్పులు గుదిబండగా మారిపోయాయి. నకిలీ పురుగు మందులు రాజ్యమేలుతున్నా ప్రభుత్వం, సంబంధిత వ్యవసాయాధికార్లు నిమ్మకు నీరెత్తినట్లు వ్యవహరిస్తున్నారని విమర్శిస్తున్నారు.

### పెరుగుతున్న కౌలురేట్లు :

గత 3,4 సంవత్సరాలుగా కౌలురేట్లు 24 బస్తాల నుండి 40 బస్తాలకు పెరిగింది. 30 బస్తాలలోపు కౌలు చెల్లిస్తున్న వారు 25% ఉండగా 35 బస్తాలు చెల్లిస్తున్న వారు 50%, 35 పైగా చెల్లిస్తున్న వారు 20% మంది ఉన్నారు. కౌలురేట్లు ఈ రకంగా ఉండటంతో కౌలుదార్లకు మిగులు ఏమి ఉండటంలేదు.

గత 10,15 సంవత్సరాల నుండి కౌలు రైతులుగా ఉన్నప్పటికీ వారి పేర్లు మాత్రం ఏ రికార్డుల్లోను నమోదు చేయడంలేదు. దీంతో ప్రకృతివైపరీత్యాలు తదితర కారణాలతో పంటలు నష్టపోతుంటే ప్రభుత్వం ఇచ్చే నష్ట పరిహారం ఈనాందార్లకే ఇస్తున్నారు. కానీ ఈనాందార్లు మాత్రం కౌలు రైతుకు ఒక్క బస్తా కూడా కౌలు తగ్గించిన పరిస్థితులు లేవు. నిర్దాక్షణ్యంగా కౌలు వసూలు చేస్తున్నారు. కౌలుదార్ల వద్ద నుండి కౌలును కల్లం మీదనే లాగేసుకుంటున్నారు. పండిన పంటను మొత్తం ఈనాందార్లే స్వాధీనం చేసుకుని మిగిలితేనే కౌలుదారుడికి డబ్బులు ఇస్తున్నారు. 60% మందికి పైగా కౌలుదార్లు ఈనాందారుడికి అనేక రూపాల్లో పాలేర్లుగా పని చేస్తున్నారు. అలా చేయకపోతే కౌలుకు పొలాలు ఇవ్వమని చెబుతున్నారు. దీంతో గత్యంతరం లేక భూస్వాములకు జీతంలేని పాలేరుల్లా గొడ్డు చాకిరీ చేస్తున్న పరిస్థితి. కష్టపడకుండా ఆదాయం వస్తుంది కాబట్టి భూస్వాములందరూ తమ పొలాలను కౌలుకు ఇచ్చేస్తున్నారు. ఇవ్వడానికి సుముఖత వ్యక్తం చేస్తున్నారు.

### కౌలుదార్లు పెరుగుటకు కారణాలు

. గ్రామంలో గౌరవం

(తరువాయి 40 వ పేజీలో)

# నైవేద్యంలా ఆరగిస్తున్న దేవాదాయభూములు

ఎం కోటేశ్వరరావు, హైదరాబాద్

దేవుడు నైవేద్యం తినడని పూజారికి తెలిసినంతగా మరొకరికి తెలియదు. అత్యధిక సందర్భాలలో పూజారికి నైవేద్యం మాత్రమే దక్కుతుంది. ధర్మకర్తలు, వారిని నియమించే పాలకపార్టీల పెద్దలు, వారితో కుమ్మక్కై స్వామికార్యం స్వకార్యం తీర్చుకొనే ఉన్నతాధికార్లకు మాత్రం కోట్ల విలువైన దేవాదాయ భూములు లక్షలకే హస్తగతమౌతాయన్నది తాజాగా బయట పడుతున్న కుంభకోణాల సారాంశం. సూదికోసం సోదికి పోతే పాతకథలన్నీ బయటపడినట్లు తెలుగుదేశం, కాంగ్రెస్ నాయకులు ఎదుటి పక్షంలో ఎవరెంత ఎలా ఆక్రమించారన్న వివరాలు బయటపెడుతున్నారు. తాజా అక్రమాలకు సూత్రధారిగా చెబుతున్న రిటైర్డ్ కమిషనర్ నేను చేసిన విక్రయాలేమిటి నాకంటే ముందు విక్రయించిన కమిషనర్ల సంగతేమిటని ప్రశ్నిస్తున్నారు. వారి కంటే తానే ఎక్కువ ధరలకు విక్రయించి దేవుడికి న్యాయం చేశానని కావాలంటే వివరాలు దర్యాప్తు చేసుకోమని సవాలు విసురుతున్నారు. ఇలాంటి క్రయ, విక్రయాలపై జస్టిస్ ఎ.వెంకటరామిరెడ్డితో ఏర్పాటు చేసిన కమిషన్ ఏం నిగ్గుతేలుస్తుందో తెలియదు. ఎందుకంటే వివరాలను జిల్లాల అధికారులు అందిస్తే కదా? గత పదేండ్లుగా జరిగిన లావాదేవీలపై మూడునెలల్లో విచారణ జరపాలన్నది కమిషన్‌కు ప్రభుత్వం నిర్దేశించిన లక్ష్యం. హైకోర్టులో దాఖలైన ఒక ప్రజాప్రయోజన వ్యాజ్యంపై డివిజన్ బెంచ్ ఇచ్చిన ఆదేశాల ప్రకారం 2002 నుండి జరిగిన లావాదేవీలను సమీక్షించటం లేదా రద్దు చేసే అధికారం ప్రభుత్వానికి ఉందని, ఎండోమెంట్ చట్టంలోని సెక్షన్ 89 కింద ఎలాంటి రాజీపడకూడదని పేర్కొన్నది.



దేవాదాయశాఖ మంత్రిగా ఉన్న ఎం.సత్యనారాయణరావు రాజీనామా చేసి క్రీడా మంత్రిగా కొత్త అవతారం ఎత్తారు. చట్టంలో ఉరితీయటానికి అవకాశం లేనప్పటికీ దేవాదాయభూముల వ్యవహారంలో దోషులకు ప్రత్యేకంగా చట్టసవరణ చేసి ఉరితీయాలని క్రీడా మంత్రిగా పని చేస్తూ వ్యాఖ్యానించారు. చట్టంలోని సెక్షన్ 89 కమిషనర్లకు అపరిమిత అధికారాలను కట్టబెట్టిందని, కొన్ని ఉత్తర్వులు మంత్రితో నిమిత్తం లేకుండానే కమిషనర్లు వెలువరించే అధికారం ఉన్నందున దానిని రద్దు చేయాలని ఆయన అన్నారు. ప్రభుత్వం నియమించిన న్యాయవిచారణలో తన తప్పేమేమీ లేదని తేలితే తనకు మంచి శాఖను కేటాయించాలని కోరతానని చెప్పటం కొసమెరుపు. మంత్రి తన శాఖ మార్పిడి కోసమే అక్రమాలను బయటపెట్టారా లేక ఆయన ప్రత్యర్థులు లేదా వాటా దక్కనివారు ఈ కుంభకోణాల గురించి ఉప్పందించారా అన్నది సందేహాస్పదం అవుతోంది. సత్యనారాయణరావు మంత్రిగా ఉండగా 250 ఎకరాల విక్రయంలో వాటా దక్కని వారి కారణంగా ఈ కుంభకోణం బయటకు వచ్చిందన్నది మాత్రం ఖాయం. దీనిలో మంత్రి కుమారుడిపై కూడా ఆరోపణలు వచ్చాయి. హైదరాబాద్ పరిసరాలలో ఎకరం కోటిరూపాయలు చేసే భూములను లక్షలలో విక్రయించారు. ఇతర చోట్ల కూడా ఇదే తీరు. ఇంత జరుగుతున్నా ఏ దేవుడూ తన భూములను రక్షించుకోలేకపోయాడు.

రాష్ట్రంలో ఒక లెక్క ప్రకారం మూడులక్షల 75వేల ఎకర దేవాదాయభూములున్నాయి. దేవాలయాలు 34వేలున్నా వాటి 25వేలకు సెంటు భూమిలేదు. కొన్నింటికి వేల ఎకరాలున్నాయి. వాటి సాగుకు పనికి వచ్చే భూములలో అత్యధికభాగం భూస్వాములు ఎప్పు ఆక్రమించారు. పేరుకు కౌలు వేలం పాటలు పెట్టినా ఆచరణ అవికాగితాలకే పరిమితమై నామమాత్ర ధరలకే స్వంతం చేసుకున్నార వారు వాటిని ఇతరులకు మార్కెట్ ధరలకు కౌలుకు ఇ లబ్ధిపొందుతున్నారు. ఇదొక కుంభకోణం. ఈ భూములలో కొ చోట్ల పేదరైతులు కూడా సాగుదార్లుగా ఉన్నారు.

తెలుగుదేశం ప్రభుత్వం కౌలు తక్కువగా ఉండటా గమనించి దేవాదాయభూములను వేలంలో విక్రయించి వచ్చి సొమ్మును డిపాజిట్ చేస్తే ఎక్కువ ఉపయోగమని చెప్పి విక్రయాల పూనుకుంది. ఇదే కాసులు కురిపించే భారీ దేవాదాయ భూ కుంభకోణానికి నాంది అని చెప్పవచ్చు. అనేక చో సాగుదార్లు అడ్డుకొని భూములను రక్షించుకున్నార ప్రభుత్వం వేలం వేయాలన్న నిర్ణయాన్ని కూడ తిప్పికొట్టారు. ఒకవేళ విక్రయించదలిస్తే సరసమైన ధరలక వాస్తవ సాగుదార్లకే వాయిదాల పద్ధతిలో చెల్లించే విధంగా భూములను అప్పగించమని కోరారు. వ్యవసాయ కార్మికుల భూస్వాముల ఆధీనంలో ఉన్న భూములను పేదలకు పంచమని డిమాండ్ చేశారు. ఈ డిమాండ్‌ను ప్రభుత్వాలు పట్టించుకోలేదు. అయితే సాగుదార్లను క్రమబద్ధీకరించే పేరుతో భారీగా ముడుపులు ముట్టటానికి అవకాశం ఉన్న పట్టణ కేంద్రాలు, రియలెస్టేట్ వ్యాపారాలకు అనుకూలంగా ఉన్న భూములను తప్పుడు పద్ధతులలో విక్రయించటం ప్రారంభించారు. దేవాదాయశాఖలో పని చేసేవారికి ఎలాంటి దైవభీతి ఉండదు. ఎందుకంటే అడుగడుగునా జరిగే అవినీతిని ఏనాడూ ఏ దేవుడూ, దేవత పట్టించుకోలేదని వారికి తెలిసినంతగా మరొకరికి తెలియదు. అందువలన ఈ శాఖ అవినీతికి మారుపేరుగా మారింది.

నిజానికి ఇది ఒక్క దేవాలయాలకే పరిమితం అనుకుంటే పొరపాటు. ముస్లిం వక్ఫ్ భూములు, వివిధ క్రైస్తవ సంస్థలకు పట్టణాలలో ఉన్న భూములు కూడా దుర్వినియోగం అయ్యాయి, అవుతున్నాయి. కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీలు పరస్పరం ఎవరెంత తిన్నారని తిట్టుకుంటున్నాయి. దానిలో తాజాగా వార్తల్లోకి వచ్చింది గుంటూరు కుంభకోణం. గుంటూరు పట్టణ సెంటర్లో 12కోట్ల విలువైన భూమిని తప్పుడు పద్ధతులలో తెలుగుదేశం మాజీమంత్రి బినామీ పేరుతో లేదా తన బంధువులకు కేవలం మూడుకోట్ల రూపాయలకే కట్టబెట్టారని ఆరోపణలు వచ్చాయి. ఈ పార్టీలు కేవలం వాటాల విషయంలో పేచీలు వచ్చి బజారుకెక్కుతున్నాయి. మరొక పార్టీ ఉంది బిజెపి. ఇల్లుకాలుతుంటే బొగ్గులేరుకోవాలన్నది దాని ప్రత్యేకత. కేవలం దేవాలయాల ఆస్తులే అన్యాక్రాంతం అవుతున్నట్లు. అందువలన వాటిని రక్షించాలంటే హిందూ

**(తరువాయి 41 వ పేజీలో)**

# వ్యవసాయంలో రసాయనిక ఎరువుల ప్రాధాన్యత

డా|| చలసాని సాంబశివరావు,
డా||వి.భారతి, డా|| జి.మంజులత,
ఎం.సుధ మాధురి,
రుద్రూరు, నిజామాబాద్

"హరిత విప్లవం"లో ముఖ్య ...మిక పోషించి అన్ని ఆహార పంటలలో ...బడులు ఎన్నోరెట్లు పెంచి, భారతదేశపు ...ర కొరత తీర్చడంలో "రసాయనిక ...వుల" పాత్రను భారత చరిత్ర ఎన్నటికీ ...వలేనిది. మనకు స్వాతంత్ర్యానంతరం దేశ ...లు తీవ్ర ఆహార కొరతను ఎదుర్కొన్నారు. ...హార పదార్థాల కోసం ఇతర దేశాలను ...శయించి ఆయా ప్రజలకు ఆహారం ...దించడానికి పడరాని అగచాట్లు పడ్డాం.

ఆ తర్వాత వ్యవసాయ శాస్త్రవేత్తలు ...ను పరిధిలో ఉన్న వనరులను ...పయోగించుకొని తమ మేధస్సుకు ...దును పెట్టి, ఆ నేపథ్యంలోనే "హరిత ...ప్లవానికి" శ్రీకారం చుట్టి ఊహించని విధంగా ...నేక రెట్లు దిగుబడులు పెంచి ఆకలిని ...రిమికొట్టారు. ఈ విషయంలో శాస్త్రవేత్తలకు ...ామికి మధ్య "రసాయనిక ఎరువులు" కేంద్ర ...ిందువు అన్న విషయం విస్మరించలేనిది.

వ్యవసాయ రంగంలో అన్ని రకాల ...ంటలకు 16 రకాల పోషక పదార్థాలు ...ాధాన్యత సంతరించుకున్నవి. ఈ ముఖ్య ...ోషకాలను రసాయనిక ఎరువుల ద్వారా ...ందించవచ్చును.

మొక్కలకు ముఖ్యంగా నత్రజని, ...ాస్వరం, పొటాష్, గంధకం, కాల్షియం, ...ెగ్నీషియం పోషకాలు అవసరం. ఈ ...ోషకాలను స్థూల పోషక పదార్థాలుగా ...ావిస్తారు.

అలాగే ఇనుము, మాంగనీసు, ...ోరాను, జింకు, రాగి, మోలిబ్డినము, క్లోరిన్ మొదలగు పోషక పదార్థాలను సూక్ష్మపోషక పదార్థాలుగా పరిగణిస్తారు. ఇవి మొక్కకు అతి తక్కువ మోతాదులో అవసరం అవుతాయి.

**వివిధ పోషకాల వలన మొక్కలకు ఉపయోగాలు**

**నత్రజని :** అన్ని మొక్కలకు నత్రజని పోషకం చాలా అవసరం. మొక్కకు కావలసిన ప్రోటీన్‌లు, పత్రహరితము, హార్మోన్లు, విటమిన్లు అందించటం ద్వారా మొక్కకు ఈ ధాతువు ప్రాణాధారం అవుతుంది. మొక్కలు ఆకుపచ్చ రంగులో ఉంచటానికి ఈ నత్రజని తోడ్పడుతుంది.

**భాస్వరం :** భాస్వరం మొక్కలకు జీవన ప్రక్రియలు సజావుగా జరగటానికి, వేర్లు బాగా అభివృద్ధి చెందటానికి, మొలకలు తొందరగా పెరగటానికి తోడ్పడుతుంది. పప్పుజాతికి చెందిన పైర్లకు వేరు బుడిపెలు అభివృద్ధికి భాస్వరం ఇతోధికంగా తోడ్పడుతుంది.

**పొటాష్ :** మొక్కలకు రోగ నిరోధక శక్తిని పెంపొందింపజేసి, నీటి ఎద్దడిని తట్టుకునే శక్తిని కలిగించి, గింజ నాణ్యత పెంపొందించటంలో పొటాష్ ముఖ్య పాత్ర వహిస్తుంది.

**కాల్షియం :** మొక్కలో కణజాలాన్ని పెంచటానికి, ఉదజని సూచికను సవరించి, నత్రజని మరియు సూక్ష్మపోషక పదార్థాలైన ఇనుము, జింకు, బోరాను, రాగి, మాంగనీసు ధాతువులు మొక్కకు అందించటానికి తోడ్పడుతుంది.

**మెగ్నీషియం :** మొక్కలో పత్రహరితం అభివృద్ధి చెందటానికి ఎంజైములను అందించటానికి తోడ్పడుతుంది.

**గంధకం:** పత్రహరితము పెంపొందించటానికి, నూనె గింజల పంటలలో నూనె శాతం పెంచటానికి గంధకం ఉపయోగపడుతుంది.

**బోరాన్ :** మొక్కలో ఆహారాన్ని సక్రమంగా సరఫరా చేయటానికి, నత్రజనిని మొక్క గ్రహించటానికి బోరాన్ అవసరమవుతుంది.

**మాంగనీసు :** కిరణజన్య సంయోగ క్రియకు తోడ్పడి పత్రహరితం అభివృద్ధికి అవసరం అవుతుంది.

**ఇనుము :** లేత ఆకుల అభివృద్ధికి, పత్రహరితము తయారు చేయటానికి ఇతర పోషకాలు మొక్క గ్రహించటానికి ఇనుము తోడ్పడుతుంది.

**జింకు :** మొక్కలలో జీవన ప్రక్రియలు సజావుగా సాగటానికి, కణ అభివృద్ధికి తోడ్పడుతుంది.

**రసాయనిక ఎరువులలోని రకాలు**

1. సూటి ఎరువులు
2. కాంప్లెక్స్ ఎరువులు

**సూటి ఎరువులు అంటే ఏమిటి?**

సూటి ఎరువు అంటే ఒకే పోషకాన్ని మొక్కకు అందించబడుతుంది.

**సూటి ఎరువుల రకాలు:**

1. నత్రజనిని అందించే ఎరువు
2. భాస్వరాన్ని అందించే ఎరువు
3. పొటాష్‌ను అందించే ఎరువు

**నత్రజనిని అందించే ఎరువులు**

యూరియాలో 46 శాతం నత్రజని కలిగివుంటుంది. కాల్షియం అమ్మోనియం నైట్రేట్, 26 శాతం నత్రజని ఇస్తుంది. అమ్మోనియం సల్ఫేట్ 21 శాతం నత్రజని కలిగి వుంటుంది.

**భాస్వరాన్ని అందించే ఎరువులు**

సింగిల్ సూపర్ ఫాస్ఫేట్‌లో 16 శాతం భాస్వరం కలిగి వుంటుంది. ట్రిబుల్ సూపర్ ఫాస్ఫేట్ లో 48 శాతం భాస్వరం కలిగి వుంటుంది.

**పొటాష్ అందించు ఎరువులు**

మ్యూరేట్ ఆఫ్ పొటాష్‌లో 60 శాతం పొటాష్‌నిచ్చే ఎరువు వుంటుంది. సల్ఫేట్ ఆఫ్ పొటాష్‌లో 48-50 శాతం పొటాష్ నిచ్చే పోషకం కలిగి వుంటుంది.

**కాంప్లెక్స్ ఎరువులు**

రెండు లేదా అంతకంటే ఎక్కువ రసాయనిక ఎరువుల పోషక పదార్థాల మిశ్రమాన్ని కలిగివున్న ఎరువును కాంప్లెక్స్ ఎరువు అంటారు. ఉదాహరణకు ముఖ్యమైన అందుబాటులో వున్న ఎరువులు నత్రజని+ భాస్వరం కలిగిన ఎరువులు

1. డై అమ్మోనియం పాస్ఫేట్ ( 18:46:0) లో 18 శాతం నత్రజని మరియు 46 శాతం భాస్వరాన్ని ఇచ్చే ఎరువులు కలిగివుంటాయి.
2. అమ్మోనియం పాస్ఫేట్ సల్ఫేట్ (20:20:0)లో 20 శాతం నత్రజని మరియు 20 శాతం భాస్వరాన్ని అందించే పోషకాలు వుంటాయి.

**నత్రజని-భాస్వరం-పొటాష్ కలిగి వున్న ఎరువులు**

1. 17:17:17
2. 19:19:19
3. 12:32:16
4. 14:35:14
5. 14:28:14
6. 14:14:14
7. 20:10:10

పై నిష్పత్తిని ఎలా వివరిస్తాము అంటే ఉదాహరణకు 17:17:17 ఎరువు తీసుకున్నట్లయితే 100 కిలోల ఎరువులో 17 కిలోల నత్రజని, 17 కిలోల భాస్వరం, 17 కిలోల పొటాషియం నిచ్చే పోషకాలు కలిగి

వుంటాయి. కాంప్లెక్స్ ఎరువుల వలన ఉపయోగం ఏమంటే గుళికల రూపంలో వుంటటం వలన తేలికగా వెదజల్లడానికి అనువుగా వుంటాయి.

**మిశ్రమ ఎరువులు అంటే ఏమిటి?**

రెండు కానీ అంత కంటే ఎక్కువ కానీ సూటి ఎరువులను కలిపి పంటలకు వాడటాన్ని మిశ్రమ ఎరువులుగా వ్యవహరిస్తారు.

**మిశ్రమ ఎరువుల వల్ల ఉపయోగాలు:**

1. భూమి యొక్క గుణాన్ని బట్టి, ఆయా పంటకు అవసరమయ్యే ఎరువు మోతాదును బట్టి పోషకాలను అందించగలుగుతాము.
2. సూక్ష్మపోషక పదార్థాలను తక్కువ మోతాదులో అందించవలసి ఉంటుంది.కాబట్టి మిశ్రమ ఎరువుగా వాడిన ఫలితం ఎక్కువ వుంటుంది.

**ఎరువులు వాడే పద్ధతులు:**

1. ఎరువును వెదజల్లటం
2. మొక్క కుదుర్లు చుట్టివేయటం
3.ద్రవ రూపంలో పోషకాలను అందించటం
   ఎ.పిచికారీ ద్వారా
   బి.సాగు నీటి ద్వారా

ఒక్కొక్క పంటకు ఒక్కొక్క విధంగా ఎరువు వేయవలసి ఉంటుంది.సమయం, మోతాదు పరిగణలోనికి తీసుకోవాలి.

**వివిధ పంటలలో పోషక లోప లక్షణాలు:**

**నత్రజని :**

నత్రజని లోపం కలిగిన మొక్కల్లో ఆకులు పసుపు వర్ణంగా మారి క్రింది ఆకులు ఎండిపోయి మొక్కలు గిడసబారి ఉంటాయి. ఈ పోషక లోపము దాదాపు అన్ని పంటల్లో వస్తుంది, సిఫారసు ప్రకారము నత్రజని వాడాలి.

**భాస్వరము :**

భాస్వరం లోపించిన మొక్కలలో ముదురు ఆకులు ఊదారంగు మచ్చలు ఏర్పడి క్రింది ఆకులు ఎండిపోతాయి. మొక్క ఎదుగుదల నెమ్మదించి మొక్కలు గిడసబారి ఉంటాయి. వ్రేళ్ళు సరిగా అభివృద్ధి చెందవు, పంట తొందరగా పక్వానికి రాదు.

**పొటాష్ :**

పొటాష్ లోపించిన మొక్కలలో ముదురు ఆకులలో అంచులు, చివర్లు కొస **నుండి** రంగు కోల్పోయి ఎండిపోతాయి. పైరు చీడపీడలను తట్టుకునే శక్తి కోల్పోతుంది.

**కాల్షియం :**

కాల్షియం లోపించిన మొక్కలలో ఆకులు ముడుచుకుని ఉంటాయి. ఈ లోపం ఎక్కువగా క్యాబేజిలో గమనించవచ్చును.

**మెగ్నీషియం :**

మెగ్నీషియం లోపించిన మొక్కలో క్రింది ఆకులు పత్రహరితము కోల్పోయి, పసుపు వర్ణంగా మారి చివరకు ఎర్రగా అవుతాయి. ఈనెలు ఆకుపచ్చగా ఉంటాయి. ఈ లోప లక్షణాలు ఎక్కువగా ప్రత్తి పంటలో గమనించవచ్చును.

**గంధకము :**

గంధకం లోపించిన మొక్కలో లేత ఆకుల ఆనెలు పచ్చదనాన్ని కోల్పోయి ఎదుగుదల నెమ్మదిస్తుంది.

నివారణగా 3 గ్రాముల గంధకం పొడిని ఒక లీటరు నీటిలో కలిపి పిచికారీ చేయాలి.

**ఇనుము :**

లేత ఆకులలో పచ్చదనం కోల్పోయి పసుపు రంగుకు మారతాయి. పసుపు వర్ణం ఆకులు మొదలు భాగం నుండి చివర్లకు ప్రాకుతుంది. లోపం అధికమయితే ఆకులు, పువ్వులు, పండ్లు తెల్లగా మారతాయి. నివారణకు 10-20 గ్రాముల అన్నభేది + 1-3 గ్రాము నిమ్మ ఉప్పును ఒక లీటరు నీటిలో కలిపి పిచికారీ చేయాలి.

ఈ లోపం తరచుగా వరినారు మళ్ళలో చెరకులో, పండ్ల తోటలలో కనిపిస్తుంది.

**జింకు :**

జింకు లోపించినపుడు ముదురు ఆకులపై తుప్పుమచ్చలు ఏర్పడతాయి. మొక్క ఎదుగుదల ఆగిపోతుంది. మొక్కలు గిడసబారి ఉంటాయి. నివారణకు 2 గ్రాముల జింకు సల్ఫేటు ఒక లీటరు నీటిలో కలిపి పిచికారీ చేయాలి.

**బోరాన్ :**

బోరాన్ లోపించిన లేత ఆకులు, చిగుర్లు రంగు కోల్పోయి కొత పచ్చరంగుగా మారి ఆకులు ముడుచుకుపోతాయి. పూ రాలుతుంది. కాయలపై పగుళ్ళు ఏర్పడతాం

ఈ లోపం ముఖ్యంగా పండ్లతోట (నారింజ, జామ, కొబ్బరి) టమాట, ప్ర పంటలలో బహిర్గతమవుతుంది.

బోరాన్ నివారణకు 1 గ్రా బోరాక్స్ పొడిని ఒక లీటరు నీటిలో కలి పిచికారీ చేయాలి.

**రసాయనిక ఎరువుల వాడకంలో మెలకువలు**

ప్రస్తుతం రసాయనిక ఎరువు వినియోగం గతి తప్పి భూసార పరిస్థితి ప్రమాద ఘంటికలు మోగిస్తున్నాయి. మోతా మించి విచక్షణారహితంగా వ్యవసాయం ఉపయోగించరాదు.

1. రసాయనిక ఎరువులను సిఫారసు మేర తగిన మోతాదులో, తగు సమయంల వినియోగించాలి.
2. నత్రజని ఎరువులను వాడునపుడు భూమిల తగినంత తేమ అవసరం.
3. భాస్వరం కలిగిన ఎరువులను ఎప్పుడు దుక్కిలో వేసుకోవాలి.
4. పొటాష్ ఎరువును దుక్కిలో దుమ్ముల వాడాలి. వరికి అయితే చిరుపొట్ట దశల తప్పక వేయాలి.
5. సూపర్ పాస్ఫేటు, జింకు సల్ఫేటు వాడవలసి వస్తే రెండింటికి మధ్య 48 గంటల వ్యవధి ఇవ్వాలి.

40 సంవత్సరాల క్రితం వర ప్రసాదినిగా భావించిన రసాయనిక ఎరువుల వినియోగదారుల చేతుల్లో కక్ష్యతప్పి ప్రమాద పరిస్థితుల్లో భూసార పరిరక్షణలో తీవ్ర ఆటంకానికి కారణ భూతాలవుతున్నది.

రసాయనిక ఎరువులు తగు మోతాదులో వాడితే వ్యవసాయ రంగం పురోభివృద్ధిలో పయనిస్తుంది, అలాకాక విచక్షణారహితంగా ఉపయోగిస్తే రైతు ప్రగతికి గొడ్డలి పెట్టు అవుతుంది. ☆

# సమస్యలపై కదులుతున్న రైతన్న



నిర్వాసితుల రాష్ట్ర సదస్సులో మాట్లాడుతున్న రాష్ట్ర భారీనీటిపారుదల శాఖామాత్యులు పొన్నాల లక్ష్మయ్య, హాజరైన నిర్వాసితులు

### ప్రాజెక్టు నిర్వాసితుల రాష్ట్ర సదస్సు

ప్రాజెక్టు నిర్వాసితుల రాష్ట్ర సదస్సు హైదరాబాద్‌లో జూన్ ...న రైతుసంఘం, వ్యవసాయ కార్మికసంఘం, గిరిజన సంఘం ఆధ్వర్యంలో జరిగింది. 8 ప్రాజెక్టుల పరిధిలో 12 జిల్లాల నుండి నిర్వాసితులు హాజరయ్యారు. భారీ నీటిపారుదల శాఖామాత్యులు పొన్నాల లక్ష్మయ్య ముఖ్యఅతిథిగా పాల్గొన్నారు. నిర్వాసితుల సమస్యలపై అధ్యయనం చేసిన ప్రొఫెసర్ ముత్యంరెడ్డి ముఖ్యవక్తగా ప్రసంగించారు. సదస్సుకు డా. మిడియం బాబూరావు(పార్లమెంట్ సభ్యులు) బి వెంకట్, బి తులసీదాస్ అధ్యక్షవర్గంగా వ్యవహరించారు.

ప్రాజెక్టుల వల్ల కోల్పోతున్న భూమికి సమానంగా భూమిని నిర్వాసితులకు ఆయకట్టు ప్రాంతంలో కేటాయించాలని, నిర్వాసితులైన వ్యవసాయ కార్మికులకు, పేదరైతులకు ఆయకట్టు ప్రాంతంలో భూమి ఇవ్వాలని, ఆయకట్టు ప్రాంత భూమి ధరను పరిగణనలోకి తీసుకొని పెరుగుతున్న ధర ప్రకారం నిర్వాసితులకు నష్టపరిహారం చెల్లించాలని, తక్కువ ముంపు వున్న విధంగా ప్రాజెక్టులను డిజైన్ చేయాలని, పునరావాస, పున:పరిష్కారం విషయంలో గ్రామసభ ఆమోదం పొందాలని, మొత్తం సమస్యల పరిష్కారం విషయంలో అఖిలపక్ష సమావేశాలు ఏర్పాటు చేయాలన్న డిమాండ్లతో తీర్మానాన్ని బి తులసీదాస్ సదస్సులో ప్రవేశపెట్టారు. ప్రాజెక్టుల వారీ నిర్వాసితులు తమ సమస్యలను మంత్రివర్యులకు విన్నవించుకున్నారు. నిర్వాసితులకు న్యాయం చేయాలని విజ్ఞప్తి చేసారు. నిర్వాసితుల సమస్యలను విన్న మంత్రి మాట్లాడుతూ ప్రాజెక్టు వారీగా సమస్యలను అధ్యయనం చేస్తున్నామని, నిర్వాసితులకు అన్యాయం జరగకుండా చూస్తామని హామీనిచ్చారు. నిర్దిష్టమైన పునరావాస పథకాన్ని రూపొందిస్తామని చెప్పారు. ప్రాజెక్టు విలువలో 28 శాతం నష్టపరిహారానికి కేటాయించామని తెలిపారు.

ప్రాజెక్టులను నిర్మించడంలో అధిక ప్రాధాన్యతనిస్తున్నామని పేర్కొన్నారు. ఒకప్పుడు ప్రాజెక్టులు కట్టాలనే పోరాటాలు జరిగాయని, నేడు నిర్వాసితుల సమస్యలను పరిష్కారం కోసం పోరాటానికి తెరలేచిందని, ప్రభుత్వం నిర్వాసితులను విస్మరించబోదని చెప్పారు. ఆర్.ఆర్ పాలసీలో వున్న అంశాలను అమలు చేయడానికి శాయశక్తులా ప్రయత్నిస్తామని సదస్సులో పేర్కొన్నారు.

**నిర్వాసితుల సంఘం ఏర్పాటు :** రాష్ట్రంలో నిర్వాసితుల సమస్యలను అధ్యయనం చేసి, సమస్యల పరిష్కారానికి నిర్వాసితులకు అండగా "ప్రాజెక్టుల నిర్వాసితుల సంఘం" ఏర్పడింది. సంఘం అధ్యక్ష కార్యదర్శులుగా పాయం వెంకయ్య, బి తులసీదాస్‌లు ఎన్నికయ్యారు.

**ఎగ్జిబిషన్ :** నిర్వాసితుల సమస్యలు, పోరాటాలను ప్రతిబింబిస్తూ ఎగ్జిబిషన్‌ను ఏర్పాటు చేయడం జరిగింది. దీన్ని ప్రొఫెసర్ పద్మనాభ రావుగారు ప్రారంభించారు.

### జయతిఘోష్ కమిషన్ సిఫార్సులు అమలుపై సదస్సులు

వ్యవసాయ సంక్షోభ నివారణకు రాష్ట్ర ప్రభుత్వం జయతీఘోష్ అధ్యక్షతన కమిషన్‌ను నియమించింది. ఈ కమిషన్ వ్యవసాయరంగ సమస్యలను పరిశీలించి, అధ్యయనం చేసి సంక్షోభ నివారణకు కొన్ని సూచనలను చేసింది. కమిషన్ నివేదికను మార్చిలో శాసనసభలో ప్రవేశపెట్టి, కొన్ని సిఫార్సులను ప్రభుత్వం అంగీకరించింది. కానీ, వాటి అమలుకు పూనుకోవడం లేదు. ఈ సిఫార్సులను ప్రభుత్వం వెంటనే అమలు చేయాలని డిమాండ్ చేస్తూ రైతు, వ్యవసాయకార్మిక, రైతుకూలీ సంఘాల ఆధ్వర్యంలో జిల్లాల స్థాయిలో సదస్సులు జరిగాయి. వివిధ జిల్లాలలో జరిగిన సదస్సులలో ఆయా సంఘాల నాయకులు పాల్గొన్నారు. జయతీఘోష్ కమిషన్ సిఫార్సులను వెంటనే అమలు చేయాలని, లేనిపక్షంలో దశలవారీ ఆందోళనను చేపడతామని వక్తలు ప్రభుత్వానికి హెచ్చరించారు.

### టమాట ధర పెంచాలని రాస్తారోకో

మహబూబ్‌నగర్ జిల్లా కల్వకుర్తిలో టమాట ధర ఒక్కసారిగా దారుణంగా పడిపోయింది. రైతులు మార్కెట్‌కు సరుకును తెచ్చినపుడు 10 కిలోలు 40 రూపాయలు వున్న ధర కొద్దిసేపటికే ధర 20 రూపాయలకు తగ్గించారు. వ్యాపారులు సిండికేట్ అయిధరను దిగ్గొసారు. ఒకప్రక్క తీవ్రమైన ఎండలు.. మరో ప్రక్క శ్రమకోర్చి పండించిన పంట...దళారుల మాయాజాలంలో రైతు అష్టకష్టాలు.. ఈ దశలో రైతన్నకు రైతుసంఘం అండగా నిలిచింది. మార్కెట్‌లో రైతులను సమీకరించి రాస్తారోకో చేసారు. మార్కెట్ కమిటీ కార్యదర్శిని

నీలదీసారు. టమాట గంపలను రోడ్డుపైనే వుంచి గంటన్నర రాస్తారోకో నిర్వహించారు. దాంతో సంప్రదింపులకు కార్యదర్శి ఆహ్వానించారు. మార్కెట్ కమీషన్, తదితర సమస్యలను సంప్రదింపుల సమయంలో ముందుకు తెచ్చారు. సంఘటితమైన రైతుల ఆందోళనకు వ్యాపారులు దిగివచ్చారు. కమిషన్ తగ్గించుకున్నారు. ధరను పెంచుకున్నారు.

### మహేశ్వరం మండలం రైతు మహాసభ

కరువు మండలమైన రంగారెడ్డి జిల్లా మహేశ్వరం మండలంలో సన్నకారు, చిన్నకారు రైతులకు పశువులకు గడ్డి ప్రభుత్వ సరపరా చేయాలని మహేశ్వరం మండల రైతు మహాసభ ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానించింది. యం. మహేందర్, ఎం. రవీనాయక్ లు అధ్యక్ష వర్గంగా వ్యవహరించారు.



టమోట ధరను పెంచాలని రాస్తారోకో చేస్తున్న రైతులు

ఆంధ్రప్రదేశ్ రైతు సంఘం నాయకులు పి. జంగారెడ్డి, వంగల సుబ్బారావులు ప్రసంగిస్తూ జయతీఘోష్ కమిషన్ సిఫారసులు అమలు ద్వారా ఆంధ్ర దేశంలో రైతులకు బాధలను కొంత మేరకు పరిష్కారమవుతాయని, అందుకు రైతులు ఉద్యమించాలని కోరారు. ఎం. మహేందర్, ఎన్.మల్లేష్ అధ్యక్ష, కార్యదర్శులు 15 మందితో ముందుల రైతు సంఘ కమిటీ ఎన్నికైనది. జిల్లా గిరిజన సంఘ నాయకులు దత్తు నాయక్‌లు, సి.ఐ.టి.యు. మండల కార్యదర్శి అమరేశ్వర్ లు పాల్గొని ప్రసంగించారు.

### కొబ్బరి పంటకు గిటుబాటు ధర ఇవ్వాలి

రాజోలు డివిజన్ సదస్సు డిమాండ్ : గతంలో 1000 కొబ్బరి కాయలు 2500 నుండి 4000 రూపాయలకు అమ్మిన కొబ్బరి కాయలు అమ్మగా ఇప్పుడు రు. 1000 నుండి రు. 2000 కి పడిపోయింది. అందువలన ప్రభుత్వం జోక్యం చేసుకొని 1000 కొబ్బరి కాయలకు 3000 రూపాయలకు ధర వచ్చేలాగాను చర్యలు తీసుకోవాలని రాజోలు డివిజన్ రైతు, వ్యవసాయ కార్మిక సదస్సు డిమాండ్ చేసింది. రాజోలు డివిజన్ రైతు సంఘం, వ్యవసాయ కార్మిక సంఘం ఆధ్వర్యంలో 21-6-05 ను మల్కిపురంలో జరిగిన సదస్సుకి పీతల రామచంద్రరావు అధ్యక్షత వహించారు. కౌలు రైతులకు రుణ సౌకర్యం సాధించేందుకు ఉద్యమించాలని ఆంధ్రప్రదేశ్ రైతు సంఘ నాయకులు వంగల సుబ్బారావు చెప్పారు.

ఈ సదస్సులో రాజోలు డివిజన్ రైతు సంఘ అధ్యక్షత కార్యదర్శులు వడ్డి ధర్మారావు, సి.హెచ్. సూర్యప్రకాశరావు, తూర్పుగోదావరి జిల్లా వ్యవసాయ కార్మిక సంఘ సహాయ కార్యదర్శి విత్తనాల సాంబశివరావులు ప్రసంగించారు.

### లిఫ్టు రైతుల ఆందోళన

నాగార్జున సాగర్ ఎడమ కాల్వపై వున్న లిఫ్టులను రైతు నిర్వహించుకోవాలని, ప్రభుత్వం నిర్వహించడం లేదని ప్రకటించిం దీనిపై రైతుసంఘం ఆధ్వర్యంలో రైతులు ఆందోళన చేపట్టారు. మొద సదస్సు ఏర్పాటు చేసి కార్యక్రమాన్ని రూపొందించారు. జూన్ 9 ను 14 వరకు పాదయాత్రలు నిర్వహించారు. చివరి రోజున సాగర్ సి కార్యాలయాన్ని ముట్టడించారు. ( పూర్తి వివరాలు ఇదే సంచికలో ? పేజీలో ఇవ్వబడ్డాయి)

### కొల్లేరు 120 జి.ఓ.ను రద్దు చేయాలి



గవర్నర్‌కు మెమోరాండం ఇస్తున్న నాయకులు

కొల్లేరు ప్రజల జీవనానికి, మనుగడకు హానికరమైన జి.ఓ-12 రద్దు చేయాలని కోరుతు ఆంధ్రప్రదేశ్ రైతు సంఘం, కొల్లేరు ప్రజల హక్కు పరిరక్షణ అఖిల పక్ష కమిటీ, కృష్ణా, పశ్చిమగోదావరి జిల్లాల కొల్లేర ప్రాంతీయ వ్యవసాయ మత్స్య సహకార సంఘాల సంక్షేమ సంఘం రి.నెం 315/2000 ల ఆధ్వర్యంలో గౌరవ గవర్నర్ సుశీల్ కుమార్ సిండే గారికి సవివరమైన మెమోరాండం సమర్పించారు. 1999 లో తెలుగు దేశం ప్రభుత్వం తీసుకువచ్చిన ఈ జి.ఓ.వల్ల పశ్చిమగోదావరి, కృష్ణా జిల్లాలల్లో మండలాలోని 122 గ్రామాలకు చెందిన 3 లక్షల మంది జీవనానికి తీవ్ర అంటకం, ఇబ్బందులు ఏర్పడ్డాయని వారు తెలిపారు. ఈ గ్రామాల్లో అత్యధికులు బి.సి., దళితులు, ఇతర పేదలు. 1976 లో జి.ఓ ఎం.ఎస్.నెం.118 ద్వారా అప్పటి రాష్ట్ర ప్రభుత్వం ముఖ్యమంత్రి వెంగళరావ ఏర్పాటు చేసిన 146 సొసైటీలకు, 1938 నుండి ఎస్.సి., బి.సి.లక ఇచ్చిన డి ఫారం పట్టా భూములు రక్షణ కల్పించాలని వారు కోరారు.

120 జి.ఓ. ను రద్దు చేసి, కొల్లేరు వాసుల మనుగడ, స్వేచ్ఛ జీవించే హక్కు రక్షించాలని పేదల భుక్తంలో ఉన్న భూములకు పట్టాలు ఇవ్వలని భూస్వాములు అక్రమంగా అనుభవిస్తున్న భూములను స్వాధీనం చేసుకోవాలని కోరారు. పరిశ్రమలు, మున్సిపల్, ఇతర కాలుష్యాలను అరికట్టాలి. ఎగువ భూములు ముంపుకు గురికాకుండా ఛానలైజేషన్ చేయాలి. రవాణా, త్రాగునీరు సౌకర్యాలు కల్పించాలి. ప్రజల ప్రయోజనాలకు నష్టం కలుగని రీతిలో అభయారణ్యం ఏర్పాటు చేయాలి. **గవర్నర్‌ను కలిసిన వారిలో కొరటాల సత్యనారాయణ, ఆర్.ఎస్.రాజు, ఎస్. మల్లారెడ్డి, వై.కేశవరావు, జె. బాబూరావు, బి.బలరాం, సైదు గంగరాజు, చప్పిడి గంగధరరావు, జయమంగళ రామారావు, బలే రామయ్య, సైదు సత్యనారాయణ, ఘంటసాల పెద్దిరాజు, చేబత్తిన భూషణం, అరిగెల ఏలియా, ఘంటసాల వెంకటేశ్వరరావు, ఘంటసాల కృష్ణలు ఉన్నారు.**

కొల్లేరును దర్శిస్తానని గవర్నర్ గారు ప్రతినిధి వర్గానికి చెప్పారు.

# రసాయనిక ఎరువుల వాడకం-ఎంపిక

రసాయనిక ఎరువు సామాన్యంగా ఒకటి లేదా రెండు లేదా మూడు పోషకాలను మాత్రమే సరఫరా చేస్తుంది. అందువలన ఈ ఎరువులను నేలలోని పోషకాల లోపస్థాయిని గమనించి ఎంతమేర ఏఏ ఎరువును వేయాలో లెక్కించి వాడితే వేసే పోషకాలు సద్వినియోగం అవుతాయి.

ఈ పోషక లోపాలను కనిపెట్టడానికి భూసార పరీక్ష అవసరం. భూసార పరీక్ష ఫలితాల ఆధారంగా ఎరువులను వేసుకుంటే ఖర్చు తగ్గుతుంది. పైరుకు తగిన విధంగా పోషకాలు అందుతాయి. మధ్యస్థస్థాయి కలిగిన నేలలకు ఏ మార్పు లేకుండా వేయాలి. తక్కువ స్థాయి సూచించబడే పోషకాలను మామూలుగా సూచించిన మోతాదుకు 25 శాతం పెంచాలి. ఇదే విధంగా పోషక స్థాయి అధికంగా వుంటే, ఇట్టి నేలల్లో మామూలుగా సూచించిన మోతాదులో 25% తగ్గించాలి. వేయవలసిన ఎరువుల పరిమాణాన్ని ఎరువులోని పోషక విలువ ఆధారంగా లెక్కించాలి.

**ఏ కాంప్లెక్స్ ఎరువులు కొనాలి?**

ప్రస్తుత దశలో ఏ కాంప్లెక్స్ ఎరువు చౌకగా వుంటే దాన్ని కొని వాడితే ఉత్పత్తి ఖర్చు తక్కువ అవుతుంది. అయితే కాంప్లెక్స్ ఎరువుల ధరల్లో తేడాలు బాగా వున్నాయి. ఈ ఎరువుల పోషక విలువల తేడాలు ఈ తేడాకు ఒక ప్రధాన కారణం. అందువల్ల మార్కెట్‌లో వున్న వివిధ కాంప్లెక్స్ ఎరువుల్లో దేనిని అతితక్కువ ఖర్చుతో కొనాలనేది రైతాంగానికి ఒక ప్రధాన సమస్య. ఈ విషయంలో నిర్ణయం తీసుకోవడానికి క్రింది సూచనలు తోడ్పడతాయి.

1. వేయబోయే పైరును దృష్టిలో వుంచుకొని, కాంప్లెక్స్ ఎరువును మొదట ఎంచుకోవాలి. నైట్రేట్ నత్రజని వున్న ఏ కాంప్లెక్స్ ఎరువునైనా వరిపైరుకు కొనరాదు. ప్రతి కాంప్లెక్స్ ఎరువు బస్తామీద ఆ బస్తాలో వున్న ఎరువులో నత్రజని ఏ రూపంలో వుందో స్పష్టంగా వ్రాసి వుంటుంది.

2. ప్రతి కాంప్లెక్స్ ఎరువుల బస్తా మీద ఆ బస్తాలో వున్న ఎరువు పోషక విలువల శాతం స్పష్టంగా ముద్రించి వుంటుంది. ఇపుడు ఎరువులు 50 కిలోల బస్తాలలో అమ్ముతున్నారు. అందువలన బస్తా కాంప్లెక్స్ ఎరువు కొనేటపుడు, బస్తామీద సూచించిన పోషక విలువలో నగం మాత్రవే కొంటున్నామని గుర్తుంచుకోవాలి.

3. అతి చవకైన కాంప్లెక్స్ ఎరువును కొనటానికి బస్తాపై వున్న పోషక విలువల ఆధారంగా కాంప్లెక్స్ ఎరువు ప్రామాణిక ధరను మొదట లెక్కించాలి. ఏ కాంప్లెక్స్ ఎరువు చవకైనది అని తెలుసుకోవడానికి మార్కెట్‌లో దొరికే ఏదైనా కాంప్లెక్స్ ఎరువు వాస్తవ ధర, లెక్కించిన ప్రామాణిక ధర కన్నా తక్కువ వుంటే దానినే కొనడానికి ఎంచుకోవాలి. వాస్తవంగా ఇలా లెక్కించడానికి యూరియాలో నత్రజని, సూపర్‌పాస్పేట్‌లో భాస్వరం మరియు మ్యూరేట్ ఆఫ్ పొటాష్‌లోని పొటాష్ ప్రామాణిక ధరలను మొదట లెక్కించాలి.

4. యూరియాలో నత్రజని ప్రామాణిక ధర లెక్కించడానికి యూరియా బస్తాధరను 23తో భాగించాలి. ఉదాహరణకు యూరియా బస్తా ధర రు.250లు అనుకుంటే యూరియాలోని కిలో నత్రజని ప్రామాణిక ధర సుమారు రు.250÷23 అంటే రు.10.85లు. ఇదే విధంగా సూపర్ పాస్పేట్‌లో కిలో భాస్వరం ప్రామాణిక ధరను లెక్కించడానికి బస్తా ధరను 8తోను మరియు మ్యూరేట్ ఆఫ్ పొటాష్‌లోని కిలో పొటాష్ ధరను లెక్కించడానికి బస్తా ధరను 30తో భాగించాలి.

5. ఇపుడు కాంప్లెక్స్ ఎరువు ప్రామాణిక ధ· లెక్కించాలి. దీనికై బస్తాలోని కాంప్లెక్స్ ఎr ద్వారా కొనే నత్రజని, భాస్వరం, పొటాష్ి వాటి ప్రామాణిక విలువతో హెచ్చించి, వa మూడింటిని కూడితే, కాంప్లెక్స్ ఎర. ప్రామాణిక ధర వస్తుంది.

6. ఉదాహరణకు ప్రస్తుతం యూరియా, సూ ఫాస్పేట్ మరియు మ్యూరేట్ ఆఫ్ పొట ప్రామాణిక ధరలు వరుసగా రు.10. 19.75, 7.70లు. ఒక కాంప్లెక్స్ ఎరువ 14:35:14 శాతం పోషక విలువ అనుకుంటే, బస్తాలో వరుసగా 7.0, 1 మరియు 7.0 కిలోల నత్రజని, భాస్వ మరియు పొటాష్‌లు వున్నాయి. ఈ బ ప్రామాణిక విలువ:

నత్రజని = రు.75.25

భాస్వరం = రు.344

పొటాష్ = రు.53.90

కాంప్లెక్స్ ఎరువు ప్రామాణిక ధర =473.

ఈ విధంగా దుకాణంలో అ· అన్ని కాంప్లెక్స్ ఎరువుల ప్రామాణిక ధరల లెక్కించాలి. ఆ తర్వాత ఆయా కాంప్లె ఎరువుల అమ్మకం ధరలను లెక్కిం ప్రామాణిక ధరలతో పోల్చి, ఏ కాంప్లెక్స్ ఎరు అమ్మకం ధర, లెక్కించిన ప్రామాణిక ధరక తక్కువగా వుంటే లేదా తక్కువ వ్యత్యాసం కాంప్లెక్స్ ఎరువును కొనాలి.

---

( 33 వ పేజీ తరువాయి)

ఉంటుందని 40%., ఉపాధి దొరుకు తుందని 66%., పశువులకు గడ్డి ఉంటుందని 30%., అప్పులు పుడతాయని 35%. ఇలా అనేక కారణాలతో కౌలు రైతులు పెరుగుతున్నారు. ఇంకా వలసలు వెళ్ళవలసిన అవసరం ఉండదని చెబుతున్నారు. భూమి మీద ఉన్న మక్కువతోనే వ్యవసాయ కూలీలు కౌలుదార్లుగా మారుతున్నారు. కౌలుదార్ల రక్షణకు చట్టాలు ఉన్నా ప్రభుత్వాలు మాత్రం తమని పట్టించుకోవడంలేదని వాపోతున్నారు.

**కౌలుదార్ల కోర్కెలేమిటి?**

1. తక్కువ వడ్డీలకు బ్యాంకుల నుండి రుణాలు ఇప్పించాలి.

2. విపరీతంగా పెరిగిన కౌలురేట్లు తగ్గించాలి. కౌలుదార్లకు రక్షణ కల్పించాలి. చట్టాన్ని అమలు చేయాలి.

3. ఎరువులు, పురుగు మందుల కల్తీని అరికట్టాలి. ధరలు తగ్గించాలి. ప్రభుత్వమే సబ్సిడీతో సరఫరా చేయాలి.

4. ధాన్యానికి గిట్టుబాటు ధర ప్రతి పంటలో కల్పించాలి.

5. తమ పేర్లు గ్రామ అడంగుల్లో నమో· చేసి, పంట నష్టపోయిన సందర్భాల్లో న పరిహారం కౌలుదార్లకే చెల్లించాలి.

ఈ సర్వేను 3 రోజులపాట ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ కార్మిక సంఘం జి· కార్యదర్శి కె. శ్రీనివాస్, ఉపాధ్యక్షులు ఎ రామాంజనేయులు సహాయ కార్యదర్శు సిహెచ్ సత్యనారాయణ, జె సత్యనారాయణ మండల కార్యదర్శి గేర్క రాముల నిర్వహించారు.

---

చైనా మినహా 92 వర్థమాన దేశాలలో హెక్టారుకు సగటున వ ఉత్పత్తి 1961-62 లో 1500 కిలోల ఉంటే 1991-92 నాటికి 3000 కిలోలకు పెరిగింది. చైనాలో వ దిగుబడి 1961-62 లో 2400 ఉండగా 1991-92 నాటికి 6000 కిలోలకు పెరిగింది.

# గుంటూరు జిల్లా ముఖచిత్రం

ముంకా శివసాంబిరెడ్డి, గుంటూరు

పులిచింతల ప్రాజెక్టు నిర్మాణం పనులు పునఃప్రారంభం, ఏనగా తెనాలి ఎం.పి., ఇల్లు పేల్చివేత, జాడలేని రుతుపవనాలు, ...కాని సాగర్ డెల్టా, ఖరీఫ్‌లో తీవ్రం కానున్న పరపతి సమస్య, ...లీ బి.టి.లతో రైతు లూటీ ఇదీ ఈ మాసం గుంటూరు జిల్లా ...ఖచిత్ర విశేషాలు.

కృష్ణా డెల్టా రైతుల చిరకాల స్వప్నం పులిచింతల ప్రాజెక్టు ...ణం పనులు పునఃప్రారంభమయ్యాయి. రాష్ట్ర ప్రభుత్వం అత్యంత ...ష్టాత్మకంగా తీసుకున్న జలయజ్ఞంలో భాగంగా గతంలో రాష్ట్ర ...ఖ్యమంత్రి శంకుస్థాపన చేసి, వెంటనే పనులు ప్రారంభించాలని ...యించారు. అయితే అవసరమైన పర్యావరణ అనుమతి పొందిన ...వాతనే నిర్మాణం చేపట్టాలని న్యాయస్థానం ఆదేశించడంతో, ...ష్టాత్మకంగా భావించిన రాష్ట్ర ప్రభుత్వం అవసరమైన అనుమతులు ...ది జూన్ 12న నల్గొండ జిల్లా మేళ్ళ చెరువు మండలంలోని విజినెపల్లి ... పూజా కార్యక్రమాలు నిర్వహించి పనులకు శ్రీకారం చుట్టిన కొద్ది ...టలలోనే గుంటూరు జిల్లా పిడుగురాళ్ళ ప్రాంతంలోని ...ర్జంపాడులో ఉన్న తెనాలి ఎం.పి. వల్లభనేని బాలశౌరి గృహాన్ని ...వోయిస్టులు పేల్చివేశారు.

జూన్ గడుస్తున్నా రుతుపవనాలు ఎక్కడ ఆగిపోయాయో ...తుపట్టక అన్నదాతలు ఆందోళన పడుతున్నారు. జిల్లాలో ఎక్కడా ...మి పదునయ్యే స్థాయిలో వర్షాలు పడలేదు. ఖరీఫ్‌లో జిల్లాలో ...ఖ్యంగా వరి, పత్తి, మిర్చి, కంది పంటలు సాగు చేస్తున్నారు. ...గార్జునసాగర్ కుడికాల్వ, కృష్ణా పశ్చిమ డెల్టా, గుంటూరు ఛానల్, ...వులు, ఎత్తిపోతల పథకాల బోర్‌వెల్స్ ప్రధాన నీటి వనరులుగా ...న్నాయి. నిరుడు ఖరీఫ్‌లో మొత్తం 5,86, 833 హెక్టార్లలో పంటలు ...గయ్యాయి. సాధారణ పరిస్థితులు వుంటే జిల్లాలో 6,11,924 ...క్టార్లలో పంటలు సాగవుతాయని అంచనా. ప్రాజెక్టుల ద్వారా నీటి ...పదల నిలిచిపోతే కనీసం 5,45,911 హెక్టార్లలో సాగవుతాయి.

ఎన్.ఎస్.పి.లింగంగుంట్ల సర్కిల్ పరిధిలో మరమ్మతు పనుల ...సం 12 కోట్ల రూపాయలను రాష్ట్ర ప్రభుత్వం విడుదల చేసింది. ఈ ...త్తంతో 85 పనులను చేపట్టాలని అధికారులు నిర్ణయించారు. జులై ...0వ తేదీ నాటికల్లా పనులు పూర్తి చేస్తామని అధికార యంత్రంగా ...బుతున్నప్పటికీ ఆచరణలో ఎంతవరకు జరుగుతాయనేది ప్రశ్నార్థకమే. ...త కొన్నేళ్ళుగా కృష్ణా, పశ్చిమ డెల్టా కాల్వ వ్యవస్థ రూపురేఖలు ...ల్పోయింది. దీని వలన దిగువ భూములకు నీరందడంలో తీవ్ర ...ప్యం జరుగుతుంది. కొమ్మిమూరు కెనాల్, రేపల్లె బ్యాంక్ కెనాల్ ...ంద పశ్చిమ డెల్టాలో మూడొంతులు పైగా ఈ రెండు ప్రధాన కాల్వల ...నే ఆధారపడి వుంది. కొమ్మమూరు కెనాల్ క్రింద గుంటూరు, ప్రకాశం ...ల్లాలో 2.50 లక్షల ఎకరాల పైగా ఆయకట్టు వుండగా, రేపల్లె బ్యాంక్ ...నాల్ క్రింద లక్షన్నర ఎకరాల భూమి సాగతున్నాయి. కొమ్మమూరు ...నాల్ డిజైన్ సామర్థ్యం మూడువేల క్యూసెక్కులు ఉన్నప్పటికీ 2500 ...్యూసెక్కులు దాటితేనే కట్టలు ఒరుసుకొని నీరు ప్రవహిస్తుంటుంది. రేపల్లె బ్యాంక్ కెనాల్ 2200 క్యూసెక్కులు సామర్థ్యం కాగా 1600 క్యూసెక్కులు మించి ఇవ్వడం సాధ్యపడటం లేదు. నల్లమడ డ్రైయిన్‌పై జరుగుతున్న మరమ్మతులు రైతాంగానికి ప్రయోజనం చేకూరేలా లేవని, డ్రెయిన్ వంకను సరిచేయాలని రైతులు కోరుతున్నారు. కొమ్మమూరు కాలువ మీద కట్టలు చాలా బలహీనంగా ఉన్నాయి. దీనివలన సాగునీరు వదిలిన తరువాత గండ్లుపడే అవకాశం వుందంటున్నారు.

పెరిగిన బి.టి. విత్తనాల ధరలు రైతుకు అందని ద్రాక్షగా మారాయి. ఎకరాకు రూ. 1800 పైగా వెచ్చించి కంపెనీ బి.టి. విత్తనాలు కొనడమంటే సామాన్య రైతుకు భారం అన్నదాత అవసరాన్ని ఆసరా చేసుకొని పలువురు విత్తన షాపుల వారే నకిలీ వ్యాపారం లోకి దిగుతున్నారని ఆరోపణలు వెల్లువెత్తుతున్నాయి. సత్తెనపల్లి, పెదకూరపాడు, గురజాల నియోజకవర్గాలలో నకిలీ బి.టి. విత్తనాల అమ్మకాలు జోరుగా సాగుతున్నాయి. క్వింటాన్నర మిర్చి అమ్ముకుంటే గానీ ఎకరాకు సరిపడా 450 గ్రాముల బి.టి. విత్తనాలు రావడం లేదంటున్నారు. వ్యవసాయ శాఖ తనిఖీలు లేకపోవడానికి సిబ్బంది కొరత అంటున్నారు. జిల్లాలో 109 గ్రామ విస్తరణాధికారుల పోస్టులు సుమారు 10 సంవత్సరాల నుండి ఖాళీగా ఉన్నాయి. ఎ.ఓ., ఎ.డి. ల పోస్టులను కూడా వెంటనే భర్తీ చేయలేదు.

జిల్లాలో మొత్తం 288 సొసైటీలలో 32 సొసైటీలు మాత్రమే లాభాలలో వున్నాయని, 199 సొసైటీలలో 89 సొసైటీలు రద్దయ్యే పరిస్థితి వుండటంతో ఖరీఫ్‌లో పరపతి సమస్య తీవ్రం కానుంది. గత సంవత్సరం సహకార రుణాలను రీ షెడ్యూలు చేయలేదు. 2004-2005లో రైతులకు 250 కోట్లు రుణాలు ఇవ్వాల్సిన డి.సి.సి.బి. కేవలం 150 కోట్లు మాత్రమే ఇచ్చింది. అది కూడా బుక్ ఎడ్జెస్ట్‌మెంటే కాని రైతులకు వాస్తవంగా రుణాలిచ్చింది లేదు. గత 10 సంవత్సరాలలో నాలుగు సార్లు సహకార రుణాలను రీషెడ్యులు చేశారు. ఈ సంవత్సరం 1200 కోట్ల వ్యవసాయ రుణాలివ్వాలని లీడ్ బ్యాంక్ ప్రణాళిక తయారు చేసింది. గత సంవత్సరం రు. 1150 కోట్ల వ్యవసాయ రుణాలు ఇవ్వగా గత సంవత్సరం కంటే కేవలం 50 కోట్ల రూపాయలను మాత్రమే పెంచడం ఆందోళన కలిగిస్తుంది.

---

( 34 వ పేజీ తరువాయి)

సంస్థలకు వాటిని అప్పగించాలని కోరుతున్నాయి. అంటే ఆ పేరుతో మొత్తం భూములను తామే కొట్టివేయాలన్న ఎత్తుగడతో పాటు మత భావాలు రెచ్చగొట్టి రాజకీయలబ్ధి పొందాలన్న దుష్టాలోచన కూడా ఉంది. ఎన్నో మఠాల పేరుతో ఉన్న భూములను వాటి అధిపతులుగా ఉన్న పెద్దలు ఎలా దుర్వినియోగం చేసిందీ రాయాలంటే మహాభారతం అంత అవుతుంది. అవినీతికి యోగులు, భోగులకు పెద్ద తేడాలేదని అనేక ఉదంతాలు వెల్లడించాయి.

అందువలన ఈ భూముల వ్యవహారంలో ప్రభుత్వం రైతు, వ్యవసాయకార్మిక సంఘాలను, ఆయా గ్రామ పౌరులను విశ్వాసంలోకి తీసుకొని నిజంగా సాగుదార్లెవరు? అవి వారి చేతిలో ఉన్నాయా? బినామీగా ఉన్నాయా అని ముందు నిగ్గుతేల్చాలి. సాగుభూములుగా ఉన్నవెన్ని, వాణిజ్య ప్రయోజనాలకు అనువైనవి ఏవో తేల్చాలి. సాగుభూములలో పేదరైతులు ఉంటే వారిని తొలగించకుండా వాటిని వారికే అప్పగించాలి. భూస్వాములుంటే వారిని తొలగించి పేదలకు ఉచితంగా పంచాలి. అదే ధనికుల చేతిలో ఉంటే నేరుగా ప్రభుత్వం స్వాధీనం చేసుకొని ఇండ్లు లేని వారికి ఇండ్ల స్థలాలను, ఇతర ప్రజోపయోగ కార్యకలాపాలకు వినియోగించటం సముచితంగా ఉంటుంది.

# రాష్ట్రంలో 2004 సంవత్సరంలో ఆత్మహత్య చేసుకున్న రైతుల వివరా

జూన్ సంచిక తరువాయి

| క్రసం. | పేరు | వయస్సు | గ్రామం | మండలం | జిల్లా | తేది |
|---|---|---|---|---|---|---|
| 1511 | నాగన్న | 55 | అలంపూర్ | అలంపూర్ | మ.నగర్ | 〃 |
| 1512 | సంద శంకరయ్య | 40 | రాయికల్ | ఫరూఖ్‌నగర్ | మ.నగర్ | 〃 |
| 1513 | సూర ముత్యాలు | 48 | రాజిపేట | పరకాల | వరంగల్ | 〃 |
| 1514 | చెన్నూరు వెంకన్న | 32 | పున్నులు | వర్ధన్నపేట | వరంగల్ | 〃 |
| 1515 | మేక మల్లేషం | 28 | గాగిల్లాపురం | వర్ధన్నపేట | వరంగల్ | 〃 |
| 1516 | ఏసప్ప | 38 | రొంపల్లి | బంట్వారం | రంగారెడ్డి | 15-11-200 |
| 1517 | మరియమ్మ | 28 | సాలివుకిపూర్ | బొమ్మరాస్‌పేట | మ.నగర్ | 〃 |
| 1518 | బోతు బిచ్యా | 35 | తాట్యాతండా | కురవి | వరంగల్ | 16-11-200 |
| 1519 | తక్కనేటి లింగయ్య | 50 | ముషంపల్లి | నల్గొండ | నల్గొండ | 〃 |
| 1520 | దర్శి వెంకటరావు | 52 | పెదకూరపాడు | పెదకూరపాడు | గుంటూరు | 〃 |
| 1521 | జాతోతు బిచ్యా | 35 | తాట్యాతండా | కురవి | వరంగల్ | 〃 |
| 1522 | తార్‌సింగ్ | 30 | చిన్న ఆదిరాల | జడ్చర్ల | మ.నగర్ | 〃 |
| 1523 | వద్యావత్ దేవుజా | 30 | చటాన్‌పల్లి | ఫరూఖ్‌నగర్ | మ.నగర్ | 〃 |
| 1524 | యాదగిరి | 30 | కోట్యాల | ములుగు | మెదక్ | 〃 |
| 1525 | మామిళ్ల మల్లయ్య | 40 | నాగసముద్రం | ధారూరు | రంగారెడ్డి | 〃 |
| 1526 | నక్క భూమయ్య | 65 | కందికట్కూర్ | ఇల్లలకుంట | కరీంనగర్ | 〃 |
| 1527 | పోలం చిన్నయ్య | 40 | పెదగపల్లి | మహాముత్తారం | కరీంనగర్ | 〃 |
| 1528 | ఎర్రపోచయ్య | 50 | వదల్‌పర్తి | నాగిరెడ్డిపేట | నిజామాబాద్ | 17-11-2004 |
| 1529 | ఎంబరి సాందన్న | 28 | చింతరాజ్‌పల్లి | నందిపేట | నిజామాబాద్ | 〃 |
| 1530 | బొట్ల లక్ష్మయ్య | 45 | రాజిపేట | పరకాల | వరంగల్ | 〃 |
| 1531 | ఆలా హనుమంతరావు | | అనుపాలెం | రాజుపాలెం | గుంటూరు | 〃 |
| 1532 | రెడ్డిపల్లి దుర్గారెడ్డి | 34 | బీబీపేట | కల్హేర్ | మెదక్ | 〃 |
| 1533 | బ్యాగరి శంకరయ్య | 35 | కొండాపూర్ | మిర్‌దొడ్డి | మెదక్ | 〃 |
| 1534 | అబ్దుల్ రహీం | 53 | ఓల | కుంటాల | ఆదిలాబాద్ | 20-11-2004 |
| 1535 | కోటిరెడ్డి దిలీప్‌రెడ్డి | 30 | కొత్తూర్ | తలమడుగు | ఆదిలాబాద్ | 〃 |
| 1536 | వడ్డె సుంకన్న | 30 | పెద్దకొట్టాలపల్లి | విడపనకల్లు | అనంతపురం | 〃 |
| 1537 | చింతల వెంకటరెడ్డి | 38 | దత్తాయిపల్లి | తుర్కపల్లి | నల్గొండ | 〃 |
| 1538 | ఈర్ల సత్యన్నారాయణ | 35 | | కూచన్‌పల్లి | మెదక్ | 〃 |
| 1539 | సి కురవ వెంకటేశ్వర్లు | | నాగలూటి | మిడతూరు | కర్నూలు | 〃 |
| 1540 | సవారన్న | 50 | దాసరిపల్లి | మల్దకల్ | మ.నగర్ | 〃 |
| 1541 | కె శ్రీహరి రావు | 42 | ఉప్పలపాడు | అద్దంకి | ప్రకాశం | 21-11-2004 |
| 1542 | నున్‌సావత్ రవి | 30 | పేట్‌సంగెం | గాంధారి | నిజామబాద్ | 〃 |
| 1543 | లాగా వెంకయ్య | 50 | లోయపల్లి | వెల్దుర్తి | గుంటూరు | 22-11-2004 |
| 1544 | జంగ రాజిరెడ్డి | 28 | ఖాజిపల్లి | ముత్తారం | కరీంనగర్ | 〃 |
| 1545 | మాణయ్య | 33 | బొబ్బిలిగామ | సదాశివపేట | మెదక్ | 〃 |
| 1546 | గోపతి వెంకటేశ్వర్లు | 40 | తోణాదుల | మార్టూరు | ప్రకాశం | 〃 |
| 1547 | శంకర్ | 50 | లాండసాంగ్వి | | ఆదిలాబాద్ | 〃 |
| 1548 | దేశబోయిన శ్రీనివాస్ | 30 | వావిలాల | నెల్లికుదురు | వరంగల్ | 〃 |
| 1549 | చిన్నయ్య | 35 | కౌనాపల్లి | కోయిలకొండ | మ.నగర్ | 〃 |
| 1550 | మద్ది భాస్కర్ | 25 | వెంకటాపుర్ | జగదేవ్‌పూర్ | మెదక్ | 23-11-2004 |
| 1551 | మందలపు సుబ్బయ్య | 55 | కడపరాజుపల్లి | పెద్ద దోర్నాల | ప్రకాశం | 〃 |
| 1552 | యలమద్ది సీతారామయ్య | 45 | | ముదిగొండ | ఖమ్మం | 〃 |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 553 | తెల్లబోయిన దుర్గయ్య | 35 | కొండవనమాల | కొణిజర్ల | ఖమ్మం | 23-11-2004 |
| 554 | భవనం పెద్దకోటిరెడ్డి | 62 | కొత్తరెడ్డిపాలెం | చేబ్రోలు | గుంటూరు | ॥ |
| 555 | బోళ్ల బిక్షపతి | 30 | మల్లారెడ్డిపల్లి | హసన్‌పర్తి | వరంగల్ | ॥ |
| 556 | కత్తుల రాజు | 35 | ఇప్పగూడెం | ఘనపూర్ (స్టే) | వరంగల్ | ॥ |
| 557 | నాంపల్లి మల్లయ్య | 50 | తిర్మాలాయపూరం | రామడుగు | కరీంనగర్ | 24-11-2004 |
| 558 | లక్ష్మీనారాయణ రెడ్డి | 46 | నిట్టూరు | యాడికి | అనంతపురం | ॥ |
| 559 | జాదవ్ గన్నాజీ | 40 | కుప్పి | సారంగాపూర్ | ఆదిలాబాద్ | ॥ |
| 560 | గంగాల రమేష్ | 28 | చిట్టాపూర్ | దుబ్బాక | మెదక్ | ॥ |
| 561 | కడిపూడి సంజీవుడు | 52 | తుమ్మరాజుపల్లి | పాణ్యం | కర్నూలు | ॥ |
| 562 | కోట్ల శ్రీనివాస రెడ్డి | 30 | నెల్లకల్ | పెదవూర | నల్గొండ | ॥ |
| 563 | ఉయ్యాల లింగయ్య | 43 | నర్సింహులుగూడెం | మునగాల | నల్గొండ | 25-11-2004 |
| 564 | దేవి నర్సయ్య | 43 | నంనూరు | మంచిర్యాల | ఆదిలాబాద్ | ॥ |
| 565 | కనిగిరి గంగారాం | 38 | దామరంచ | బార్కూర్ | నిజామాబాద్ | ॥ |
| 566 | బుర్ర లక్ష్మణ్‌గౌడ్ | 33 | తిమ్మాపూర్ | శివ్వంపేట | మెదక్ | ॥ |
| 567 | బండాకి పెద్దముత్తయ్య | 35 | నాచారం | మల్హర్ | కరీంనగర్ | ॥ |
| 568 | గోరంట్ల రవి | 38 | తిమ్మాపురం | యడ్లపాడు | గుంటూరు | ॥ |
| 569 | నూన్యావత్ హరి | 40 | గొల్లగూడెం తండా | సంగారెడ్డి | మెదక్ | ॥ |
| 570 | మన్నె లక్ష్మయ్య | 38 | అడివిలింగాల | ఎల్లారెడ్డి | నిజామబాద్ | ॥ |
| 571 | మల్లీశ్వరి | 30 | కంభంపాడు | అనంతసాగరం | నెల్లూరు | 26-11-2004 |
| 572 | పర్వతపల్లి నర్సిరెడ్డి | 35 | ఇందనూర్ | కొడంగల్ | మ.నగర్ | ॥ |
| 573 | రమావత్ బన్నీ | 45 | చిలకుర్తి | పెద్దవూర | నల్గొండ | 27-11-2004 |
| 574 | పోచయ్య | 50 | బేగంపేట | కమాన్‌పూర్ | కరీంనగర్ | ॥ |
| 575 | కాపర్తి ఖాసిం | 35 | రఘునాధపల్లి | మఠంపల్లి | నల్గొండ | ॥ |
| 576 | దాం మారయ్య | 35 | కొంపెల్లి | మనుగోడు | నల్లగొండ | 28-11-2004 |
| 577 | బొమ్మగల్ల రాజయ్య | 50 | జప్తి సింగాయపల్లి | ములుగు | మెదక్ | ॥ |
| 578 | కందుల శ్రీరామరెడ్డి | 28 | మేరిగపూడి | ఫిరంగిపురం | గుంటూరు | 29-11-2004 |
| 579 | వీరబోయిన అయిలయ్య | 28 | రామన్నగూడెం | ఆత్మకూర్(ఎస్) | నల్లగొండ | ॥ |
| 580 | రేవూనూరి రామయ్య | 55 | ఎల్లారెడ్డిపేట | తొగుట | మెదక్ | ॥ |
| 581 | నాగవ్వ | 40 | బావుసాయిపేట | కోనరావుపేట | కరీంనగర్ | ॥ |
| 582 | ఇస్తాపల్లి నర్సయ్య | 48 | నారాయణపేట | జక్రాన్‌పల్లి | నిజామాబాద్ | ॥ |
| 583 | ఇనుమల్ల పోచయ్య | 45 | చిట్యాల | చేర్యాల | వరంగల్ | ॥ |
| 584 | అక్కినపల్లి రాంచంద్రారెడ్డి | 40 | రాంసాగర్ | చేర్యాల | వరంగల్ | 30-11-2004 |
| 585 | బోయ సాయిలు | 32 | నందిపేట | అడ్డాకుల | మ.నగర్ | ॥ |
| 586 | సందిపర్తి సత్తిబాబు | 35 | వి శరభవరం | రోలుగుంట | విశాఖ | 01-12-2004 |
| 587 | మామిడిశెట్టి గోపాలం | 55 | నరసాపురం | నరసాపురం | ప.గోదావరి | ॥ |
| 588 | దూదేకుల రంగప్ప | 60 | తోడేండ్లపల్లి | చాగలమర్రి | కర్నూలు | 02-12-2004 |
| 589 | ఈరెడ్డి చంద్రారెడ్డి | 30 | మైలారం | రాయపర్తి | వరంగల్ | ॥ |
| 590 | మార్గం భూమయ్య | 45 | మెంగారం | లింగంపేట | నిజామాబాద్ | ॥ |
| 591 | గురజాల శ్రీనివాసరావు | 32 | కంకణాలపల్లి | సత్తెనపల్లి | గుంటూరు | 03-12-2004 |
| 592 | ఉప్పరి అశోక్ | 35 | బిల్కల్ | మర్పల్లి | రంగారెడ్డి | ॥ |
| 593 | కుర్మని పాపయ్య | 35 | పొట్టిపల్లి | సదాశివపేట | మెదక్ | ॥ |
| 594 | బండి అయిలయ్య | 37 | రేగొండ | రేగొండ | వరంగల్ | ॥ |
| 595 | గుండ చంద్రాకర్ రెడ్డి | 27 | పరకాల | పరకాల | వరంగల్ | ॥ |
| 596 | అయిలు రాజయ్య | 55 | మాచినపల్లి | జమ్మికుంట | కరీంనగర్ | ॥ |
| 597 | దుమాల కుర్మిపెద్దబోజన్న | 32 | నిజాంపూర్ | నవీపేట | నిజామాబాద్ | 04-12-2004 |
| 598 | రామిరెడ్డి నర్సిరెడ్డి | 45 | కొమ్మల | అర్వపల్లి | నల్లగొండ | ॥ |
| 599 | ఎర్రసాని యోహాన్ | 40 | వెలవర్తిపాడు | కొండూరు | గుంటూరు | ॥1600 కుర్వ |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| | ఆంజనేయులు | 55 | మద్దలబండ | మల్దకల్ | మ.నగర్ | 04-12-2004 |
| 1601 | జడ అయిలయ్య | 35 | పోతారం(జె) | హుస్నాబాద్ | కరీంనగర్ | " |
| 1602 | జడ లక్ష్మి | 28 | పోతారం(జె) | హుస్నాబాద్ | కరీంనగర్ | " |
| 1603 | నోముల మారయ్య యాదవ్ | 42 | శివన్నగూడెం | మర్రిగూడ | నల్లగొండ | 05-12-2004 |
| 1604 | చాకలి వెంకయ్య | 45 | తిమ్మాపూర్ | రేగోడు | మెదక్ | " |
| 1605 | ఒడ్డె నర్సింహులు | 45 | చింతకుంట | ధారూర్ | రంగారెడ్డి | " |
| 1606 | కుంచాల సోమయ్య | 26 | ఇనుగుర్తి | కేసముద్రం | వరంగల్ | 06-12-2004 |
| 1607 | కుంచాల ధనమ్మ | 24 | ఇనుగుర్తి | కేసముద్రం | వరంగల్ | " |
| 1608 | బోడ మంగ్యా | 40 | బేరువాడ శివారు | కేసముద్రం | వరంగల్ | " |
| 1609 | ఏకుల రాజయ్య | 45 | గోపరపల్లి | ఓదెల | కరీంనగర్ | " |
| 1610 | పతివాడ పైడారావు | 50 | గంగోలు | దుమ్ముగూడెం | ఖమ్మం | " |
| 1611 | మద్ది బాల్‌రెడ్డి | 45 | మద్దివానిగూడెం | బి.పోచంపల్లి | నల్లగొండ | 07-12-2004 |
| 1612 | పొత్తూరు చంద్రశేఖర్‌నాయుడు | 38 | క్రిష్టాపురం | యల్లనూరు | అనంతపురం | 09-12-2004 |
| 1613 | అట్నాల భూమయ్య | 25 | చందూర్ | వర్ని | నిజామాబాద్ | " |
| 1614 | మర్రవల్లి అంజిరెడ్డి | 32 | మల్లారెడ్డిపల్లి | వర్గల్ | మెదక్ | " |
| 1615 | గుద్దుల రాజయ్య | 55 | అల్మాస్‌పూర్ | ఎల్లారెడ్డిపేట | కరీంనగర్ | " |
| 1616 | కంకనాల మల్లయ్య | 40 | పూసాల | సుల్తానాబాద్ | కరీంనగర్ | " |
| 1617 | చల్లగొండ కృష్ణమూర్తి | 38 | పెద్దబీరవల్లి | బోనకల్ | ఖమ్మం | " |
| 1618 | అర్షం నర్సయ్య | 45 | నారుకుల్ల | ఆత్మకూరు | వరంగల్ | " |
| 1619 | భూక్యా లచ్చా | 45 | బుంగ్యాతండా | ఆత్మకూరు | వరంగల్ | " |
| 1620 | ధీరావత్ ధశరధ | 25 | లక్ష్మీతండా | బొమ్మలరామారం | నల్లగొండ | 10-12-2004 |
| 1621 | అన్నమెల ఆంజనేయులు | 34 | కొండాపూర్ | రేగోడ్ | మెదక్ | " |
| 1622 | లింగయ్య గౌడ్ | 50 | కొండనాగుల | బల్మూర్ | మ.నగర్ | " |
| 1623 | ఎర్రం నాంపల్లి | 50 | రామన్నపేట | కోనరావుపేట | కరీంనగర్ | " |
| 1624 | తూడి మల్లమ్మ | 40 | చర్లపల్లి | గంగాధర | కరీంనగర్ | " |
| 1625 | హరిదాస్ మాలి | 42 | రవీంద్రనగర్ | కౌతాల | ఆదిలాబాద్ | " |
| 1626 | కుర్నాపల్లి లింగం | 29 | అమ్దాపూర్ | బోధన్ | నిజామాబాద్ | 11-12-2004 |
| 1627 | అంబర్‌సింగ్ | 26 | గన్నారం | బోధన్ | నిజామాబాద్ | " |
| 1628 | లకావత్ బాబు | 28 | కె.వి శివారు | గంగాధర | వరంగల్ | " |
| 1629 | గొల్లబద్ద నాగయ్య | 46 | చందాపురం | వనపర్తి | మ.నగర్ | " |
| 1630 | సంగిరెడ్డి మల్లారెడ్డి | 50 | వంతర్పుల | ఇల్లంతకుంట | కరీంనగర్ | 13-12-2004 |
| 1631 | కె మల్లిఖార్జున రెడ్డి | 38 | చట్లమిట్ట | పెదారవీడు | ప్రకాశం | " |
| 1632 | ఆడెపు చిన్నయ్య | 35 | ఉండెడ | వెల్లటూరు | కరీంనగర్ | 14-12-2004 |
| 1633 | బొమ్మనవేని రామయ్య | 50 | బస్వాపూర్ | కొహెడ | కరీంనగర్ | " |
| 1634 | బత్తుల తిరుపతి | 20 | గొడిశాల | సైదాపూర్ | కరీంనగర్ | " |
| 1635 | గుర్వయ్య పెద్దబోయిన | 32 | అన్నారిగూడెం | మోతె | నల్లగొండ | " |
| 1636 | బి వెంకట రామయ్య | 49 | చిన్నప్పనాయ్డుపేట | పెల్లకూరు | నెల్లూరు | " |
| 1637 | కృష్ణాగౌడ్ | 45 | అనంతసాగర్ | చేగుంట | మెదక్ | " |
| 1638 | కటుమూరి సన్నిబాబు | 50 | వెదురుపర్తి | కశింకోట | విశాఖ | 15-12-2004 |
| 1639 | బోయ తిప్పస్వామి | 55 | పర్లచౌడు | నిట్టూరు | అనంతపురం | " |
| 1640 | కుమ్మరి లక్ష్మయ్య | 60 | నందిగామ | పటాన్‌చెరు | మెదక్ | 16-12-2004 |
| 1641 | తమ్మా అంజిరెడ్డి | 50 | కొగంటివారిపాలెం | అచ్చంపేట | గుంటూరు | " |
| 1642 | అరిగెల నల్లయ్య | 55 | సి.నాయుడుపేట | పెళ్లకూరు | నెల్లూరు | " |
| 1643 | బెల్లంకొండ భిక్షమయ్య | 38 | ఊట్కూరు | శాలిగౌరారం | నల్లగొండ | " |
| 1644 | బర్ల దశరధం | 30 | హరిజనవాడ | బూర్గుంపాడు | ఖమ్మం | 17-12-2004 |
| 1645 | చిల్లకపల్లి నర్సింహారెడ్డి | | తేర్పోల్ | కొండాపూర్ | మెదక్ | " |
| 1646 | చాగంటి కుమారస్వామి | 35 | నల్లబెల్లి | నల్లబెల్లి | వరంగల్ | " |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 647 | కర్రోల్ల పాపన్న | 38 | దివలాపూర్ | దివలాపూర్ | ఆదిలాబాద్ | 18-12-2004 |
| 648 | పులపాక ఆంజనేయులు | 35 | చొప్పరామన్నపాలెం | కొయ్యలగూడెం | ప.గోదావరి | " |
| 649 | పర్శగౌడ్ | 24 | రాంపూర్ | రామాయంపేట | మెదక్ | " |
| 650 | ధి వెంకట రెడ్డి | 53 | ఎన్.వి గూడెం | నిడమానూర్ | నల్లగొండ | " |
| 651 | పోగు వీరాస్వామి | 35 | కొడవటంచ | రేగొండ | వరంగల్ | " |
| 652 | బైరి మల్లయ్య | 55 | ఉనికిచర్ల | ధర్మాసాగర్ | వరంగల్ | " |
| 653 | జానెబోయిన లవుడు | 25 | షేర్‌మహ్మద్‌పేట్ | జగ్గయ్యపేట్ | కృష్ణ | " |
| 654 | గొల్ల బలరాం | 35 | మేడిపల్లి | ఆత్మకూరు | మ.నగర్ | " |
| 655 | బూరె సూరప్ప | 30 | కనుకుంట్ల | తాడిమర్రి | అనంతపురం | 20-12-2004 |
| 656 | కంబాలపల్లి సుధాకర్ | 26 | అయిటిపాముల | కట్టంగూర్ | నల్లగొండ | " |
| 657 | నేనావత్ పెద్ద హనుమ | 48 | మొల్కచర్ల | దామరచర్ల | నల్గొండ | " |
| 658 | పరిశ వెంకటేశ్వర రావు | 50 | కనుమూరు | గంపలగూడెం | కృష్ణ | " |
| 659 | బోలగోని బొడ్డయ్య | 50 | మాడ్గులపల్లి | తిప్పర్తి | నల్గొండ | " |
| 660 | కాశని పోశెట్టి | 50 | అనుకుంట | ఆదిలాబాద్ | ఆదిలాబాద్ | 21-12-2004 |
| 661 | గొల్ల కొమురయ్య | 36 | రాచారం | గజ్వేల్ | మెదక్ | " |
| 662 | వెంకటముని | 60 | చెన్నుపాటిపల్లి | పులిచర్ల | చిత్తూరు | " |
| 663 | ఎలమంచి రమణ బాబు | 32 | కొంగశింగి | గొలుగొండ | విశాఖ | " |
| 664 | పోలిగాని అంజయ్య | 35 | ఉప్పలపాడు | వెల్దుర్తి | గుంటూరు | " |
| 665 | రౌదావత్ కేశ్యానాయక్ | 50 | కోడ్గల్ | జడ్చర్ల | మ.నగర్ | 23-12-2004 |
| 666 | మన్నె రాములు | 36 | ఐలాపూర్ | పటాన్‌చెరు | మెదక్ | " |
| 667 | గాడిచర్ల మల్లయ్య | 23 | చిప్పలపల్లి | ముస్తాబాద్ | కరీంనగర్ | 24-12-2004 |
| 668 | ననుమాల లక్ష్మణరావు | 45 | వెల్ది | మానకొండూర్ | కరీంనగర్ | 25-12-2004 |
| 669 | వడ్ల యాదయ్య | 35 | కొడిపల్లి | కొడిపల్లి | మెదక్ | " |
| 670 | అంబటి చిన్న వెంకన్న | 38 | వల్లభాపురం | నకిరేకల్లు | నల్గొండ | " |
| 671 | కొరిమి వీరయ్య | 48 | పెర్కకొండారం | శాలిగౌరారం | నల్గొండ | 26-12-2004 |
| 672 | కొరిమి మంగమ్మ | 40 | పెర్కకొండారం | శాలిగౌరారం | నల్గొండ | " |
| 673 | గగులావత్ వసంతనాయక్ | 36 | ధర్మాజీపేట్ | రాయికల్ | కరీంనగర్ | " |
| 674 | పొన్నెబోయిన లక్ష్మయ్య | 37 | నారాయణపురం | బచ్చన్నపేట్ | వరంగల్ | " |
| 675 | కేతావత్ పెరుమాళ్ | 42 | శంకోరా | వర్ని | నిజామాబాద్ | " |
| 676 | మాలవత్ బద్రు | 40 | తూంపల్లి | సిరికొండ | నిజామాబాద్ | " |
| 677 | ఇట్టిబోయిన దుర్గమ్మ | 45 | తక్కెళ్లపాడు | మిర్యాలగూడ | నల్గొంగ | " |
| 678 | వెల్దండ అంజిరెడ్డి | 50 | తిరుమలగిరి | తొగుట | మెదక్ | " |
| 679 | ఇస్లావత్ శ్రీరాం | 30 | నిమ్మలపల్లి | కోనరావుపేట | కరీంనగర్ | " |
| 680 | మంచర్ల మాన్య | 60 | రామన్నగూడంతండా | పెద్దవూర | నల్గొండ | 28-12-2004 |
| 681 | కె అమర లింగయ్య | 24 | గంగిరెడ్డిపాలెం | మాచవరం | గుంటూరు | " |
| 682 | లక్కాకుల గంగన్న | 50 | పిప్రినైని | ఆర్మూర్ | నిజామాబాద్ | 29-12-2004 |
| 683 | జి వి లక్ష్మీనారాయణ | | లింగాపూర్ | నవీపేట్ | నిజామాబాద్ | " |
| 684 | ఆకుల సాంబయ్య | | ద్వారకాపేట | నర్సంపేట్ | వరంగల& | " |
| 685 | జీడికంటి యాదమ్మ | 38 | ధర్మారం | మద్దూరు | వరంగల్ | 30-12-2004 |
| 686 | అనంతయ్య | 36 | అలెడ్ | కొండగల్ | మ.నగర్ | " |
| 687 | టి దేవేందర్ రెడ్డి | 35 | ఫరీద్‌పేట్ | మాచారెడ్డి | నిజామాబాద్ | " |
| 688 | వి నరసింహారావు | 40 | మంచికల్లు | రెంటచింతల | గుంటూరు | " |
| 689 | కొత్తూరు చెన్నయ్య | 40 | అంతారం | షాబాద్ | రంగారెడ్డి | 31-12-2004 |
| 690 | కాట్రావత్ ధర్మా | 32 | బొల్లేనపల్లి | డిండి | నల్గొండ | " |
| 691 | దేవిలాల్ | 45. | వెల్లుట్ల తండా | ఎల్లారెడ్డి | నిజామాబాద్ | " |




## పప్పుదినుసులకు ప్రోత్సాహం

2005-06 సంవత్సరానికి విత్తన విధానాన్ని రాష్ట్ర ప్రభుత్వాన్ని ప్రకటించింది. వాణిజ్య పంటలతో నష్టపోతున్న రైతులను ఆదుకోవడానికి పప్పుదినుసుల సాగు పెంచడానికి అదనపు మద్దతు ధరలను ప్రకటించింది. అలాగే విత్తనాల సబ్సిడీని కూడా ఇస్తోంది. ఇలా పంటమార్పిడిని సుమారు 15లక్షల ఎకరాల్లో చేయాలని ప్రభుత్వం భావిస్తోంది. జొన్న, సజ్జ,రాగులకు కేంద్రం ప్రకటించిన మద్దతు ధరకు అదనంగా 25రూపాయలు, కందులకు రు.100లు చెల్లించాలని ప్రభుత్వం ప్రకటించింది.

విత్తనాల. సబ్సిడీ విషయానికి వస్తే సోయాబీన్ క్వింటాల్‌కు రు.700లు, ఆముదం విత్తనాలకు రు.600లు వంతున సబ్సిడీ ఇస్తుంది. మిగిలిన పంటలకు 33.33 శాతం సబ్సిడీగా ఇవ్వాలని నిర్ణయించింది. విత్తనాల కోసం మొత్తం 109 కోట్ల 54 లక్షల రూపాయలను కేటాయించారు. ఈ ఆర్థిక సంవత్సరానికి మొత్తం 38.76 లక్షల క్వింటాళ్లకు గాను ప్రభుత్వం 13.45లక్షల క్వింటాళ్లను సిద్దంగా వుంచుతోంది.

## వ్యవసాయ ప్రణాళిక

రాష్ట్ర వ్యవసాయశాఖ 2005-06 సంవత్సరానికి వ్యవసాయ ప్రణాళికను విడుదల చేసింది. 165 లక్షల టన్నుల ఆహార ధాన్యాలను ఉత్పత్తి చేయాలని లక్ష్యంగా నిర్దేశించారు. గత ఏడాది వ్యవసాయ శాఖకు 175 కోట్ల రూపాయల బడ్జెట్ వుండగా దాన్ని ప్రస్తుతం పెంచి 373 కోట్లకు పెంచారు. ఖరీఫ్ విస్తీర్ణాన్ని 78 లక్షల హెక్టర్ల నుండి 81 లక్షల హెక్టార్లకు పెంచాలని నిర్ణయించారు. రాష్ట్ర వ్యాప్తంగా ఖరీఫ్‌లో 1100, రబీలో 1100 గ్రామాల్లో సీడ్ విలేజ్ పథకాన్ని చేపట్టనున్నట్లు ప్రణాళికలో తెలిపారు.


వ్యవసాయ ప్రణాళికను విడుదల చేస్తున్న ముఖ్యమంత్రి

మిర్చి,పత్తి,పొగాకు,బోర్లక్రింద వరిసాగు చేసే ప్రాంతాల్లో నూనెగింజల పంటలు, పప్పుధాన్యాలు, సజ్జ, జొన్న వంటి పంటలను సాగుచేసే విధంగా రైతులను ప్రోత్సహిస్తారు. ఉత్పాదకతను పెంచడం, సేంద్రియ వ్యవసాయాన్ని ప్రోత్సహించడం, 40 వేల మంది మహిళా రైతులకు శిక్షణ ఇప్పించడం, రైతుమిత్ర గ్రూపులను మరో లక్ష ఏర్పాటు చేయడం వంటి వాటిపై దృష్టి పెట్టారు. 11 వేల వర్మికంపోస్టు యూనిట్లను నెలకొల్పాలనేది లక్ష్యంగా పెట్టుకొని, ఒక్కో యూనిట్‌కు ఐదున్నర వేలరూపాయలను కేటాయిస్తారు.

120 కోట్ల రూపాయలతో చిన్న సన్నకారు రైతులకు ఉపయోగపడే యంత్ర పరికరాలను 50 శాతం రాయితీతో అందజేయడం, 'శ్రీ' వరిసాగును పెద్దఎత్తున ప్రోత్సహించడం వంటి కార్యక్రమాలను నిర్ణయించారు.

## పొద్దుతిరుగుడు సాగుకు సూచనలు

పొద్దుతిరుగుడును సాగుచేసే రైతులు కేంద్ర ప్రభుత్వం కొన్ని సూచనలు చేసింది. ఆయా ప్రాంతాల్లోని రైతులు అధిక దిగుబడినిచ్చే, హైబ్రిడ్ విత్తనాలను మాత్రమే వాడాలని మన రాష్ట్రంతో సహా మరో 15 రాష్ట్రాలకు సూచించింది. విత్తనాలను శుద్ధి చేసుకోవాలని, మచ్చతెగులుకు అవసరమైన చర్యలు తీసుకోవాలని రైతులను కోరింది.

## గ్రామీణ విద్యుదీకరణకు నిధులు

విద్యుత్ రంగంలో మౌ సదుపాయాల కల్పనకు, గ్రామీణ ప్రాం విద్యుదీకరణకు కేంద్రం 1440 రూపాయల ఆర్థిక సహాయం అందిస్తోంది. నిధులతో సబ్‌స్టేషన్‌లు, వ్యవసాయ వి కనెక్షన్‌లు, పదిలక్షల గృహాలకు విద కనెక్షన్‌లు వంటివి అమలు చేస్తారు.

## సహకార సంస్కరణలు

## వ్యవసాయ విద్యుత్ కనెక్షన్లు

రాష్ట్రంలోని రైతులకు మరో లక్ష వ్యవసాయ విద్యుత్ కనెక్షన్‌లు ఇవ్వా ప్రభుత్వం నిర్ణయించింది. ఇందులో 50 నేరుగాను, లక్ష కనెక్షన్‌లు తత్కాల్ పద్ధ ఇస్తారు. ఇప్పటికే రాష్ట్రంలో 23.50 ల వ్యవసాయ విద్యుత్ కనెక్షన్‌లు వున్నా తాత్కాల్ క్రింద హెచ్‌పి వెయ్యి రూపాం చొప్పున రైతులు చెల్లించాలి. తత్కాల్ కోరు వారు ఎక్కువగా వుంటే సీనియారిటీ ప్రక ఇస్తారు. ఈ కనెక్షన్‌ల వల్ల మరో 6 ల ఎకరాలు సాగులోకి వస్తుందని ప్రభు అంచనా వేస్తోంది.

| జిల్లాపేరు | ఉచిత విద్యుత్ పథకం | తత్కా పథక |
|---|---|---|
| శ్రీకాకుళం | 200 | 170 |
| విజయనగరం | 280 | 85 |
| విశాఖ | 470 | 120( |
| తూర్పుగోదావరి | 500 | 225 |
| పశ్చిమగోదావరి | 1250 | 500( |
| కృష్ణ | 800 | 700( |
| గుంటూరు | 750 | 1400( |
| ప్రకాశం | 1750 | 1050( |
| నెల్లూరు | 1500 | 350( |
| చిత్తూరు | 4500 | 350( |
| కడప | 2500 | 350( |
| అనంతపురం | 3000 | 900C |
| కర్నూలు | 1700 | 7000 |
| మహబూబ్‌నగర్ | 4100 | 6000 |
| నల్గొండ | 5200 | 9000 |
| మెదక్ | 4500 | 5000 |
| రంగారెడ్డి | 1500 | 4000 |
| వరంగల్ | 5400 | 1500 |
| కరీంనగర్ | 3750 | 2000 |
| నిజామాబాద్ | 3500 | 1500 |
| ఆదిలాబాద్ | 1450 | 1000 |
| ఖమ్మం | 1400 | 1000 |
| మొత్తం | 50000 | 100000 |

రాష్ట్రంలో వున్న సహకార
ఘాలను దాదాపు 2000 వరకు
చేందుకు రాష్ట్ర మంత్రివర్గ సమావేశం
యించింది. అయితే ఉద్యోగులను
గించకూడదని అభిప్రాయపడింది.
ంగా ఫరవాలేదనుకున్న సంఘాలు 300
డలాల్లో 946 వున్నాయి. మరో 1100
ాలు నష్టాల్లో వున్నప్పటికీ మండలానికి
ి వుండాలన్న అభిప్రాయంతో వాటిని
సాగిస్తామని మంత్రి తెలియజేసారు.

### ...చాయితీరాజ్ చెరువులు ...నర్ ఇరిగేషన్ కు బదిలీ

పంచాయితీరాజ్ శాఖ పరిధిలో 66,195 చెరువులను చిన్న నీటిపారుదల పరిధిలోకి బదిలీ చేస్తూ ప్రభుత్వం ...ర్వులు జారీ చేసింది. ఈ చెరువుల క్రింద 5 లక్షల హెక్టార్ల ఆయకట్టు వుంది. ...వుల నిర్వహణను గ్రామ పంచాయితీల ...ానే నిర్వహిస్తారు.

### ...ట్రోఫా సాగు

రాష్ట్రంలోని దుర్భిక్ష ప్రాంతాలలో జిల్లాల్లో 40 వేల హెక్టార్లలో బయోడీజిల్ ...క్కలైన జట్రోఫాను సాగును ...్రసహించాలని ముఖ్యమంత్రి అధికారులను ...శించారు. జట్రోఫా మొక్కలను సేకరించి, ...ృదయ రైతులను గుర్తించి సాగును చేసేట్లు ...దాలని కోరారు. దీనికి అవసరమైన ...ంకేతిక సలహాలను, పరిశోధనలను క్రీడా, ...వసాయ విశ్వవిద్యాలయం, ఇక్రిసాట్ వంటి ...ంస్థలను భాగస్వాములను చేయాలని ...ంచారు.

### ...గునీటికి నిధులు

2005-06 ఆర్థిక సంవత్సరంలో ...శంలోని నివాన ప్రాంతాలకు రక్షిత ...ంచినీటి సరఫరా చేసేందుకు కేంద్ర ...భుత్వం 4750 కోట్ల రూపాయలను ( 40 ...తం అదనంగా) కేటాయించింది. గత ఏడాది ...300 కోట్ల రూపాయలను కేటాయించారు. ...స్తుతం దేశంలోని 13,56,031 ...రగామలకు త్రాగునీరు సరఫరా ...ుగుతోందని ఇంకా 60,884 గ్రామాలకు ...క్షికంగా నీటిసరఫరా అందుతోందని ...భుత్వం తెలిపింది.

### ...త్తనాభివృద్ధి సంస్థకు అవార్డు

రాష్ట్ర విత్తనాభివృద్ధి సంస్థ ( ఏపిఎస్ ...డిసి) కు 2002-03 సంవత్సరానికి గాను ...ండియన్ ప్రొడక్టివ్ కౌన్సిల్ అవార్డు ...భించింది. అవార్డును సంస్థ మేనేజింగ్ డైరక్టర్ ...బూరావుకు అందజేస్తారు. వివిధ రాష్ట్రాలలో వున్న 18 విత్తనాభివృద్ధి సంస్థలలో ఏపీసీడ్స్ ముందంజలో వున్నది. ఇదే విధంగా గతంలో కూడా రెండుసార్లు అవార్డు లభించింది.

### బిటి పత్తి సాగుకు అనుమతి

రాష్ట్రంలో 2 లక్షల 85 వేల ఎకరాల్లో బిటి పత్తి విత్తనాల సాగుకు ప్రభుత్వం అనుమతినిచ్చింది. గత ఏడాది లక్షా 82 వేల ఎకరాల్లో ఈ సాగుకు అనుమతినిచ్చారు. రాశి, ప్రోఆగ్రో, నూజివీడు సీడ్స్ కంపెనీలు రూపొందించిన బిటి విత్తనాల సాగుకు అనుమతి నిచ్చినట్లు వ్యవసాయ శాఖ తెలియజేసింది.

### డైరీల పునరుద్ధరణ

రాష్ట్రంలో మూతపడిన ప్రొద్దుటూరు, రాజమండ్రి, చిత్తూరు పాలడైరీలను పునరుద్దరించదానికి 60 కోట్ల రూపాయలను జాతీయ పాల అభివృద్ధి సంస్థ ( ఎన్ డి డిబి) రుణాన్ని అందిస్తుందని పశుసంవర్ధక శాఖామాత్యులు తెలియజేసారు. దీంతో పాటుగా నూతన సాంకేతిక విజ్ఞానాన్ని కూడా అందిస్తుంది. ఈ మూడు డైరీలలో ప్రస్తుతం వున్న 189 కోట్ల టర్నోవరును 300 కోట్లకు పెంచాలనే లక్ష్యం పెట్టుకున్నట్లు తెలిపారు.

## ఇదీ మన అప్పు

మన రాష్ట్ర అప్పు ఏడాదికేడాది పెరిగిపోతోంది. **2005-06** ఆర్థిక సంవత్సరానికి **76,519** కోట్ల రూపాయలని ప్రభుత్వ లెక్కలు చెపుతున్నాయి. దీనికై వడ్డీ, ఇతర చెల్లింపులు సంవత్సరానికి **7923** కోట్ల రూపాయలు కదుతున్నాం. **1995-96** ఆర్థిక సంవత్సరంలో వున్న **15164** కోట్ల రూపాయలు అప్పుకు వడ్డీ **1529**కోట్ల రూపాయలు వుండేది. **1995-96** లో తలసరి అప్పు **2165** రూపాయలు వుంటే నేడు **9564** రూపాయలకు చేరుకుంది. భారత రిజర్వ్ బ్యాంకు ప్రకారం రాష్ట్రాల స్థూల ఉత్పత్తులలో రుణాల పరిమాణ శాతం పరిశిలిస్తే మన రాష్ట్రంలో **28.2** శాతం, బీహార్‌లో **75.5** శాతం, ఒరిస్సా **60.1** శాతం, రాజస్థాన్ **42.8**శాతం, తమిళనాడు **22.6** శాతం, కర్నాటకలో **24.9** శాతంగా వున్నది. మన రాష్ట్రం అప్పు క్రింది విధంగా వున్నది.




## అప్పుల ఊబిలో రైతన్న

దేశంలోని రైతాంగం అప్పుల ఊబిలో కూరుకుపోయి వుందని జాతీయ శాంపిల్ సర్వే ఆర్గనైజేషన్ (ఎన్ఎస్ఎస్ఓ) తెలిపింది. మొత్తం దేశంలోని రాష్ట్రాలను పరిశీలిస్తే మన రాష్ట్ర రైతులు 82 శాతంతో అధికంగా అప్పుల్లో మునిగివున్నారని పేర్కొంది. పంజాబ్‌లో 65.4 శాతం, తమిళనాడులో 74.5 శాతం వుంది. జాతీయ స్థాయిలో 48.6 శాతం మంది రైతులు అప్పుల్లో వున్నారు. జాతీయ సగటు చూస్తే ఒక్కో రైతు కుటుంబానికి సుమారు 12,585 రూపాయల అప్పు చేసినట్లు లెక్కలు చెపుతున్నాయి. మన రాష్ట్రంలో సగటు చూస్తే సుమారు 23,965 రూపాయలుగా తేలింది. మన రాష్ట్రంలో రైతులు 57 శాతం మంది వడ్డీ వ్యాపారులపైన ఆధారపడి వున్నారని సంస్థ తెలిపింది.

# తెలుసుకో రైతన్నా

## వర్షబీమా 2005

ప్రతికూల వర్షపాతం కారణంగా పంట నష్టపోయే అవకాశం ఉన్న రైతులను సమర్థవంతంగా ఆదుకునేందుకు అగ్రికల్చర్ ఇన్సూరెన్స్ కంపెనీ ఆఫ్ ఇండియా (ఎ.ఐ.సి) వర్షబీమా 2005ను ప్రవేశ పెట్టింది.

**ఈ పథకం ముఖ్యాంశాలు :**

❖ వర్షపాతం తగ్గుదల ఆధారంగా బీమా నష్టపరిహారం చెల్లింపు.

❖ వ్యవసాయదారులు అందరూ- చిన్న/సన్నకారు రైతులు / యజమానులు లేదా కౌలు దారులు/పాలుదారులు తీసుకోవచ్చు.

❖ గుర్తించిన ప్రాంతాలు, పంటలు పండించే రైతులకు మాత్రమే అందుబాటులో ఉంటుంది.

❖ జాతీయ వ్యవసాయ బీమా పథకం వర్తించని రైతులకు ఇది ప్రధానంగా అందుబాటులో ఉంటుంది.

**బీమా గడువు : కాలం-నిర్దేశిత పంట**

❖ జూన్ ఒకటి నుంచి సెప్టెంబర్ 30 వరకు స్వల్పకాలిక పంటలకు

❖ జూన్ ఒకటి నుంచి అక్టోబర్-31 వరకు మధ్యకాలిక పంటలకు

❖ జూన్ ఒకటి నుంచి నవంబర్ - 30 వరకు

❖ దీర్ఘకాలిక పంటలకు

❖ " విత్తలేని స్థితి" అవకాశాన్ని ఎంచుకున్న వారి విషయంలోనైతే-అది జూన్ 15 నుండి ఆగస్టు 15 వరకు

**బీమా తీసుకోవడానికి గడువు :**

❖ స్వల్పకాలిక పంటలు సాగు చేసే వారు వర్షబీమాను జూన్-15 లోగా తీసుకోవాలి.

❖ దీర్ఘకాలిక పంటల్ని సాగుచేసే రైతులు జూన్ 30 లోగా తీసుకోవచ్చు.

**ప్రీమియం :**

❖ ఇది ముందుగానే నిర్ణయమై ఉంటుంది. బీమా చేసుకొనే పంట ఎంచుకునే బీమా ఆప్షన్స్ ఆధారంగా ఉంటుంది.

❖ వివిధ రకాల పంటలు / ప్రాంతాలు/ ఎన్నుకొన్న పథకం ప్రకారం ప్రీమియం నిర్ణయించబడుతుంది.

క్లెయిమ్ చెల్లింపు విధానం - టైం షెడ్యూల్ :

❖ క్లెయిమ్ చెల్లించు విధానం ఆటోమేటిక్.

❖ బీమా చేసిన రైతు '' నష్టపరిహార సమాచారం లేదా క్లెయిమ్ సమాచారాన్ని " సమర్పించాల్సిన అవసరంలేదు.

❖ వాస్తవిక వర్షపాతం నివేదిక ఆధారంగా గడువు ముగిసినప్పటి నుంచి రెండు వారాల లోపు క్లెయిమ్స్ పరిష్కారం.

**క్లెయిమ్ చెల్లింపు ఎలా?**

❖ వర్షపాతంలో హెచ్చుతగ్గుల ఆధారంగా క్లెయిమ్‌ల చెల్లింపునకు గ్యారంటీ ఇస్తుంది.

❖ నిర్దేశిత బీమా కాలంలో నమోదైన 'వాస్తవిక వర్షపాతం; 'సాధారణ వర్షపాతం' కంటే తక్కువగా ఉన్నపుడు క్లెయిమ్స్ ప్రస్తావన వస్తుంది. అంటువంటి పరిస్థితులలో బీమా చేయించుకున్న రైతులందరికి, బీమా చేసిన పంట, ప్రాంతం తమ ఆప్షన్స్ ఆధారంగా నష్టపోయిన వారిగా గుర్తించి క్లెయిమ్స్ కోసం అర్హులుగా పరిగణిస్తారు.

❖ బీమా వర్తింపు కోసం గుర్తించిన అన్ని ప్రాంతాలలో భారతీయ వాతావరణ అధ్యయన విభాగం (ఐ.ఎం.డి.) ఆధ్వర్యంలోని వర్షపాత నమోదు కేంద్రం లెక్కింపు ఆధారంగా వాస్తవిక వర్షపాత తగ్గుదలను కొలిచి, వర్షపాత డేటాను లెక్కిస్తారు. దీని ఆధారంగానే నష్టపరిహారం చెల్లించడం జరుగుతుంది.

❖ ఐ.ఎం.డి. కేంద్రం ఉన్న మండలంతో పాటు చుట్టు పక్కలున్న మండలాలకూ ఆ కేంద్రం ఇచ్చే వర్షపాత నివేదిక వర్తిస్తుంది.

**వర్షబీమాలోని పరిమితి ప్రత్యామ్నాయాలు**

ప్రత్యామ్నాయం-1 : సీజనల్ వర్షపాత బీమా

❖ బీమా మొత్తం కాలంలో వాస్తవిక వర్షపాతం సాధారణ వర్షపాతం కంటే 20 శాతం కన్నా తగ్గినప్పుడు ఈ ప్రత్యామ్నాయం వర్తిస్తుంది.

❖ బీమా కాలంలో నెలసరి వర్షపాతమే వాస్తవిక వర్షపాతం

❖ వాస్తవిక వర్షపాతంలో - ప్రతికూల వాతావరణ స్థితిగతులని భిన్న స్థాయిలకు అనుగుణంగా నిర్ణయించి క్లెయిమ్‌ను చెల్లిస్తారు.

ప్రత్యామ్నాయం - 2 : వర్షపాత వ్యాప్తి సూచి

❖ బీమా గడువు కాలంలో వాస్తవిక వర్షపాత సూచిక కంటే సాధారణ వర్షపాత సూచికలోని తగ్గుదల 20 శాతానికి మించినట్లయితే

❖ వాస్తవిక వర్షపాత సూచికలోని ప్రతికూల వ్యత్యాసాల తారతమ్య స్థాయిల అనుగుణంగా గ్రేడులను నిర్ణయించి (స్లాబులలో) క్లెయిమ్ చెల్లింపులను చేస్తారు.

ప్రత్యామ్నాయం - 3 : విత్తలేక పోవుట

❖ జూన్ -15 నుంచి ఆగస్టు-15 వరకు నమోదైన వాస్తవిక వర్షపాతం, సాధారణ వర్షపాతంలో 40 శాతం కంటే అధిక తగ్గినట్లయితే ఈ పథకం వర్తిస్తుంది.

❖ హెక్టారుకు ఇంత అని బీమా చేస్తారు. ఃకాలం ముగిసే నాటికి సాగుదారుడు వ్య- చేసిన అత్యధిక ఉత్పాదక వ్యయ (హెక్టారుకు) పరిగణలోకి తీసుకుంటారు. ముందే నిర్దేశింపబడి ఉంటుంది.

❖ 80 శాతం లేదా అంతకుమించి తగ్గి ఉన్నప్పుడు మాత్రమే బీమా చేసిన మొ- నూటికి నూరు శాతం చెల్లిస్తారు.

**వర్షబీమాను ఎలా కొనుగోలు చేయాలి**

ఆసక్తిగల రైతులు వ్యక్తిగతంగా వివరాలతో 'ప్రపోజలు' ఫారంను నింపి చెల్లించదలచిన ప్రీమియం, దానిపై 1 శాతం సర్వీస్ టాక్స్ మొత్తాన్ని కలిపి తమ ఎక్కడైతే బ్యాంక్ ఎకౌంట్ ఉందో అ- సమర్పించాలి. బ్యాంక్ శాఖవారు ముట్టినట్టు రశీదు ఇస్తారు. ఒకవేళ రైతు సంఘాలై ఉదా. రైతుమిత్ర గ్రూపులు, సేవా సంఘా లేదా మరేదైనా సంఘ సభ్యులైనా వారంద-

❖ తాము (రైతుసంఘం సభ్యులు) గుర్తిం సంఘం కన్వీనర్‌కు లేదా కో-కన్వీనర్‌కు లే అధ్యక్షునికి ప్రపోజల్సు ఇవ్వాలి. రైతుల తర- వ్యవహరించే వ్యక్తి అందరి వ్యక్తిగత వివరాల సేకరించి ఆ వివరాలతో కూడిన ప్రపోజల్‌ను, ప్రీమియం మొత్తానికి తమ అకౌంట్ ఉన్న బ్యాంకుకు సమర్పించడం లేదంటే ఎ.ఐ.సి. కార్యాలయానికి ప్రీమియ- డిడితో సహా నేరుగా పంపవచ్చు.

**ఇతర బీమా పథకాలు వర్తించవు**

❖ వర్షబీమాను తీసుకొన్న రైతులు ఆ- కాలంలో అదే పంట, అదే సర్వే నెంబ- భూమికి - మరో పంటల బీమా పథకం చేరకూడదు.

❖ వర్షబీమాలోని ఏదో ఒక ప్రత్యామ్నాయాని మాత్రమే రైతు ఎంచుకోవాల్సి ఉంటుంది.

**2005 - ఖరీఫ్ సీజన్‌లో అమలు**

❖ అనంతపురం, కడప, కర్నూలు నిజామాబాద్, వరంగల్, ఖమ్మం ఆదిలాబాద్ కరీంనగర్, విశాఖపట్నం జిల్లాలలో, కొన్ని నిర్దేశిత మండలాలలో నిర్దేశిత పంట వర్షబీమా అందుబాటులో ఉంది.

**మిగతా వివరాలకు సంప్రదించండి :**

❖ అగ్రికల్చర్ ఇన్సూరెన్స్ కంపెనీ ఆఫ్ ఇండియా లిమిటెడ్, రీజనల్ ఆఫీసు, 8 వ అంతస్తు, యునైటడ్ ఇండియా టవర్స్ బషీర్‌బాగ్, హైదరాబాద్ టెలిఫోన్ నెంబ- :95-40-23242363/ 23242594

Printed & Published by B.TULASIDAS on behalf of A.P.Rytu Sangham, 1-1-9/10, Jawaharnagar, Musheerabad, Hyderabad -2( at Prajasakti Printing Press, RTC 'x' Roads, HYDERABAD.20. Editor. B.TULASIDAS

BCR

R.O.No. : 165/Sou/Advt.1/2005



# ప్రతి అడుగు ప్రజలకోసం



## స్ఫూర్తివంతమైన నాయకత్వంలో అభివృద్ధి పథంలో ఆంధ్రప్రదేశ్

- ఊరూరా, వాడవాడల పర్యటిస్తూ, ప్రజలను పలకరిస్తూ సమస్యలను పరిష్కరించే ప్రయత్నమే 'రాజీవ్ పల్లెబాట'
- ప్రతి గ్రామాన్ని ఇంటర్‌నెట్ ద్వారా అనుసంధానం చేసి వారికి ఆన్‌లైన్ ద్వారా సమాచారం అందించడం కోసం 'రాజీవ్ ఇంటర్నెట్ విలేజ్'
- నిరుద్యోగ యువత కోసం ఉపాధి లక్ష్యంగా 'రాజీవ్ యువశక్తి'
- రూ. **500** కోట్లతో ఎస్.సి., ఎస్.టి, బలహీన వర్గాల సమగ్రభూమి అభివృద్ధి ప్రాజెక్టు 'ఇందిర ప్రభ'
- ప్రజలతో ప్రత్యక్ష సంబంధాలను కలిగి వుంటూ, వారి సమస్యలను తెలుసుకుని, వాటికి తక్షణమే తగిన పరిష్కారాన్ని చూపించే 'రాజీవ్ నగరబాట'
- పట్టణ పేదలకు అందుబాటు ధరలో గృహ వసతి కల్పించేందుకు 'రాజీవ్ గృహకల్ప'
- ఎస్.సి., ఎస్.టి., బి.సి. మరియు ఇతర భూమి లేని లక్ష మంది నిరుపేదలకు రిపబ్లిక్ డే ఒక్క రోజునే **1,50,000** ఎకరాల భూమి పంపిణీ చేయడం జరిగింది.
- వచ్చే ఐదేళ్ళలో రికార్డు స్థాయిలో **46** వేల కోట్ల రూపాయల ఖర్చుతో నీటిపారుదల ప్రాజెక్టుల నిర్మాణానికి ప్రణాళికలు

జారీ చేసినవారు : సమాచార, పౌరసంబంధాల శాఖ



### మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA106M226 |
| పుస్తకం పేరు | రైతువాణి |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | mary |
| పేజీలు విడదీసినది | mary |
| స్కాన్ చేసినది | Naveen |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |